# చతుర

ఏప్రిల్ 2009
రూ.10/-



రాజేష్‌కుమార్ తమిళ థ్రిల్లర్

## ఒకటి + ఒకటి = మూడు

అనువాదం : జిల్లేళ్ళ బాలాజీ



# క్యాప్షన్ మీదే - 4





ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పైకార్టూన్‌కు నవ్వొచ్చే క్యాప్షన్ రాయండి. శ్రీధర్ ఆటోగ్రాఫ్‌సహా చక్కని బహుమతి అందుకోండి! బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ క్యాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈనెల 16

చిరునామా: క్యాప్షన్ మీదే- 4, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082

e-mail : chatura@eenadu.net

# మనసున ఉన్నదీ...



★ మార్చినెల 'చతుర' ఆసాంతం చదివించింది. బద్దినాగేశ్వరరావు, మాధవీసనారా, రుక్మిణి, మాధురి, మల్లాది నరసింహమూర్తి 'కొత్తగాలి' కవితలు బాగున్నాయి. ఆలోచనాత్మకంగానూ, సందేశాత్మకంగానూ ఉన్నాయి. శ్రీమతి యర్రమిల్లి విజయలక్ష్మి 'కౌముది' నవల ఆర్ద్రంగా ఉంది. రచనలో, శైలిలో అనుభవ పరిపాకం, చదివింపజేసే ధోరణి ఉంది. అక్కడక్కడ నవలను సాగదీసిన విధానం కూడా కనిపించింది. మల్లాది వెంకటకృష్ణమూర్తి 'మూడోగాడిద' చతురకత చమత్కార భరితంగా అలరించింది.

**- రామడుగు వెంకటేశ్వర శర్మ**, గుంటూరు

★ మనస్థిమితం లేని పిల్లలు పుట్టకుండా ఎన్నో ముందస్తు చర్యలు తీసుకునేలా వైద్య శాస్త్రం పురోగమించినా, అది అందరికీ అందుబాటులో లేకపోవచ్చు. అవగాహనా లోపం కావచ్చు. భగవన్నిర్ణయం కావచ్చు. తీరా పుట్టాక పారేయలేం కదా! వాళ్లపట్ల తల్లిదండ్రులు పడే ఆవేదనను విజయలక్ష్మి 'కౌముది' నవలలో చక్కగా చిత్రించారు. 'కొత్తగాలి' శీర్షిక క్లిక్కయింది. 'గృహహింస' మీద యర్రంశెట్టిగారు మంచి హాస్యం అందించారు. విభిన్న శీర్షికలతో 'చతుర' అలరిస్తోంది.

**-జి.జి.కె.రావు**, శ్రీకాకుళం

★ ఛార్మి ముఖచిత్రంతో 'చతుర' మార్చి నెల సంచిక ఛార్మింగ్‌గా ఉంది. ఇన్ని మంచి అలవాట్లు ఉండబట్టే ఛార్మి అంత అందంగా ఉందని చల్లా భాగ్యలక్ష్మి అందించిన ఛార్మి సంగతులు చదివాక తెలిసింది. 'కౌముది' నవల ఆసాంతం ఆసక్తిగా చదివాం. ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయవేదిక ఇంగ్లీషు సినిమా చూస్తున్నంతగా ఆకర్షిస్తోంది. 'టాంక్ బండ్ కథలు' నచ్చుతున్నాయి. చతురకత మినీకథగా అలరిస్తోంది. నవలలో కథనానికి తగ్గట్టు భాస్కర్ అందిస్తున్న చిత్రాలు సజీవంగా ఉంటున్నాయి.

**- నేమాన సుభాష్ చంద్రబోస్**, శ్రీకాకుళం

★ 'కౌముది' నవల అందించిన శ్రీమతి యర్రమిల్లి విజయలక్ష్మికి మొదటగా నా హృదయపూర్వక అభినందనలు. కథావస్తువు, రచనాశైలి చాలా బాగున్నాయి. చదువుతుంటే మన పక్కవాళ్లకు జరిగిందా అనిపించింది. ఏతల్లికి ఇలా జరుగకూడదని భగవంతుడ్ని వేడుకుంటున్నా! చివరికి అనాథ శరణాలయం ఏర్పాటుతో సంతృప్తి కలిగింది. ఇది అందరికి సాధ్యం కాదనుకుంటా!

**- వి. వెంకటరాం నర్సయ్య**, హనుమకొండ

★ 'కౌముది' నవల చాలా బాగుంది. ఆడజన్మ ఎంత అపురూపమైందో.. పుడితే ఆడదానిగానే పుట్టాలనిపించింది. తల్లిప్రేమ బిడ్డను ఎలా చూసుకుంటుందో మనసుని కదిలింపజేసింది. నాకు పెళ్లయిన ఏడాదికే బాబు పుట్టి 28 రోజులకే చనిపోయాడు. 'కౌముది' చదువుతుంటే నా కన్నబిడ్డ మీద నేను పెంచుకున్న ఆశలు అడియాసలయ్యాయని ఎంతో దుఃఖం వచ్చింది. నాలాగ ఎవ్వరికీ కాకూడదని కోరుకున్నా. యర్రమిల్లి విజయలక్ష్మి తల్లిప్రేమను వర్ణించిన తీరు హృదయాన్ని కదిలించింది. రచయిత్రికి కృతజ్ఞతలు.

**- వాడవల్లి రమాదేవి**, ఆరుగొలను, కృష్ణాజిల్లా

★ మార్క్‌ట్వేన్ నవల 'అడ్వంచర్స్ ఆఫ్ హకల్‌బెరీఫిన్' పరిచయం విజ్ఞానదాయకంగా ఉంది. అమెరికాలో ఆనాటి బానిసల స్థితిగతులను కళ్లకుకట్టింది. జ్ఞానపీఠాల్లో బెంగాలీ రచయిత తారాశంకర్ బంధోపాధ్యాయ గురించి ఎన్నో విషయాలు తెలుసుకున్నాం. వింతలు, విశేషాలెన్నిటినో చతుర ప్రపంచం మాముందుకు తెస్తోంది. 'కౌముది' నవల హృదయాన్ని కదిలించింది.

**- శ్రీరామ్**, హైదరాబాద్

---

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ -500 082
ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

# చతుర

సంపుటి -32
సంచిక - 03
ఏప్రిల్ 2009
375వ సంచిక

* కాప్షన్ మీదే - 4 03

* మనసున ఉన్నదీ... 04

* మెరుపుతీగ దీపిక 6

* యర్రంశెట్టి సాయి అపార్ట్‌మెంటాలజీ
ఓర్నాయనో! గృహ హింస! -2 8

* ప్రవేశిక విజేతలు 113

* కాలాతీతం
ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదికలో అలెగ్జాండర్ డ్యూమా నవల
ది త్రీ మస్కటీర్స్ 118

* జ్ఞాన పీఠాలు
కన్నడ మణిపూస కె.వి.పుట్టప్ప 124

* నిన్నటి నిజం 126
సేకరణ : పాణ్యం రామశేష శాస్త్రి

* టాంక్‌బండ్ కథలు-18
ఉద్యోగం 127

* ఏప్రిల్ ప్రవేశిక 130

ముఖపత్రాలంకరణ : రాజు యాట



'రోజూ రాత్రిపూట వృత్తిరీత్యా మాట్లాడటానికే జయంతి ఇంటికి వస్తున్నారా కైలాష్? షర్టు విప్పి, ఈ ఇంట్లో మీరు కూర్చున్న తీరే చెబుతోంది కైలాష్ మీరెలాంటివారో' అన్నాడాఅధికారి. అసలు జయంతి, కైలాష్‌ల మధ్య సంబంధం ఎలాంటిది? అక్షరాక్షరంలో ఉత్కంఠ రేపే **రాజేష్ కుమార్** తమిళ నవలకు **జిల్లేళ్ళ బాలాజీ** తెలుగు అనువాదం

**ఒకటి + ఒకటి = మూడు**

బొమ్మలు: ఆనంద్

14 వ పేజీలో



# మెరుపుతీగ దీపిక

ఆమె అంతర్జాతీయంగా పేరుగాంచిన ప్రఖ్యాత బ్యాడ్మింటన్ ఆటగాడు ప్రకాష్ పదుకొనె ముద్దుల కూతురు. తనూ తండ్రిలాగే బ్యాడ్మింటన్ ప్లేయర్. హైస్కూల్‌లో రాష్ట్రస్థాయి బ్యాడ్మింటన్ ఆటలో పాల్గొంది. అయితే మోడలింగ్ రంగంపై ఆసక్తితో కాలేజీ రోజుల్లో లిరిల్, డాబర్ లాల్ పౌడర్, క్లోజ్-అప్ టూత్‌పేస్ట్, లిమ్కా తదితర కంపెనీల ప్రకటనల్లో నటించింది. రిటెయిల్ జువెల్లరీ షో బ్రాండ్ అంబాసిడర్‌గా వ్యవహరించింది. 2006లో ఐశ్వర్య అనే కన్నడ సినిమా ద్వారా వెండితెరపై మెరిసింది. 2007లో 'ఓం శాంతి ఓం' లో షారూక్ ఖాన్ సరసన నటించి లెక్కలేనన్ని అవార్డులు, ప్రశంసలు పొందింది. ఇటీవల విడుదలైన 'చాందిని చౌక్ టు చైనా' కూడా మంచి ఆదరణ పొందింది. ఈ ఇరవై మూడేళ్ల దీపికా పదుకొనె తన అంద చందాలు, ఆరోగ్య రహస్యాలను వివరించిందిలా..

☆ షూటింగ్‌లు ఉన్నప్పుడు ప్రతిరోజూ ఏడు గంటల లోపలే నిద్రలేస్తాను. తక్కిన రోజుల్లో ఉదయం ఎనిమిది గంటల వరకు పడుకుంటాను.

☆ ప్రతిరోజూ క్లీన్సింగ్, టోనింగ్, మాయిశ్చరైజింగ్ చేసుకుంటాను. వారానికో సారి గోరువెచ్చని కొబ్బరినూనె లేదా బేబీ ఆయిల్‌తో మసాజ్ చేయించుకుంటాను. ఇది నన్నెంతగానో ప్రేరేపించి, నాలో కొత్త

దనాన్ని తీసుకొస్తుంది. ఫేషియల్స్‌కోసం ఎక్కువగా వెళ్లను. అలాగే అతిగా మేక్ అప్ కోసం వెంపర్లాడను.

☆ జీవక్రియల ఫలితంగా శరీరంలో ఏర్పడే వ్యర్థ విషపదార్థాలను బయటికి పంపించడంలో నీటిపాత్ర అమోఘం. అందుకే వీలైనంత ఎక్కువగా నీళ్లు తాగుతాను. దీంతో చర్మం కూడా చాలా చక్కటి నిగారింపును సంతరించుకుంటుంది. ఓ గ్లాసెడు వేడినీళ్లలో పరగడుపునే తేనె కలుపుకుని తాగితే జీర్ణవ్యవస్థను శుద్ధి చేయడమేకాకుండా ఒంట్లోని కొవ్వును తగ్గిస్తుందని అంటారు.

☆ ఆరోగ్యకరమైన శరీరంకోసం ప్రతి ఒక్కరూ ప్రప్రథమ ప్రాధాన్యం ఇవ్వాలి. దానికోసం ఎక్సర్‌సైజులు చేయాలి, జిమ్‌కు వెళ్లాలి. వర్కవుట్స్‌కు సంబంధించి ఎక్కువగా కార్డియో, లైట్ వెయిట్స్ చేస్తాను. నా జఘన భాగానికి ప్రాముఖ్యమిస్తాను.

☆ ఆరోగ్యకరమైన సాధారణ ఆహారం శారీరక పటుత్వానికి మొదటి సోపానం. పిండి పదార్థాలు, కొవ్వులు ఉన్న సమతుల ఆహారాన్ని తీసుకుంటాను. రోజుకు మూడుసార్లు తింటాను. వాటిలో బ్రేక్‌ఫాస్ట్ చాలా ముఖ్యమైనది. దక్షిణ భారత వంటకాలు చాలా ఎక్కువ మోతాదులో శక్తినిస్తాయి. అందుకే ఆలూ లేకుండా దోసె, పుదీనా చట్నీకి బదులు కొబ్బరి చట్నీతో ఇడ్లీ, గుడ్డులో తెల్లసొన మాత్రమే తింటాను.

☆ చిన్నప్పుడు బ్యాడ్మింటన్ బాగా ఆడటంవల్ల దాని ప్రభావం నా శరీరంపై బాగా పడింది. నాది అథ్లెటిక్ బాడీ. ప్రతి ఒక్కరూ రోజులో కొద్దిసమయాన్ని ఆటలకు కేటాయించడంవల్ల ఒత్తిడిని దూరం పెట్టవచ్చు. స్నేహితులు, సన్నిహితులతో మాట్లాడటం మనకు మేలు చేస్తుంది.

☆ చాలా చిన్న వయసులోనే అనవసరంగా ఏమేమి తినాలో, ఏమేమి చేయాలో



నని ఆందోళన చెందక్కర్లేదు. అయితే బరువు పెరుగుతున్నారనిపిస్తే యోగ, ఏరోబిక్స్, డాన్స్‌లాంటివి చేస్తూ ఆహారాన్ని కొద్దిగా తగ్గించాల్సి ఉంటుంది.

☆ సరైన జీవన శైలి, మంచి ఆహారం, చర్మ సంరక్షణ, వ్యాయామం మనల్ని చాలా చక్కగా, అందంగా ఉండేలా తీర్చిదిద్దుతాయి.

☆ చర్మ సంరక్షణకు సహజసిద్ధంగా దొరికేవాటితో తయారైన ఉత్పత్తులనే వాడటం మంచిది. ఇతర కెమికల్స్ చర్మానికి అంత మంచి చేయవు.

☆ ద్రాక్ష, మామిడి, పుచ్చకాయల్ని ఆయా కాలాల్లో బాగా తింటుంటాను.

☆ నాకిష్టమైన వంటకాలు చేపలకూర, రొయ్యల కూర, రొట్టె.

☆ అలాగే ప్రతివ్యక్తి తనకు నప్పేలా, హుందాగా ఉండే డ్రెస్సు వేసుకోవాలి. ఇది కూడా మన అందానికి అదనపు శోభనిస్తుంది. పొట్టి స్కర్టులు, ఎత్తు మడమ పాదరక్షలులాంటివి నచ్చవు. Ⓒ

అపార్ట్‌మెంటాలజీ -15

# ఓర్నాయనో! గృహ హింస!



2

యర్రంశెట్టి సాయి

*(గతసంచిక తరువాయి)*

"ఏంట్రా శ్రీనూ! నాన్నగారేదో ఒకటి వేస్తే వెళ్ళి పోలీస్‌స్టేషన్‌లో చెప్తావా?" అడిగింది వాళ్ళమ్మ.

శ్రీను నిర్లక్ష్యంగా చూశాడు. "ముందే వార్నింగిచ్చా! వినకపోతే ఇంకేంజేస్తాం?"

"అయినా నా కొడుకును ఓ దెబ్బవేసి నంత మాత్రాన అదో నేరమయినట్లు మీరు కేస్ రిజిస్టర్ చేయటమేంటండీ? మా ఫాదర్ నన్ను కొట్టలా? నేను పోలీస్‌స్టేషన్ కెళ్ళానా? మీ ఫాదర్ చిన్నప్పుడు మిమ్మల్ని ఒక్క దెబ్బకూడా వేయకుండానే పెంచారా? మీనాన్న మీద మీరూ కంప్లెయింట్ ఇచ్చారా మరి?"

ఎస్.ఐ. బుర్ర గోక్కున్నాడు క్యాప్ తీసి. "ఆ రోజులు వేరు- ఈ రోజులు వేరండీ! అప్పుడు గృహహింస చట్టం లేదు- ఇప్పుడు కొడుకుని కొట్టినా, కూతుర్ని కొట్టినా, భార్యను కొట్టినా మూడేళ్ళు పడిపోద్ది"

అంతవరకూ సైలెంట్‌గా ఉన్న కనకం విరుచుకుపడింది.

"ఏమయ్యా.. తల్లిదండ్రులు పిల్లల్ని సరదాకో, పిచ్చెక్కో కొడుతుంటారా? తప్పు చేస్తేనే కదా కొట్టేది? వాళ్ళు తప్పులు చేస్తుంటే మందలించకుండా, కొట్టకుండా వదిలేస్తే పెద్దవాళ్లయ్యాక ఏమవుతారు? దొంగలు, గూండాలు, మర్డర్లు, రేపిస్ట్‌లుగా తయారవరా? దేశంలో అలాంటి పౌరులు ఉండాలని ప్రభుత్వం ఉద్దేశమా?"

ఎస్.ఐ.కేం జవాబు చెప్పాలో తెలీలేదు.

"చూడమ్మా! మీ సంగతీ దేశం సంగతీ మాకనవసరం! మాక్కావలసింది చట్టాలు అమలు చేయటం! అతిక్రమించినోళ్ళను కోర్టులో నిలబెట్టటం- అంతవరకే- చూడు మిస్టర్ నాకొకటి చెప్పు! నువ్ మీ అబ్బాయిని కొట్టావా లేదా?"

"వాడు చేసిన పనులకు కొట్టక ముద్దు పెట్టుకుంటారా?"

"అంటే కొట్టినట్లు ఒప్పుకుంటున్నావ్. యు ఆర్ అండర్ అరెస్ట్. పద, స్టేషన్‌కి"

"నో! అతన్ని అరెస్ట్ చేయడానికి మేమొప్పుకోం" అన్నాడు శంకరమూర్తి.

"అయితే వీళ్ళిద్దరినీ అరెస్ట్ చేయండి"

"సై హమ్ భీ అరెస్ట్‌కో ప్రొటెస్ట్ కర్‌తే!" అన్నాడు హమీద్‌మియా. షైనీ లేడీస్ బాచ్ నినాదాలు మొదలెట్టింది.

"పోలీస్ జులుం నశించాలి"

"గృహహింస చట్టం ఎత్తేయాలి"

"కుటుంబ వ్యవస్థ- వర్ధిల్లాలి- వర్ధిల్లాలి"

"గుడ్డిచట్టం.. డౌన్ డౌన్"

ఈలోగా ఎస్.ఐ. ఎప్పుడు పైఅధికారులకు ఫోన్ చేశాడో తెలీదు. రెండు లారీలు, లారీలు, టియర్ గాస్ షెల్స్‌తో పోలీసులు మా అపార్ట్‌మెంట్స్‌ని చుట్టుముట్టారు.

అపార్ట్‌మెంట్స్‌లోని అందర్నీ పోలీస్‌స్టేషన్‌కు తీసుకెళ్ళి దింపారు.

అక్కడ ఉన్న పోలీస్ అధికారి, "చూడండి! మీరందరూ మా విధి నిర్వహణకు అడ్డు తగులుతున్నారు. హనుమంతరావ్ నేరానికి పాల్పడ్డాడు. అతన్ని కోర్టులో నిలబెట్టటం మా డ్యూటీ! అడ్డుపడితే మిమ్మల్ని కూడా అరెస్ట్ చేసి కోర్టులో నిలబెట్టాల్సి వస్తుంది" అన్నాడు.

పైనీ మళ్ళీ నినాదాలు అందుకుంది. "హనుమంతరావ్‌ని వదిలివేయాలి. గృహహింస చట్టం అవతల పారేయాలి"

కాసేపటి తర్వాత హమీద్‌మియా, నేను, శంకరమూర్తి మొహిందర్, విజయ్ యాదవ్ మాట్లాడుకుంటుంటే ఒక సబ్ ఇన్‌స్పెక్టర్ మా దగ్గరకొచ్చాడు.

"హనుమంతరావ్ మీకు క్లోజా సార్? "

"అవును!"

"అతన్ని వదిలేయమని మీరు చెప్తే వదిలేస్తాం సార్"

మాకు ఆశ్చర్యంతో పాటు ఆనందం, గర్వం కూడా కలిగాయ్.

"చూశారా! మన ఐకమత్యానికి పోలీస్‌లు కూడా వెనక్కు తగ్గాల్సిందే" అన్నాడు మొహిందర్‌సింగ్.

"అవున్సార్! ప్రజలకు వ్యతిరేకంగా పని చేయటం మాకూ కష్టం సార్. ఇష్టం కూడా ఉండదు"

"అంటే పోలీసుల్లో కూడా ఇలా రేషనల్‌గా ఆలోచించే వారుంటారన్నమాట!" అన్నాడు విజయ్ యాదవ్.

"ఎందుకుండరు సార్! అయితే ఒక రిక్వెస్ట్ " అన్నాడు ఎస్.ఐ.

"ఏమిటది? " అడిగాను.

"హనుమంతరావ్ మీద కేస్ రిజిష్టర్ అయింది కాబట్టి విత్‌డ్రా చేయడం చాలా కష్టం. అందుకని పదివేలిస్తే వదిలేస్తాం"

అందరం ఉలిక్కిపడ్డాం.

అంత డేరింగ్‌గా మా కమిటీ వాళ్ళనే లంచం అడుగుతాడని అనుకోలేదు.

"అంటే లంచం అడుగుతున్నారా? "

అతను నవ్వాడు.

"దాన్ని మేము లంచం అనం సార్! చట్టాలవల్ల ప్రజలు అన్యాయమై పోకుండా, సాయంచేసి, రక్షించే ఫీజు అంటాం!"

హమీద్‌మియాకి కోపం ఆగలేదిక.

"దేఖో బాబూ! హమ్ రిశ్వత్‌కే ఖిలాఫ్ హై! ఇంకోసారిలా అడిగితే మా కాలనీలో ఉన్న తుగ్లక్ ఛానెల్ జర్నలిస్ట్‌ని పిలుస్తామ్. అతను నీ సంగతి లైవ్ టెలికాస్ట్ కర్‌తే హై"

మమ్మల్ని చూసి జాలిపడుతున్నట్లు స్పష్టంగా తెలుస్తోంది అతని మొఖంలో.

అది కూడా సిన్సియర్‌గా జాలిపడటం.

"జర్నలిస్టులలో చాలామంది మాతో కలిసి మెలిసి ఉంటారు సార్. ఆ విషయం మీకు తెలీదు. మేమంతా అన్నదమ్ముల్లా కలిసి మెలిసి పనిచేస్తాం సార్"

అప్పుడే మా అపార్ట్‌మెంట్స్‌లో ఉండే తుగ్లక్ ఛానెల్ జర్నలిస్ట్ కెమెరామెన్‌తో అక్కడికొచ్చాడు.

"నమస్తే అన్నా" అన్నాడు సబ్ ఇన్‌స్పెక్టర్‌కి సెల్యూట్ కొడుతూ.

"నమస్తే... వీళ్లంతా మీ అపార్ట్‌మెంట్స్ వాళ్ళేనంట కదా! జరంత సముదాయించరా భయ్. బేవకూఫ్‌లెక్కున్నారు" మేమందరం వినేటట్లే చెప్పి వెళ్ళిపోయాడతను.

"ఏం జరిగింది? " మమ్మల్నడిగాడతను.

లంచం సంగతి చెప్పాం.

వాడు పగలబడి నవ్వాడు.



"నిజంగానే మీరు పాగల్‌గాళ్ళన్నా! సత్యం కంప్యూటర్సోడు కొన్ని వేలకోట్లు ఫ్రాడ్ చేశాడు. అదీ ఎట్లా? ప్రభుత్వాధికారులకీ, బ్యాంక్ అధికారులకీ, ఇన్‌కమ్‌టాక్స్ అధికారులకి, పోలీసులకూ, రాజకీయనాయకులకూ, మినిష్టర్లకూ.. ఒకళ్ళకనేంటి వందలమందికి తినిపించాడు. ఫ్రాడ్ మరీ ఎక్కువయిపోయి ఇప్పుడు దొరికిపోయాడనుకోండి. ఇప్పుడు వాడిని రక్షించడానికి మళ్ళీ అందరికీ లంచాలివ్వాలి. ఇది యూనివర్సల్ ప్రొసీజర్. ఎంత గొప్ప మొనగాడయినా ఈ ప్రొసీజరు ఫాలో అవాల్సిందే! నా మాటవిని పదివేలు పారేసి మనవాడిని విడిపించుకుపోండి!" అంటూ సలహా ఇచ్చాడు.

మా అందరికీ కోపం నసాళానికంటింది.

"చూడ్రా! నువ్ చెప్పిన సలహాకి నిన్ను మర్డర్ చేశామనుకో! ఏం జరుగుద్దంటావ్!" అడిగాడు విజయ్ యాదవ్.

"లోపటయిపోతారు"

"అడ్డమయినోడికీ లంచాలిస్తే శిక్ష తప్పించుకోవచ్చు కదా"

"చెప్పాల్సిందేదో మీ మంచికే చెప్పా"

"మంచిక్కాదురా! పోలీసులకిచ్చేదాంట్లో నీ కమీషన్ కొట్టటానికి"

ఇప్పుడేం చేద్దామన్నాడు శంకరమూర్తి.

"ఛస్తే మనం లంచం ఇవ్వకూడదు. లాయర్ని పట్టుకుని బెయిల్ మీద బయటకు వచ్చేట్లు చూద్దాం! తర్వాత కోర్టులో కేస్ ఎలా ప్రొసీడవుతుందో చూద్దాం! లాయర్ని పెట్టడానికి మన అసోసియేషన్ ఫండ్స్ వాడదాం"

"హనుమంతరావ్ కోసం అసోసియేషన్ ఫండ్స్ వాడవచ్చంటావా? "

"ఇది హనుమంతరావ్ ఒక్కడికే సంబంధించిన విషయం కాదురా భాయ్! ఇవాళ హనుమంతరావ్‌కయింది.. రేపు మనకె వర్కైనా జరుగుద్ది. మనందరినీ అరెస్ట్ చేస్తే పిల్లల్నెవరు చూస్తారు? " అంటూ కొత్త పాయింట్ లేవదీశాడు మొహిందర్.

అంతా మొహిందర్‌ని బలపరచారు.

అప్పటికే షైనీ పోలీస్‌స్టేషన్ ముందు నిర్వహిస్తున్న ధర్నా ఉద్ధృతమయింది.

షైనీకి లైటు కొడుతున్న యూత్ మామూలుగానే పోలీసుల మీద రాళ్ళు విసరటం ప్రారంభించారు.

పోలీసులు మరుక్షణంలో టియర్ గ్యాస్ బర్స్ట్ చేశారు. అందరం పరుగెత్తాం.

అప్పటికే టివి ఛానెళ్లు మా రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్ గురించి పెద్ద ఎత్తున విజువల్స్ చూపిస్తూ, గృహ హింస గురించి డిస్కషన్‌లూ, చట్టం డెఫినిషన్లూ టెలికాస్ట్ ప్రారంభించాయ్.

కొంతమంది పిల్లలను ఇంటర్వ్యూ చేస్తూంటే, కొంతమంది తల్లిదండ్రులను ఇంటర్‌వ్యూ చేస్తున్నారు.

సాయంత్రానికల్లా మా అసోసియేషన్ వాళ్లు హనుమంతరావ్‌ని బెయిల్ మీద విడిపించడానికి ప్రయత్నాలు మొదలెట్టారు.

మా అపార్ట్‌మెంట్స్‌లోనే ఉంటున్న ఒక లాయర్ని సంప్రదించాం ముందు.

"నా ఫీజు ఇరవై వేలు" అన్నాడతను.

"అంత ఫీజా? "

"అవునండీ! బెయిల్ అంటే అందరికీ మామూళ్లు ఇవ్వాల్సి ఉంటుంది"

ఎవర్తోనయినా ఆర్గ్యూ చేయవచ్చు గానీ లాయర్స్‌తో ఆర్గ్యూ చేయగూడదనేది మా వాళ్ళందరికీ బాగా తెల్సిన విషయమే.

"ఇప్పుడు మీకు ఇరవై వేలు ఇవ్వటం కంటే పోలీసులకు పది వేలిస్తే మా వాడిని వదిలేయటమే కాకుండా అసలు కేస్ కూడా లేకుండా చేస్తామని అన్నారు కదా"

"అయితే అక్కడికే పోండిమరి. ఇక్కడికెందుకొచ్చారు? "

"లంచాలివ్వటం ఇష్టం లేక"

"మీకేం దమాకున్నదా లేదా? లంచాలు

ఇవ్వనోడు ఇండియాలో బతుకుతాడు వయ్యా"

బయటికొచ్చి మళ్ళీ మీటింగ్ పెట్టాం!

హమీద్ మియా మాట్లాడాడు.

"భాయియో, బెహనో.. మన ఇండియన్ పబ్లిక్ కి ఏదైనా అన్యాయం, అక్రమం జరిగితే రెండే రెండు చాయిస్‌లు ఉన్నాయ్! ఏక్.. పోలీస్ కే పాస్ జానా. దో.. కోర్ట్‌కు జానా. మగర్ ఆ రెండు జగాల్లో అన్యాయం జరిగితే పబ్లిక్ ఎక్కడికెళ్తాయ్? "



ఆ పాయింట్ మీద చాలాచర్చ జరిగింది.

చివరకు షైనీ సజెషన్ ఇచ్చింది.

"న్యాయ వ్యవస్థలో కూడా ఫేవరటిజం, లంచాలు ఉంటే ఉండవచ్చు. కానీ అవి కొంత మందికే పరిమితం. ఓవరాల్ గా చూస్తే మన రాజకీయ వ్యవస్థకంటే న్యాయవ్యవస్థ మెరుగ్గా పనిచేస్తోంది. కనుక మనం మన ప్రాబ్లెమ్‌ని కోర్ట్‌లో తేల్చుకోవటమే మంచిది"

ఈ గొడవంతా చూసి హనుమంతరావ్ భార్యకు చిరాకేసుకొచ్చింది.

"మా ఆయన్ని ఎలా విడిపించుకోవాలో నాకు తెలుసు" అంటూ శీనుగాడి చేయి పట్టుకుని పోలీస్ స్టేషన్ వేపు వెళ్లింది.

"ఆమె ఏం అఘాయిత్యం చేస్తుందో ఏమో! పదండి మనం కూడా వెళ్దాం" అంది షైనీ. అందరం స్కూటర్స్ మీద పోలీస్‌స్టేషన్‌కు చేరుకున్నాం.

అప్పటికే ఇన్‌స్పెక్టర్‌తో వాదిస్తోంది హనుమంతరావ్ భార్య. "చూడండి! సంసారం అన్నాక భార్యాభర్తల మధ్య గొడవలొస్తయ్! ఒకోసారి భర్త భార్యను కొడితే, ఒకోసారి భార్యే భర్తను కొడుతుంది. కొట్టుకున్నారని ఇద్దరినీ జైలుకి పంపిస్తారా? విడాకులు మంజూరు చేసి సంసారాలు కూల్చేస్తారా? అలాగే పిల్లలను మంచి సిటిజెన్స్‌గా తయారుచేయడానికి తల్లిదండ్రులు ఒకటి రెండు తగిలించాల్సి వస్తుంది. అంతమాత్రాన తల్లిదండ్రుల్ని జైల్లోకి తోసేస్తారా? ఆ పిల్లల్ని అడుక్కుతినేవాళ్లుగా మారుస్తారా" అంటూ నిలదీస్తోంటే అందరం చప్పట్లు కొట్టాం!

"వీళ్లను బ్రతిమాలేదేంటీ? శిక్షపడితే పడనీ. చేసింది తప్పని చస్తే ఒప్పుకోను!" లాకప్‌నుంచి హనుమంతరావ్ అరిచాడు.

"విన్నారు కదా! సరే, ఆయన్ని జైల్లో పెట్టారు కదా! మరిప్పుడు నన్నూ మా అబ్బాయిని ఎవరు పోషిస్తారు? గవర్నమెంటా? మీ డిపార్ట్‌మెంటా? కోర్ట్‌లా? "

"ఆ సంగతి కూడా కోర్ట్‌నే అడగండి! మమ్మల్నడిగితే ఏం లాభం? "

"అలాగా! అయితే నన్నూ లాకప్‌లో పడేయండి! జైలుశిక్ష వేసేయండి" ఆవేశంగా అని లాకప్‌వేపు దూసుకెళ్ళబోయింది.

"ఏంటమ్మా ఇది! ఆగు! మీ భర్త నేరం చేశాడు కనుక అరెస్ట్ చేశాం! నువ్వేం నేరం చేయందే ఎందుకరెస్ట్ చేస్తాం? "

"అంటే? ఆ మాత్రం నేరం నేను చేయలేనా? " అంటూ శీనుగాడిని లాగి వాడి



చెంపలు గట్టిగా వాయించేసింది.

"చూశారా! నేనూ గృహహింస చేసేశా! ఇప్పుడు లాకప్‌లో పడేయండి "

"రాజూ! ఆమెను కూడా అరెస్ట్ చెయ్" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కోపంగా.

"మమ్మీ! నేను కూడా జైల్లోకొస్తా! జైల్లో ఉండటమంటే నాకెంతో ఇష్టం!" ఉత్సాహంగా అన్నాడు శీను.

"నువ్వెలా వెళ్తావ్‌రా జైల్లోకి.. పో ఇక్కడనుంచి" అరిచాడు ఇన్‌స్పెక్టర్.

వాడు కోపంగా చూశాడు.

"నేనెక్కడికెళ్తాను? మా డాడీ, మమ్మీ ఇక్కడే ఉన్నారు కదా? "

"సార్! ఆమెను అరెస్ట్ చేశామంటే ఈ పిల్లగాడిని స్టేషన్‌లోనే ఉంచుకోవాలి! బయటకు గెంటితే టీవీ ఛానెల్స్‌లో వాడిని చూయించి సెంటిమెంట్ ఎక్స్‌ప్లాయిట్ చేస్తారు. ట్రబుల్లో పడతాం" అన్నాడు హెడ్ కానిస్టేబుల్.

"సరే..ఆవిడ్నీ, వీడినీ పంపెయ్"

"ఏమిటి? నన్ను బయటకు పంపుతారా? ఎలా పంపుతారండీ! మా ఆయన చేసిన నేరమే నేనూ చేశాను కదా! ఆయన్ని జైల్లో వేసి నన్నెలా వదిలేస్తారు? "

ఇన్‌స్పెక్టర్ ఆవేశం పట్టలేక బూతులు మాట్లాడటం మొదలుపెట్టాడు.

"ఛా! నీ యవ్వ! పొద్దుటేల్ పొద్దుటేల్ ఎవడి మొఖం చూశాను ఈ ఫాల్తూ కేస్ దొరికింది. ఇదిగో చూడమ్మా! మీ ఆయన్ని కూడా వదిలేస్తాగాని అయిదువేలయినా ఇవ్వాలి"

హనుమంతరావ్ లాకప్‌లోనుంచి అరిచాడు "ఇవ్వకు కనకం! అయినా ఈ కేస్ ఎలా క్లోజ్‌చేస్తావయ్యా? రిజిస్టర్ చేయటం, కేన్సిల్ చేయటం అంతా నీ ఇష్టమేనా? "

దాంతో కనకం కూడా తిరగబడింది.

"ఇదిగో.. నేను నేరం మీ ఎదురుగ్గానే చేశా? నన్ను అరెస్ట్ చేస్తారా లేదా? "

"మేం చెయ్యమమ్మా"

"నన్ను అరెస్ట్ చేయకపోతే నీ డ్యూటీ నువ్ చేయలేదని కేస్ పెడతా!"

"ఆమె పెట్టకున్నా మేము పెడతాం" అన్నాడు మొహిందర్ ముందుకొచ్చి

అప్పుడే ఇన్‌స్పెక్టర్ సెల్ మోగింది.

"హలో! ఏంటే ఇప్పుడు ఫోన్ చేశావ్? ఏంటి? రెండోవాడు సెల్‌ఫోన్ కొనలేదని టి.వి పగలగొట్టాడా? దొంగనాకొడుకు.. ఇప్పుడే వస్తున్నా! బెల్ట్‌తో వీపు వాయకొడ్తా ఎదవని!"

అంటూ హడావుడిగా బయటకు వెళ్ళబోతే షైనీ అడ్డువచ్చి నిలబడింది.

"అంటే మీ పిల్లలు అల్లరి చేస్తే బెల్ట్‌తో చితకబాదుతారా? అదే మేముచేస్తే శిక్ష వేయిస్తారా? లేకపోతే వేలకు వేలు లంచాలు గుంజి వదిలేస్తారా? "

ఇన్‌స్పెక్టర్‌కి ఒళ్ళు మండిపోయింది

"ఏయ్! మీరంతా ఫోండి బయటకు. రాజూ అందర్నీ స్టేషన్‌కి దూరంగా గెంటండి" అన్నాడు కోపంగా.

అప్పుడే శంకరమూర్తి వాళ్ళబ్బాయిని లాక్కొచ్చి నెత్తిమీద ఒక్కటిచ్చాడు.

"సార్! నేను గృహహింస చేశా! నన్నూ అరెస్ట్ చేయండి"

అప్పటికప్పుడే మా అపార్ట్‌మెంట్స్‌లోని పాతికమంది ముందుకొచ్చి వాళ్ళ పిల్లల్ని తలో దెబ్బా వేశారు.

"సార్! మమ్మల్నీ అరెస్ట్ చేయండి"

ఇన్‌స్పెక్టర్‌కి పిచ్చెక్కిపోయింది.

అందర్నీ లాకప్‌లోకి తోసేశాడు.

మర్నాడు అందర్నీ కోర్ట్‌లో నిలబెట్టారు.

"మీరు నేరం చేశామని ఒప్పుకుంటున్నారా? " అడిగాడు జడ్జీగారు.

"ఒప్పుకుంటున్నాం సార్. కానీ చిన్నప్పటినుంచీ పిల్లలను మందలించకుండా, అవసరమయితే రెండు తగిలించి మంచి దారిలో పెట్టకపోతే వాళ్ళు రేపు ఏమా

తారో మీకూ తెలుసు! గూండాలు, తాగుబో తులు, మర్డరర్లు, రేపిస్టులు, కిడ్నాపర్లు అ వ్వరా? అప్పుడు వాళ్ళ వల్ల సమస్య మా కుటుంబాలకే కాదు.. సమాజానికి, దేశానికీ ముప్పే!" అంది కనకం.

"ఔన్సార్! మావాడు తప్పుచేశాడని, కొట్టాను. ఇప్పుడు వాడిని భయపడేలా చేయకపోతే రేపు వాడు టెర్రరిస్ట్ అవ వచ్చు" అన్నాడు హనుమంతరావ్.

"ఛీ! నేను టెరరిస్టనవను! మానవ బాంబ్ నవుతా! మానవబాంబ్ అయితేనే ఒళ్ళంతా బాంబులు కట్టుకుని బిల్డింగ్‌లను పేల్చేయవచ్చు"అన్నాడు శీనుగాడు.

కోర్టులో అంతా ఘొల్లుమని నవ్వారు.

"ఆర్డర్.. ఆర్డర్" అన్నాడు జడ్జిగారు.

"అయినాగానీ ఒక చట్టం ఉన్నప్పుడు దాన్ని గౌరవించటం పౌరుల విధి!"

"చదువు, సంస్కారం, క్రమశిక్షణా నూటి కి నూరు మంది పాటించే చోట్ల అలాంటి చట్టాలకు అర్థం ఉంటుంది సార్! ముందూ వెనుకలు ఆలోచించకుండా, సెంటిమెంట్ పట్టించుకోకుండా, సోషల్ ఎన్విరాన్ మెంట్ చూడకుండా చట్టాలు తేవటం తప్పు కాదంటారా? " అడిగాడు శంకర మూర్తి.

"ఇలాంటి చట్టాలు అమెరికాలో కూడా ఉన్నయ్! అక్కడ ప్రజలంతా వాటిని అను సరిస్తున్నారు. ఆ విషయం మీకు తెలుసా? " అడిగారు జడ్జిగారు.

షైనీ ఓ అడుగు ముందుకేసింది. "తెలు స్సార్! అందుకే అక్కడి పిల్లలు ఎలా తయారవుతున్నారో మీరే చూడండి. అయి దో క్లాస్‌లో విద్యార్థినులు ప్రెగ్నెంట్స్! ఆరో క్లాసులోనే విద్యార్థులు తాగుడు, సిగిరెట్లు! పదోక్లాస్‌లో డ్రగ్స్! గన్స్ తీసుకొచ్చి క్లాసులో మిగతా పిల్లలందరినీ పిట్టల్ని కాల్చినట్లు కాల్చటం! కాలేజ్ లెవల్ కొచ్చే సరికి ఎయిడ్స్! జాబ్‌లో చేరేసరికీ నాలుగు పెళ్ళిళ్ళు, ఆరు విడాకులు. వాళ్ళకు ఇక్కడ లాగా బంధుత్వాలుండవ్! సెంటిమెంట్స్ ఉండవ్. తల్లిదండ్రులెక్కడో? పిల్లలె క్కడో? ఎవరికివారే అనాథలు! ఏ రోడ్ మీద ఎప్పుడెవడు ఎవడిని కాల్చి చంపు తాడో తెలీదు. దీన్నా మనం ఆ దేశం సాధించిన ఘనత అంటుంది? అలాంటి సామాజిక వ్యవస్థనా మనం ఆదర్శంగా తీసుకోవాల్సింది? అలాంటి దిక్కుమాలిన లైఫ్‌నా మనం ఎన్నుకోవలసింది? గురు వుని గౌరవించటం, తల్లిదండ్రుల్నీ, తోడబుట్టినవారినీ ప్రేమించటం, జీవి తాంతం వారితో బంధాలను ఏర్పరచుకో వటం.. ఇలాంటి మన సంస్కృతి మనకొ ద్దా? " షైనీ ఆవేశంగా అనే సరికి జడ్జి కూడా స్టన్ అయిపోయారు.

"చూడమ్మా! నువ్ చెప్పినదంతా ఒప్పు కుంటాను. కానీ ఈ చట్టాలు తెస్తోందె వరు? మీరే! మీరంటే మీ ప్రజాప్రతిని ధులు. ఆ చట్టాలు తెస్తున్నప్పుడే మీరు మీ వాణి వినిపించాలి!"

"మా మాట పట్టించుకునేదెవరు సార్! అసలు ఈ చట్టాలు కోరుకుందెవరు? మేమెవ్వరం కాదు! ఇలాంటి చట్టం ఒక టుందని సగటు మనుషులకు తెలీదు. సోషల్ ఆర్గనైజేషన్స్ పేరుతో డబ్బున్న వాళ్ళు దేశంమీద రుద్దుతోన్న అరాచక చట్టాలివి! అద్దాలమేడల్లో కూర్చుని మందు కొట్టి, క్లబ్బుల్లో పేకాటలాడుతూ, పబ్బుల్లో డాన్స్‌లు చేసే కొంతమంది చేస్తోన్న నిర్వా కమిది! మనదేశ జనాభాలో మెజారిటి ఉన్న మధ్యతరగతి మనుషులుగానీ, క్రింది తరగతి వర్గాలవారికి గానీ ఈ చట్టాలు తెచ్చే ప్రక్రియలో ప్రమేయం ఉండదు" ఆవే శంగా అన్నాడు విజయ్ యాదవ్.

జడ్జిగారు కొద్ది క్షణాలు ఆలోచనలో పడి పోయారు. ఆ తర్వాత వినిపించింది..

"కేస్ ఈజ్ ఎడ్జర్న్‌డ్"

©

ప్రేమికుడితో లేచిపోయిందని అనుకున్న ఇల్లాలు అనూహ్యంగా శవమై కన్పించింది. పోలీసులు తననే అనుమానంగా చూడడంతో భర్త తీవ్ర కలవరపాటుకు గురయ్యాడు. అంతలో ఆ వీధిలోనే మరో హత్య! మొదటి హత్యపై కొంత విలువైన సమాచారం ఇచ్చిన మిలట్రీ నాయుడ్ని ఎవరో దారుణంగా చంపేశారు.. అసలు ఈ అఘాయిత్యాలకు కారకులెవరు? హంతకులకోసం అహర్నిశలూ వేటసాగించిన పోలీసులు వాళ్లను పట్టుకున్నారా? ఎలా పట్టుకున్నారు?

అక్షరాక్షరంలో ఉత్కంఠను పోషించిన సుప్రసిద్ధ తమిళ రచయిత రాజేష్‌కుమార్ థ్రిల్లర్‌కు జిల్లేళ్ళ బాలాజీ తేటతెలుగు అనువాదం **ఒకటి + ఒకటి = మూడు** ఈ నెల చతుర కానుక!



అది ఓ మే మాసపు గురువారం. రాత్రి పదకొండు గంటలు కావస్తోంది. ఎన్నోవందల కి.మీ. ప్రయాణం చేసి తిరుపతి రైల్వేస్టేషన్‌లో, మూడవ నెంబర్ ప్లాట్‌ఫాం మీదికి వచ్చి ఆగింది ఆ ఎక్స్‌ప్రెస్ ట్రైన్! నిద్రమత్తు కళ్లతో ప్రయాణికులు కిందకు దిగి ఎగ్జిట్ గేట్ వైపు నడవసాగారు.

"మైసూర్ ఎక్స్‌ప్రెస్ ఏ ప్లాట్‌ఫాం మీదకొస్తుంది సార్?" కళ్లద్దాలు పెట్టుకొన్న ఓ యువకుడు హిగిన్‌బాదమ్స్ బుక్ స్టాల్ దగ్గర నిల్చుని ఫిగర్స్ అందాలను కళ్లతోనే జుర్రుకుంటున్న ఇద్దరు కాలేజీ కుర్రాళ్లను అడిగాడు. వాళ్లలో ఒకడు నవ్వకుండా సీరియస్‌గా బదులిచ్చాడు-

"మైసూర్ ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫాం మీదకు రాదు సార్, పట్టాలమీదే ఆగిపోతుంది!"

కాలేజీ కుర్రాళ్ల జోక్‌నూ, వాళ్ల నవ్వునూ వింటూ చేతిలో సూట్‌కేస్‌తో బయటకు వెళుతున్న కైలాష్- తన వెనుకే ఐదడుగుల దూరంలో వస్తున్న ప్రియ వైపు చూసి చిరునవ్వు నవ్వి అన్నాడు.

"స్టూడెంట్ల వేళాకోళం చూశారా ప్రియా..."

"ఆс విన్నాను!" అంది నవ్వుతూ ప్రియ.

"మనం కాలేజీ చదివేరోజుల్లో ఇంతగా వేళాకోళం చేసేవాళ్లం కాదు. కాస్త హద్దుల్లోనే ఉండేవాళ్లం..."

ఆ మాటలకు ప్రియ నవ్వింది.

కైలాష్ నడుస్తూనే అడిగాడు.

"ఏం ప్రియా, మీవారు మిమ్మల్ని రిసీవ్ చేసుకోవడానికి స్టేషన్‌కు వస్తున్నట్టు చెప్పారే- ఎక్కడా కనిపించరేం?"

"అదే ఆలోచిస్తున్నాను. నా ఉత్తరం ఆయనకు అందిందో లేదో మరి!?"

"ఇల్లు ఎక్కడని చెప్పారు?"

"ఖాదీ కాలనీలో..."

"నేను ఇంటివరకూ వచ్చి దిగబెట్టనా?"

"నో నో... మీకెందుకూ శ్రమ? నేను ఆటోలో వెళ్లిపోగలను. గంట పదకొండేగా అయింది... ఏం భయం?!"

స్టేషన్ ఎగ్జిట్ గేట్ వద్ద చెయ్యి చాపిన వ్యక్తి చేతిలో యాంత్రికంగా టికెట్లను ఇచ్చి బయటకు వచ్చారిద్దరూ.

"ఎదురుగా ఉన్న బేకరీలో బిస్కెట్లు కొనాలి. ఒట్టి చేతులతో వెళితే మా చిన్నా ముఖాన్ని అస్సలు చూడలేం! బ్యాగులో ఏం తెచ్చానోనని వెదుకుతాడు"

ప్రియ మాటలకు కైలాష్ నవ్వి- "రండి వెళదాం..." అన్నాడు..

ఇద్దరూ బేకరీకేసి నడిచారు. సితార పత్రికను సీరియస్‌గా చదువుతున్న అంగడి కుర్రాడు, కస్టమర్ల రాకతో నవ్వుతూ లేచి నిలబడ్డాడు.

ప్రియ ఆర్డరిచ్చింది.

"పావుకిలో బట్టర్ బిస్కెట్స్..."

తర్వాత-

కైలాష్ వైపుకు తిరిగి అడిగింది.

"మీ వైఫ్ పేరేమిటన్నారు?"

"దేవి"

"అందంగా, సింపుల్‌గా బావుంది పేరు..."

"మా ఆవిడా అలాగే ఉంటుంది..."

"ఓ సారి మా ఇంటికి తీసుకురండి..."

"అలాగే..." కైలాష్ అలా అంటూ ఉండగానే ఎవరో వెనుక నుండి వచ్చారు. ప్రియ వెనక్కు తిరిగి చూసి ఆ వెంటనే చిరునవ్వు నవ్వింది.

"హమ్మయ్య, వచ్చేసారా? నేను రాసిన ఉత్తరం మీకు అందిందో లేదోనని కంగారు పడుతున్నాను..." అంటూ కైలాష్ వైపుకు తిరిగి "కైలాష్, వీరే మా శ్రీవారు... ఏవండీ పేరు మీరే చెప్పుకోండి..." అంది నవ్వుతూ.

ఆ యువకుడు నవ్వి- "అయాం రవి చంద్ర" అంటూ కైలాష్ చేతిని అందుకుని

షేక్ చేశాడు. పరస్పరం 'గ్లాడ్ టు మీట్ యూ' చెప్పుకున్నారు.

అంగడివాడిచ్చిన బట్టర్ బిస్కెట్ల ప్యాకెట్‌ను బ్యాగులో పెట్టుకుంటూ భర్తతో అంది ప్రియ.

"ఏమండీ.. వీరు మిస్టర్ కైలాష్! బి.ఎ.లో నా క్లాస్‌మేట్. నేను హైదరాబాద్ నుండి వస్తున్నప్పుడు వీరు విజయవాడలో ట్రైన్ ఎక్కారు. 'హై పవర్ ట్రాన్స్‌మిషన్ రోబ్స్' లో సేల్స్ మేనేజర్. అందులో పని చేస్తూనే డ్రామా ట్రూప్‌నొకదాన్ని నడుపు తున్నారు. వీరి నాటకమొకటి త్వరలో సినిమాగా కూడా రాబోతుంది. ఆ విషయ మై హైదరాబాద్ వెళ్లి అటే విజయవాడ వెళ్లి వస్తున్నారు..."

ప్రియ భర్త అతని పట్ల అంతగా ఆసక్తి చూపక 'ఊం' కొట్టి తలాడించి నవ్వాడు. అలాగా అంటూ ఆశ్చర్యం నటించాడు. "సరే, ఇక వెళదామా? పిల్లల్ని పక్కింట్లో వదిలి వచ్చాను. ఈ పాటికే చిన్నాడు ఏడుస్తూ ఉంటాడు" అంటూ భార్యను తొందరపెట్టాడు రవిచంద్ర.

"ఒక్క నిమిషం" అని, అంగడివాడితో "అలాగే ఓ డజన్ కేక్‌లు నీట్‌గా ప్యాక్ చేసివ్వు..." అంది.

నిమిషంలో అంగడివాడు కేక్‌లు ఓ అట్టపెట్టెలో పెట్టి ప్యాక్ చేసివ్వగా దాన్ని కైలాష్‌కు అందిస్తూ ప్రియ-

"తీసుకోండి కైలాష్... చాలారోజుల తర్వాత కలిసాం. దీన్ని మీ ఆవిడకు నేనిచ్చానని ఇవ్వండి..."

"ఈ ఫార్మాలిటీస్ ఎందుకు ప్రియా?"

"అలా అనకండి, తీసుకోండి...! తీరిక దొరికినప్పుడు తప్పకుండా మీ శ్రీమతిని తీసుకొని ఓసారి మా ఇంటికి రండి..."

ప్రియ దంపతులు 'గుడ్‌నైట్' చెప్పి ఆటో ఎక్కి వెళ్లగా, తానూ మరో ఆటోను ఆపి ఎక్కి కూర్చున్నాడు.

"ఎక్కడికెళ్లాలి సార్?"

**కొత్తగాలి...**

**పురావస్తు శాలకు**
**సర్కారు బడి**
**ప్రభుత్వాసుపత్రి**
**దాని వెంబడి**

*-పోసుగోటి నరసింహారావు,*
*దుబ్బాక, నల్లగొండ జిల్లా*

"మారుతీనగర్!"

"ముప్పై రూపాయలు అవుతుంది సార్..."

"ఇంకో పదిస్తాను. తొందరగా పోనీ" కైలాష్ మాటతో అతను ఆటోను వేగంగా పోనిచ్చాడు. మారుతీనగర్ గాఢ నిద్రలో మునిగిపోయింది. వీధి దీపాలు బ్రహ్మాండంగా వెలుగుతున్నాయి. మొదటి వీధిలోకి తిరిగింది ఆటో.

"ఎక్కడ ఆపమంటారు సార్...?"

"ఇంకాస్త ముందుకెళ్లు... ఆ కరెంటు స్తంభం దగ్గర ఆపు"

అలాగే ఆపాడు డ్రైవర్.

కైలాష్ కిందకు దిగాడు. ఆటో కనుమరుగయ్యాక అక్కడ మళ్లీ నిశబ్దం అలుముకుంది. ఎడమచేత్తో కేక్ ప్యాకెట్‌ను, కుడిచేత్తో సూట్‌కేసును పట్టుకొని కాంపౌండ్ గేట్‌వైపు దారితీసాడు కైలాష్. గేట్‌ను తాకుతూ పెరిగిన నైట్‌క్వీన్ నుండి సువాసన తేలుతూ వచ్చి మత్తును కలిగిస్తోంది.

కైలాష్ గేట్ తీసుకొని లోపలికెళ్లి కాలింగ్ బెల్ నొక్కాడు. బెల్ శబ్దం ఆగేలోగానే లోపల ట్యూబ్‌లైట్ వెలిగింది.

"ఎవరది?" అన్న పిలుపుతో బాటు బార్లా తెరుచుకున్న తలుపు వెనుక ఒక యువతి స్పష్టంగా కనిపించింది. కైలాష్‌ను చూసి నిష్ఠూరంగా అంది.

"వారంలో వచ్చేస్తానని వెళ్లిన మీరు ఇదుగో ఇప్పటికి పదోరోజున వచ్చారు"



కైలాష్ నవ్వుతూ లోపలికి దారితీశాడు. సూట్ కేస్ కిందపెడుతూ అన్నాడు.

"సినిమా డిస్కషన్ అంటే తమాషా అనుకున్నావా? నిర్మాత వస్తే దర్శకుడు రాడు... దర్శకుడు వస్తే ఫైనాన్షియర్ రాడు... సగం రోజులు నిరీక్షణకే సరిపో తుంది...." అంటూ అక్కడున్న ఛెయిర్‌లో కూర్చున్నాడు కైలాష్.

"ఇంతకీ వెళ్లిన పని ఏమైంది...?" అంటూ ఆమె ఆతృతగా అడిగింది.

"సక్సెస్ అయినట్టే... నిర్మాతకూ, దర్శకు డికీ కథ నచ్చింది... ఫైనాన్షియర్ మాత్రం ఇంకా ఆలోచించాలంటున్నాడు... అతణ్ణి ఎలాగైనా ఒప్పించగలిగితే... వచ్చే నెల లోనే పాటల రికార్డింగ్‌తో సినిమా మొద లుపెట్టవచ్చు.."

"అడ్వాన్స్ ఏమైనా ఇచ్చారా?"

"ఆఁ... వెయ్యిన్నొక్క రూపాయలు"

"ఈ రోజు ఉదయమే వచ్చేస్తారనుకు న్నాను... తొందరగా స్నానం అదీ కానిచ్చి మీ కోసం కాచుకు కూర్చున్నాను. కానీ నన్ను మోసం చేశారు..."

"ఉదయమే బయలుదేరుదామనుకు న్నాను. విజయవాడలో ఆఫీస్ పనొకటి పెండింగ్ ఉంటే దాన్నీ చూసుకొని వచ్చేస రికి ఇదిగో ఈవేళైంది..."

"భోజనం చేస్తారా...?"

"వద్దు..."

"హీటర్ వేస్తాను... స్నానం చేయండీ..."

"వద్దు... రేపు ఉదయం చేస్తాలే"

ఆమె ఆదోలా అతణ్ణి చూసింది.

"ఔను... చేతిలో ఏమిటది, స్వీట్ ప్యాకెట్టా...?"

"కాదు... కేక్స్..."

"ఆశ్చర్యంగా ఉందే... ఎప్పుడూ తీసుకు రారే...?"

"తీసుకురావాలనిపించింది. తీసుకొ చ్చాను..." ప్యాకెట్‌ను చేతిలో పెట్టి, చటు క్కున ఆమెను దగ్గరకు లాక్కొని ముద్దు పెట్టుకోబోయాడు. కానీ ఆమె ముఖం పక్కకు తిప్పుకుంది.

"వద్దండీ..."

"పదిరోజుల తర్వాత వచ్చాను... ఎందుకు వద్దంటున్నావు?"

"ఊరు నుండి చెల్లాయి వచ్చింది..."

"అరే... ఎప్పుడూ...?"

"రెండురోజులైంది... గదిలో నిద్రపో తోంది..."

"అంత అర్జెంటుగా సుమతి ఎందుకొ చ్చినట్టు...?"

"ఇక్కడున్న ఓ సినిమా కంపెనీవాళ్లు మేకప్ టెస్ట్‌కోసం రమ్మన్నారట. రేపు టెస్ట్ పూర్తయ్యాక ఊరెళ్లిపోతుంది..."

ఆ మాటలతో కైలాష్ అదోలా ముఖం పెట్టాడు.

"అంటే ఈ రాత్రి నేనిక్కడ ఉండటానికి వీల్లేదన్నమాట?!"

ఆమె నవ్వింది వయ్యారంగా...

"ఖచ్చితంగా వీలుకాదు... ఈ రాత్రి మీరు తాళికట్టిన భార్య దగ్గరకు వెళ్లా ల్సిందే..."

"ఇవ్వాళ ఇంటికి వెళ్లకూడదనుకు న్నాను. కానీ వెళ్లాల్సివస్తోంది. సరే ఏం చేద్దాం? ఇక బయలుదేరనా...?" కైలాష్ సూట్ కేస్ తీసుకొని బయటకు వెళుతుం డగా హాల్లోని టెలిఫోన్ మోగింది. కైలాష్ రిసీవర్ అందుకున్నాడు.

"హలో...!"

"హలో... డ్రామా ఆర్టిస్ట్ జయంతిగారి ఇల్లే కదూ...?"

"ఔను.. మీరెవరు...?"

"మేము కాళహస్తి రసమయి నాటక సమాజం నుండి మాట్లాడుతున్నాం. ఒక నాటకంలో రోల్ విషయంగా జయంతిగా రితో మాట్లాడాలి..."

"వెయిట్ ఎ మినిట్ ప్లీజ్..." కైలాష్ జయంతి వైపుకు తిరిగి అన్నాడు. "ఫోన్ నీకే జయంతి... రసమయి నాటక సమాజం నుండి.. మాట్లాడు. నేనిక బయ లుదేరుతాను.. రేపు సాయంత్రం వస్తా."

"అలాగే..." తలాడించింది జయంతి.

కైలాష్ సూట్‌కేస్ తీసుకొని బయటకు దారి తీశాడు. వీధి చివరికొచ్చి ఆటో ఎక్కి కూర్చొని-

"వైకుంఠపురం పోనియ్..." అన్నాడు. ఆటోలో అతను అసహనంగా గోళ్ళు కొరు కుతూ కూర్చున్నాడు. తన భార్య దేవి గురించి ఆలోచించేకొద్దీ అతడి ముఖంలో రంగులు మారసాగాయి.

"ఆ ఇల్లే... ఆటోను ఆపు..."

డ్రైవర్ అడిగినంత చార్జ్‌ని ఇచ్చి ఇంటి మెట్లు ఎక్కసాగాడు. ఒక్కో మెట్టు ఎక్కు తున్నకొద్దీ అతడి ఆశ్చర్యానికి అంతులేకుం డాపోయింది...

కారణం తలుపుకు ఓ తాళం కప్ప!




తాళం కప్పను లాగి చూశాడు కైలాష్. గాడ్రెజ్ తాళం గట్టిగా ఉండి తన బలాన్ని చూపించింది.

"ఏం తమ్ముడూ ఊరునుండి ఇదేనా రావడం? "

వెనుక నుండి బొంగురు గొంతు విని పించటంతో వెనుతిరిగి చూశాడు- కైలాష్.

కుడిచంక కింద ఊతకర్రతో మిలట్రీ నాయుడు! కార్గిల్ పోరులో కుడికాలును పోగొట్టుకొని సొంత ఊరు చేరుకున్న నాయుడికి తనవాళ్ళంటూ ఎవరూ లేరు. ఆ వీధిలో ఒక చిన్నగదిలో ఉంటూ, రోజులు గడుపుతున్నాడు.

మెట్లు దిగి అతడ్ని సమీపించాడు కైలాష్. లోగొంతుతో అన్నాడు- "ఔను నాయుడూ... ఇప్పుడే హైదరాబాద్ నుండి వస్తున్నాను..."

"ఇంటికి తాళం వేసినట్టుందే..."

"ఔను..."

"దేవి ఎక్కడికెళ్లింది...? "

"అదే నేనూ ఆలోచిస్తున్నాను..."

"మీరు ఇవ్వాళ హైదరాబాద్ నుండి వస్తున్న విషయం దేవికి తెలుసా? "

"వస్తున్నట్టు ఉత్తరం రాశానే..." అంటూ మెల్లగా అడుగులు వేస్తూ పక్క వీధిలోకి దారితీసాడు.

బ్లూలైట్ల వెలుగులో మెరిసిపోతున్న 'పూర్ణిమ' అన్న ఆ లాడ్జిలోకి నడిచాడు. తాంబూలం మరకలతో, సున్నం చారలతో 'శుభ్రంగా ఉండడం అసంభవం' అన్నట్లు దాని గోడలున్నాయి. కైలాష్ సరాసరి రిసె ప్షన్ కౌంటర్ దగ్గరకి వెళ్లాడు.

"ఏం కావాలి సార్...? "

"రంగమణి అని మా ఫ్రెండొకడు ఇక్క డుంటున్నాడు. అతణ్ణి కలవాలి..."

"ఫస్ట్ ఫ్లోర్‌లో 302వ నంబర్ గది..."

'థాంక్స్' చెప్పి అక్కణ్ణించి కదిలి ఫస్ట్‌ఫ్లో ర్‌లో 302వ గది ముందు నిలబడ్డాడు.

"టక్... టక్... టక్..." గది తలుపు తట్టాడు కైలాష్.

కాసేపటికి తలుపు తెరిచిన రంగమణికి కైలాష్ వయస్సే ఉంటుంది. బనియన్, లుంగీతో ఉన్నాడు. అతడి కళ్లల్లో ఆశ్చర్యం తొంగిచూస్తోంది.

"రారా మగడా! ఈ యేడు ఆంధ్రాలో కుంభవృష్టే... నువ్వు నాలాంటి వాళ్లను

వెతుక్కుంటూ ఈ లాడ్జి మెట్లెక్కి రావడం ఒక చారిత్రక ఘటన. ఈ రాత్రి నాకు తెలిసినంతవరకూ ఒక విశేషమైన రాత్రి..." చకచక మాట్లాడేస్తున్నాడు.

"రంగా... కాస్త నోరు మూస్తావా..."

"ఏంటి విషయం- సూట్ కేస్‌తో సహా నన్ను వెతుక్కుంటూ ఇంత రాత్రిపూట ఇలా వచ్చావు? నీ మన్మథలీలలు మీ ఆవిడకి కానీ తెలిసిపోయి తరిమేసిందా?"

"ఏంట్రా, నన్ను మాట్లాడనివ్వవా...?"

"సరే... మాట్లాడు!"

"ఇప్పుడే హైదరాబాద్ నుండి వస్తున్నా...తీరా ఇంటికి వస్తే, తాళం వేసింది"

"నీ వైఫ్ ఎక్కడికెళ్లింది...?"

"అమ్మగారింటికి వెళ్లిందట, పక్కింటి వాళ్లు చెప్పారు...ఎక్కడ ఉండాలో తెలియక ఇటొచ్చా ఈ రాత్రికి నీ గదిలో ఉందామనుకుంటున్నా..."

"లాడ్జి మేనేజర్ ఒప్పుకోడురా... నెలకు అద్దెకుండే వాళ్ల గదిలో, వాళ్ల పెళ్లాలొచ్చినా ఉండటానికి ఒప్పుకోడురా..."

"ఓసారి అడిగి చూడరా..."

"అడిగానా...నన్ను ఖాళీ చెయ్యమంటాడు.. ఓ పని చేద్దామా?"

"ఏంటదీ? ..."

"మీ ఇంటి తలుపు తాళం తీయడానికి తాళంచెవే కదా లేదు? ..."

"ఔను..."

"నేను ఆ తాళం తియ్యనా...?"

"నీవల్ల అవుతుందా?"

"అవుతుందా, కాదా... నువ్వే చూస్తావుగా... ఊc... బయలుదేరు!!"

రంగమణి లేచి చొక్కా తొడుక్కుని బల్ల సొరుగులోంచి ఒక మాస్టర్ 'కీ బంచ్'ను తీసాడు. గదికి తాళంవేసి ఇద్దరూ లాడ్జి నుండి బయటపడ్డారు.




ఇద్దరూ కలిసి తాళం వేసున్న కైలాష్ ఇంటి వైపు దారితీశారు. నిశ్శబ్దంగా ఉన్న తిరుపతి వీధుల్లో కుక్కల అరుపులు మాత్రం వినిపిస్తున్నాయి.

"టైమ్ ఎంతయింది కైలాష్...?"

"పన్నెండుంపావు..."

"దెయ్యాలు ఆవులించే సమయంలో మనం ఇలా వీధుల్లో తిరుగుతున్నాం... ఔను... భార్యాభర్తలిద్దరూ చెరొక తాళం చెవీ దగ్గరుంచుకోవచ్చు కదా...?"

"అలాగే ఉంచుకున్నాంరా!"

"మరి...?"

"నేనెక్కడో పోగొట్టుకున్నాను..."

"చిన్నింట్లో ఎక్కడైనా పెట్టావేమో...?"

"నో... నో..."

"ఏమిట్రా నో... నో...! ఆ డ్రామా ఆర్టిస్ట్ జయంతి ఇంటికి నీవు అప్పుడప్పుడూ వెళుతున్నావటగా?"

"ఎవరు చెప్పారు?"

"ఐక్యరాజ్యసమితిలో చర్చించుకుంటున్నారు. ఒరేయ్ ఇదే ఊళ్లో ఉన్న నాకు నీ విషయం తెలియదా? నాలుగైదుసార్లు నా కళ్లతో నేనే చూశానురా"

"అదీ.. అదీ.. నాటకాల కోసం అప్పుడప్పుడు కలుస్తుంటా. నువ్వు అనుకునే విధంగా నేనేమీ ఆమె వద్ద తప్పుగా నడుచుకోవడం లేదు?"

"ఒరేయ్ కైలాష్!!"

"ఊc..."

"నేను ఒక మాటంటాను తప్పుగా అనుకోవుగా...?"

"చెప్పు.."

"ఒక రెప్యూటెడ్ కంపెనీలో మంచి ఉద్యోగం చేస్తున్నావు. చేతి నిండుగా జీతం! ఇంకెందుకురా ఈ డ్రామాలు.. రిహార్సల్స్. ఇది చాలదు అన్నట్టు- ఇప్పుడు సినీఫీల్డుకు వెళుతున్నట్టుంది"

"ఒక ఛాన్సొచ్చింది.. నా డ్రామా చూసిన డైరక్టర్ ఒకరు దాన్ని సినిమాగా తీయబోతున్నట్టు చెప్పాడు..."

"ఎవరా డైరక్టర్..."

పేరు చెప్పాడు కైలాష్.

తల కొట్టుకొని అన్నాడు రంగమణి.

"ఆ డైరక్టర్‌కు మార్కెట్ పడిపోయి పదేళ్లు అవుతోందిగదరా... ఆయన తీసిన సినిమాలు ఏవీ పెద్దగా హిట్ కూడా కాలేదు... ఒరేయ్ కైలాష్...! నేను ఇలా అంటున్నందుకు తప్పుగా అనుకోకు. ఈ డ్రామాలు... సినిమాలు... ఈ ఆటలన్నీ కట్టిపెట్టి నీ భార్యకు తగ్గ భర్తగా ఉండరా... నీ భార్య దేవిని చూస్తే సాక్షాత్తు లక్ష్మీదేవిని చూసినట్టు ఉంటుందిరా... రెండు మూడు సార్లు నాకు తెలియకుండా నా అంతట నేనే చేతులెత్తి నమస్కరించాను కూడా. ఆమెకు నువ్వు ద్రోహం చేశావంటే పుట్టగతులుండవురా"

కైలాష్ రంగమణి భుజం తట్టాడు.

"ఒరేయ్ ఆపరా! నోరు విప్పితే చాటభారతమే! ఈ రాత్రికి నీ గదిలో ఇంతచోటు దొరక్కపోతుందా అని వచ్చాను చూడూ. నన్ను చెప్పుతో కొట్టుకోవాలి"

"సరే సరే... ఇల్లు వచ్చేసింది... నీ దగ్గర సిగరెట్ లైటర్ ఉందా?" అంటూ ఇంటి మెట్లెక్కాడు రంగమణి.

"ఎందుకురా...?"

"చీకటిగా ఉంది... తాళం ఏ జాతిదో తెలియాలిగా...

సెవెన్ లివర్సా... ఫైవ్ లివర్సా... ఏ గ్రేడో తెలుసుకోవద్దూ?"

"ఇదిగో తీసుకో..."

"హూం .. ఏ చెడ్డ అలవాటునూ వదిలిపెట్టావురా..!"

గొణుక్కుంటూ లైటర్ అందుకున్నాడు రంగమణి.

లైటర్ వెలుగులో తాళాన్ని చూసి- "సెవెన్ లివర్స్.. పెద్ద భూతమే..." అన్నాడు. తనతో తెచ్చిన మాస్టర్ కీ బంచ్ నుండి దాని జోడీని వెదికాడు.

"నీకెక్కడిదిరా ఈ కీ బంచ్?"

"ఊళ్ళో మా నాన్న దగ్గరుండేది"

"ఆయనకెందుకురా ఇన్ని తాళం చెవులు...?"

"జస్ట్ హాబీ కోసమే!"

"హాబీ..."

"ఔనురా....! స్టాంపులు సేకరించడం కొందరికి ఎలా హాబీనో, రకరకాల తాళం చెవులు సేకరించడం మా నాన్నకు హాబీ! ఈ లైటర్‌ను కాస్త పట్టుకో... ఈ తాళానికి తగ్గ పెళ్ళికొడుకును చూస్తా"

కైలాష్ లైటర్‌ను పట్టుకోగా రంగమణి ఆ తాళానికి సరిపోయే రెండు మూడు తాళం చెవులను వేసి చూశాడు. ఏదీ సరిపోలేదు. చివరగా ఒక తాళం చెవితో తెరుచుకుంది.

"కిలాడివిరా నువ్వు...!" అంటూ తలుపులు తీసుకొని లోపలికెళ్ళాడు కైలాష్. కుడిపక్క గోడమీద తడిమి స్విచ్ వేశాడు.

## కొత్తగాలి...

**తెలుగుకోట గోడ**
**'పద్యం' అయితే**
**నవ్యతకు నాందీరూపం**
**'నానీ'!**

**పేరూరు బాల సుబ్రమణ్యం, తిరుపతి**



చమక్‌మని లైటు వెలిగి గదంతా వెలుతురు పరుచుకుంది. ఓమారు గదినంతా పరిశీలించాడు. ముందు గదిలో దుమ్ము నిండుకుంది. దండెంపై ఉతికి ఆరేసిన లంగా, జాకెట్టు, ఒక చీర ఇంకా రెండు బనియన్లు, లుంగీ వేలాడుతున్నాయి. లుంగీ కిందికి వేలాడుతోంది.

కైలాష్ మెల్లగా నడిచి వెళ్ళి గోడ పక్కగా నిలబెట్టి ఉన్న చెక్క బీరువా పిడిని, పక్కనే ఉన్న గాడ్రెజ్ బీరువా పిడిని పట్టుకుని లాగి చూశాడు. రెండూ గట్టిగానే ఉన్నాయి.

"ఏమిట్రా... దొంగతనమేమైనా జరిగిందేమోనని చూస్తున్నావా...? "

"ఔను! తాళం వేసిన ఇల్లు కదరా... ఎవడైనా దొంగ వెధవ ఇంట్లో దూరి ఏదైనా దొంగిలించుకు వెళ్ళుంటే? "

"రెండు బీరువాల తాళం చెవులూ ఎవరి దగ్గరుంటాయి...? "

"దేవి జాగ్రత్తగా తనతో తీసుకెళ్ళి ఉంటుంది..."

"బీరువాలో డబ్బూ, నగలూ ఏమైనా ఉన్నాయా? "

"లేవు. అంతా బ్యాంకులో ఉన్నాయి"

"బ్యాంకులో అంటే - లాకర్లోనా...? "

"నో... నో... బ్యాంకులో తనఖా పెట్టి లోన్ తీసుకున్నాను..."

"అన్ని నగలూ పెట్టేశావా...? "

"ఔను..."

"నీకు అంత కష్టం ఏమొచ్చిందిరా...? "

"తిరుచానూరు దగ్గర నూరు అంకణాల ప్లాట్ ఒకటి చీప్‌గా అమ్మకానికి ఉందని తెలిసింది. చేతిలో డబ్బు లేదు... దేవి దగ్గరున్న పదిహేను సవర్ల నగల్ని బ్యాంకులో తనఖా పెట్టి లోను తీసి ప్లాట్ కొన్నాను..."

"పర్లేదే. నువ్వూ అప్పుడప్పుడు మంచిపనులు చేస్తున్నావే? నగల్ని బ్యాంకులో పెట్టడం దేవికి అభ్యంతరం లేదుగా"

"ఆ ఐడియా మా ఆవిడిదేగా" అంటూ వంటగది తలుపు తీసి, స్విచ్ వేసి లోపలికి తొంగి చూశాడు కైలాష్.

అన్నీ వాటివాటి స్థానంలోనే ఉన్నాయి. గ్యాస్ సిలిండర్ మీద కూర్చొన్న ఎలుక ఒకటి అలికిడికి పారిపోయింది.

అతని వెనుకే వచ్చి నిలబడి అన్నాడు రంగమణి.

"నేను ఇక లాడ్జికి వెళతాను! ఉదయం ఐదు గంటలకంతా ఫస్ట్ షిఫ్ట్ కెళ్ళాలి"

"చాలా థ్యాంక్సురా...!"

"నీ థ్యాంక్స్ మా నాన్నకు చెప్పురా... ఆయనే కనుక తాళం చెవులు సేకరించక పోయుంటే... నువ్వింకా బయట మెట్ల మీదే కూర్చొని ఉండేవాడివి... సరే! వెళతారా" అని సెలవు తీసుకొని బయటకు దారి తీశాడు రంగమణి.

అతడు వెళ్ళిపోయాక కైలాష్ తలుపు గడియపెట్టాడు. డ్రెస్‌విప్పి, లుంగీ ధరించాడు. బాత్‌రూమ్‌కు వెళ్ళి ముఖం కడుక్కుని టవల్‌తో ముఖం తుడుచుకుంటూ వచ్చి మంచంపై కూర్చున్నాడు.

అతడు అలా కూర్చున్న క్షణాన కిటికీ నుండి వీచిన గాలికి మంచం కిందనుండి ఓ కాగితం ముక్క ఎగిరి గోడవారకు చేరి రెపరెపలాడసాగింది. ఆశ్చర్యంగా వంగి దాన్ని అందుకున్నాడు.

అది - ముక్కలు ముక్కలుగా చింపబడ్డ ఇన్‌లాండ్ లెటర్‌లోని ఒక భాగం దాన్ని పరిశీలనగా చూశాడు.

ఇంకా మిగిలిన ముక్కల కోసం గదంతా పరికించి చూశాడు. గోడవారగా మరో ముక్క కనిపించింది. వంగి దాన్ని అందుకున్నాడు. అందులో ఉన్న అక్షరాలను చదివిన కైలాష్‌కు ఏమీ అర్థం కాలేదు. తనకు వచ్చిన ఉత్తరాన్ని దేవి చింపి

పారేసి ఉండొచ్చు. ఈ ఉత్తరానికి సంబంధించిన ముక్కలు ఇక్కడే ఉండాలి. దొరికిన ఆ రెండు ముక్కలను చేత్తో గట్టిగా పట్టుకొని మంచం కిందకు వంగి చూశాడు.

ఇన్‌లాండ్ లెటర్ ముక్కలు చెల్లాచెదురుగా పడి కన్పించాయి. మంచం కింద దూరి, ముక్కలనన్నింటిని ఏరి మంచంపై పరిచాడు కైలాష్ .

అల్మారా తెరిచి ఒక తెల్లకాగితాన్ని, గమ్ బాటిల్‌ను తెచ్చి మంచంపై కూర్చున్నాడు.

ఒక్కో ముక్కను తీసి- అది చించబడ్డ సైజును బట్టి - తెల్లకాగితంపై అతికించటం మొదలుపెట్టాడు.

కొన్నిచోట్ల ఆగి- ఆలోచించి- అక్షరాల ప్రయోగాలను చూసి ఆ ప్రకారం అతికించాడు.

మొత్తం గంటసేపు పట్టింది. ఉత్తరాన్ని చదవటం మొదలుపెట్టాడు. ఉత్తరంలోని విషయం చదువుతున్న కొద్దీ, అందులోని అక్షరాలు ఈటెలుగా అతడి హృదయాన్ని గాయపరిచాయి. ఉత్తరాన్ని ఓసారి పూర్తిగా చదివాడు. చదివాక కాసేపు స్తబ్ధుగా ఉండిపోయాడు. మళ్ళీ చదవటం ప్రారంభించాడు.

ప్రియమైన దేవికి-

నీ ఉత్తరం చదివాక ఇది రాస్తున్నా. ఎదురుగా చెప్పుకోలేని చాలా విషయాలను రాశావు. నీ సంసార జీవితం సంతృప్తికరంగా ఉందనుకున్నాను. కానీ, అనేక మంది స్త్రీలు ఎదుర్కొనే సమస్యలే నీ జీవితంలోనూ సంభవించాయి. కష్టాలను భరించటానికే దేవుడు స్త్రీని పుట్టించాడేమో? అసలే చపలబుద్ధిగల నీ భర్త సినిమాలంటూ సెట్లోకి వెళితే ఇక వేరే చెప్పాలా.? అతడు వినేట్టు చెప్పిచూడు? కన్నీళ్ళకు కొంతమంది మగాళ్ళు కరగడం కద్దు. అవసరమైతే కన్నీళ్లు కురిపించి చూడు... కష్టాలను ఎదుర్కోలేని వాళ్ళే ఆత్మహత్యలకు పాల్పడతారు. దయచేసి ఆ నిర్ణయాన్ని మాత్రం తీసుకోకు.

ఇట్లు

నీ ప్రియ స్నేహితురాలు

వనజ

ఉత్తరాన్ని రెండోసారి చదివిన కైలాష్, నుదుటిపై చేత్తో రాసుకుంటూ ఆలోచనలో పడ్డాడు.

"ఎవరీ వనజ? దేవి ఒకసారి కూడా ఈ వనజ గురించి చెప్పలేదే? " ఆలోచిస్తూ డైరీతీసి ఉత్తరాన్ని అందులో దాచాడు. బయటి తలుపులు వేశాడో, లేదోనని ఓసారి చూసి వచ్చి, లైట్ తీసేసి మంచంపై పడుకున్నాడు. ఉత్తరం గురించే ఆలోచిస్తూ పడుకున్నాడు. కాసేపటికంతా నిద్రలోకి జారుకున్నాడు- కైలాష్.

★ ★ ★

ఏదో శబ్దం వినిపించటంతో గబుక్కున కళ్ళుతెరిచి చూశాడు కైలాష్. కిటికీ ఊచల బయట అరిగిపోయిన గుర్రంనాడాలా కనిపిస్తోంది ఆకాశంలో చందమామ! జీరో వాట్స్ బల్బ్ వెలుతురులో చేతికున్న వాచ్‌లో టైమ్ చూశాడు. రెండుంపావు...

ఏదో శబ్దం విన్నానే ఏమిటా శబ్దం"

మళ్ళీ శబ్దం వినిపిస్తుందేమోనని చెవులు రిక్కించి మంచంపై కూర్చున్నాడు.

సరిగ్గా ఐదు నిమిషాల తర్వాత మళ్ళీ ఆ శబ్దం వినిపించింది.

ఇంటి వెనుకవైపు గదిలో ఎవరో నడుస్తున్న శబ్దం...

కైలాష్ గుండె వేగంగా కొట్టుకోసాగింది. నిలబడి లుంగీ మోకాళ్ళదాకా మడిచి కట్టుకున్నాడు.

"అరె శబ్దం మళ్ళీ నిలిచిపోయిందే? ఇంటి వెనక్కు వెళదామా...? వద్దా...? "

కొంతసేపు సందిగ్ధావస్థలో కొట్టుమిట్టాడి, లేని ధైర్యాన్ని తెచ్చుకొని ఇంటి వెను

కన్నెపుకు దారితీశాడు. దారిలో ఉన్న స్విచ్‌లన్నిటినీ వేసుకుంటూ వెళ్ళాడు. అన్ని బల్బులూ ప్రాణం పోసుకున్నాయి.

వంటగది... బాత్‌రూమ్... పెరడు... అంతా ఓ మారు పరికించి చూశాడు. ఎవరూ లేరు!

'ఆ శబ్దం... ఒకవేళ... తన భ్రమా? కాదు.. వీధిలో ఎవరో నడిచి వెళ్తున్న శబ్దం.. ఇంటి వెనుక గదిలో నడుస్తున్నట్టుగా వినిపించిందేమో...? ఏది నిజం?'

మళ్ళీ లైట్లన్నీ ఆర్పేయటంతో చీకటి అలుముకుంది. మంచం దగ్గరకు వచ్చాడు కైలాష్. కళ్ళు మూసుకుని పడుకున్నాడు.

తెల్లవారింది...

తలుపు తీసుకొని బయటకు వచ్చిన కైలాష్ కంటికి ఎదురింటి మీనాక్షి ఆంటీ దర్శనమిచ్చింది. ఉదయాన్నే నిద్రలేచి తలారా స్నానంచేసి తలకు టవల్ చుట్టుకుంది. ఇంటిముందు వంగి ముగ్గువేస్తోంది. ఆమెను అడిగితే సరిపోతుందనుకుని 'ఆంటీ' అంటూ పిలిచాడు.

ముగ్గును ఆపి తలపైకెత్తి చూసింది మీనాక్షి.

తర్వాత కూతూహలంగా అడిగింది. "ఏం నాయనా, ఇంటి తాళంచెవి దొరికిందా...?"

"లేదాంటీ. ఫ్రెండ్‌ను తీసుకొచ్చి వాడి దగ్గరున్న తాళం చెవితో తీశాను."

"పనిమనిషి తలుపు తడుతుంటే చూశాను... పనిమనిషి ఏం చెప్పింది? అమ్మగారింటికే దేవి వెళ్ళిందటనా?"

"దానికీ తెలియదట!"

"అమ్మగారింటికే వెళ్ళుంటుంది నాయనా! ఇవ్వాళ నువ్వెళ్ళి తీసుకురా..."

అలాగేనంటూ తల ఊపుతూ ఆంటీ దగ్గరకు జరిగి లోగొంతుకతో అడిగాడు. "ఆంటీ.. దేవిని మీరు చివరిసారిగా ఎప్పుడు చూశారు"

ఆమె ఆలోచించి అంది "మీ అంకుల్‌ను

## కొత్తగాలి...

**వినయమే విజయం**
**విజయమే స్వర్గం**
**స్వర్గమే లక్ష్యం**
**లక్ష్యమే జీవితం**

– లోగిశ లక్ష్మీనాయుడు, సింహాచలం

ఆసుపత్రికి తీసుకెళ్ళిన రోజు చూశాను. వీధి మెట్లపై కూర్చొని ఉంది. నన్ను చూసి "ఆంటీ- నేనూ మీతో రానా?" అంటూ అడిగింది. నేను 'వద్దు' అని చెప్పి వెళ్ళిపోయాను.

"ఇంటికెవరైనా బంధువులొచ్చారా?"

"ఎవరూ వచ్చినట్టు లేరే?!" అంటూ ఏదో ఆలోచించి - "ఆఁ ఆఁ ఎవరో వచ్చినట్టే ఉన్నారు" అంది.

"ఎవరాంటీ?" ఆతృతగా అడిగాడు కైలాష్.

"నేను సరిగ్గా చూళ్ళేదు నాయనా! ఆస్పత్రిలో ఉన్న మీ అంకుల్‌కు జావ కాచి తీసుకెళ్ళటానికి సాయంత్రం ఏడు గంటలకు ఇంటికొచ్చాను... అప్పుడు దేవి ఎవరితోనో నవ్వుతూ మాట్లాడుతూ కనిపించింది. ఆ వ్యక్తికి నీ వయస్సే ఉండొచ్చు. ఎర్రగా... ఉంగరాలజుట్టు.. నేనున్న టెన్షన్‌లో అతనెవరో ఏమిటో అడగలేదు. ఇంతకీ ఎవరతను...?"

"మీరు చెబుతున్న గుర్తులను బట్టి నాకు తెలిసిన వాళ్ళలో ఎవరై ఉంటారబ్బా" ఆలోచనలో పడ్డాడు కైలాష్.

"దేవికి బంధువులేమో నాయనా..."

"ఆఁ... అంతే కావచ్చు ఆంటీ!!"

★ ★ ★

టవల్ చుట్టుకొని బాత్‌రూమ్‌లోకి వెళ్ళిన కైలాష్ 'ఎర్రగా.. ఉంగరాల జుట్టు.. ఎవరై ఉంటారబ్బా' దేవి బంధువు



లలో తన వయస్సున్న యువకులను ఒక్కొక్కరినీ గుర్తుకు తెచ్చుకున్నాడు. కానీ ఎవరూ ఎదురింటి ఆంటీ చెప్పిన పోలిక లతో జత కలవటం లేదు.

'అయితే ఇంతకీ వచ్చినతను ఎవరు? కొత్తవాడై ఉండాలి. పెళ్ళికి ముందు దేవి ఒక ప్రైవేటు కంపెనీలో టైపిస్ట్‌గా పనిచే సేది. కానీ పెళ్లయిన వెంటనే ఉద్యోగానికి రాజీనామా చేసిన విషయం కైలాష్‌కు గుర్తొచ్చింది. అతడి మనసులో మెల్లమె ల్లగా అనుమానపు బీజాలు నాటుకోసా గాయి. వచ్చినతను ఆ కంపెనీలో పనిచే సేవాడై ఉండొచ్చు. అతను దేవిని చూడ్డా నికి వచ్చి ఉండొచ్చు!' అలా వచ్చినవాడు పడకగది వరకూ వచ్చి అద్దంలో ముఖం చూసుకుంటూ తల దువ్వుకున్నట్టు న్నాడే...? ' ఇది తలలో మెదిలిందే తడవు కైలాష్ గుండెల్లో అగ్నిజ్వాల రగిలింది. 'దేవికి మొదటినుండే తనమీద అంత ప్రేమలేదు. తన నాటకాభిరుచి... సినిమా లపై మోజు... ఆవిడకు అలర్జీ.. రాత్రు లలో తాను కౌగలించుకున్నప్పుడు అంతగా ఆసక్తి కనబరచక అయిష్టంగా ముఖం పెట్టేది. వారానికి రెండుసార్లైనా అమ్మగా రింటికి వెళ్ళొస్తానని చెప్పి గబగబ అలంక రించుకునేది. రెండు మూడుసార్లు ఆఫీసు నుండి వస్తుంటే- వీధి చివరనున్న టెలి ఫోన్ బూత్ నుండి వస్తూ ఎదురుప డింది. "ఎవరికి ఫోను" అని అడిగితే- తన ఆఫీసు నుండి రావలసిన అరియర్స్ గురించి ఫోన్ చేసినట్టు చెప్పేది.

హైదరాబాద్ వెళుతున్నప్పుడు రావటా నికి పది రోజులు పడుతుంది? అని చెప్పి నపుడు ఆమె కళ్ళల్లో సంతోషం ప్రస్ఫు టంగా కనిపించింది. దేవి ఖచ్చితంగా స..రి..గా..లే..దు!

కైలాష్ ఆలోచిస్తూ సగం సబ్బును అర గదీసేంతవరకూ ఒళ్లు రుద్దుకున్నాడు. చప్పున... ఫ్లాష్‌లా - దేవి చెప్పిన మరో మాట గుర్తుకొచ్చింది.

పెళ్ళైన కొత్తలో ఓ రోజు... భాగ్యరాజా నటించిన 'చిన్నఇల్లు' సినిమాచూసి ఇంటికి ఆటోలో బయలుదేరారు కైలాష్, దేవి.

తను అన్నాడు, "ఇంకా ఇలాంటి వంద సినిమాలు వచ్చినా మగాళ్ళు చిన్నిల్లు సెటప్ చేసుకోవడం మానుకోరు. వాళ్ళను ఎవరూ మార్చలేరు."

"మార్చవచ్చు! దానికి ఒకే ఒక మార్గ ముంది" అంది దేవి.

"ఏంటది? "

"ఆడవాళ్ళు కూడా చిన్నిల్లు సెటప్ చేసు కోవడం మొదలెడితే సరి!!" దేవి చెప్పింది విని ఆటోడ్రైవర్ కిసుక్కున నవ్వాడు. కైలాష్ ముఖం చిన్నబోయింది.

దాని అర్థం ఇప్పుడు తెలుస్తోంది.

స్నానంచేసి బయటకు వచ్చాడు కైలాష్.

"బంగారిని ఓసారి కదిపి చూస్తే...? "

"బంగారీ..."

"అయ్యగారూ...? "

"నువ్వు పనిలో చేరి ఎన్నాళవు తోంది? "

"ఎనిమిది నెలలయ్యా"

"అమ్మగారు నీకెంత జీతం ఇస్తోంది.."

"నూటయాభై రూపాయలు..."

"అమ్మగారు నీతో ఎలా నడుచుకుం టుంది...? "

"బాగా చూసుకుంటారయ్యా..."

కైలాష్ కృత్రిమంగా నవ్వాడు.

"నీకు దాని గురించి తెలియదు బంగారీ. అది అప్పుడప్పుడూ నాతో- 'బంగారి సరిగ్గా పనికి రావటం లేదండీ, దాన్ని మాన్పించేద్దామండీ'- అనేది"

"అమ్మగారా అలా అన్నారు...? "

"ఔను...!"

"ఎందుకలా అన్నారు అయ్యగారూ..."

"తెలియదు బంగారీ... దేవి పద్ధతి కొద్ది

రోజులుగా బాగాలేదు. నా తరపు వాళ్ళకు సరిగ్గా మర్యాదలు చేయడంలేదు. నేను ఊళ్ళోలేని సమయంలో ఆమెకు కావలసిన వాళ్ళంతా వచ్చుంటారే...? "

"అలా ఎవరూ వచ్చినట్టు లేదయ్య గారూ..."

"ఎవరూ... రాలేదా...? "

"మీరు పోయిన నెలలో ఊరికి వెళ్ళిన పుడు మాత్రం అమ్మగార్ని వెదుక్కుంటూ ఒకతను వచ్చాడు. పనులన్నీ ముగించు కొని ఇంటికి బయలుదేరుతుండగా వచ్చా డతను"

"ఎవరతను? "

"ఎవరో తెలియదయ్యా... ఆయన్ను అదే తొలిసారి చూడ్డం..."

"ఎలా ఉంటాడు...? "

"ఎర్రగా... సుట్టెంట్రుకలతో..."

కైలాష్ కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"ఎర్రగా... సుట్టెంట్రుకలతో... పొడ వుగా ఉన్నాడు. మెడలో టై కట్టుకున్నాడు. ఆయన మాట్లాడుతున్నంతసేపూ అమ్మ గారు పడీపడీ నవ్వుతూనే ఉంది!"

"తర్వాత...? "

"కాఫీ తెమ్మంటారా? అని అడిగాను. అమ్మగారు వద్దని చెప్పేశారు..."

"అతను వచ్చినపుడు టైమ్ ఎంతయి వుంటుంది? "

"సాయంత్రం ఆరు అయ్యుంటుంది..."

"అతణ్ణి అంతకు ముందెప్పుడూ నువ్వు చూళ్ళేదా...? "

"లేదయ్యగారూ..."

"ఇదిగో చూడు బంగారీ... నువ్వు నా దగ్గర ఏదీ దాచాల్సిన పనిలేదు. నువ్వు చెప్పినట్లు నేను దేవితో చెప్పను"

"అయ్యొయ్యో... అదంతా నాకేం తెలి యదయ్యా..."

"సరే... అతణ్ణి నువ్వొక్కసారే చూశావు... మళ్ళీ చూళ్ళేదు... అంతే కదూ...? "

"అవునయ్యగారూ..."

"నేను ఊళ్ళోలేని సమయంలో అమ్మ గారు బయటికి ఎక్కడికైనా వెళు తుందా? ..."

"వెళుతుందయ్యా..."

"ఎక్కడికెళుతుంది...? "

"నాకు చెప్పి వెళ్ళరయ్యా..."

"బయటకు వెళ్ళి ఎంతసేపటికి మళ్ళీ తిరిగొస్తుంది? "

"ఓ గంట తరువాత..."

"సరే... నాకు కాఫీ ఇచ్చి నువ్వు ఇంటికి పో... టిఫిన్ ఏమీ చెయ్యకు... నేను హోటల్లో తినేస్తాలే... నువ్వెళ్ళి రేపు ఉదయం వచ్చేసెయ్ చాలు..."

"అమ్మగారిని ఎప్పుడు తీసుకొస్తా రయ్యా? "

"ఆలోచించాలి"

"ఎందుకయ్యా అలా అంటున్నారు...? "

"నీకు తెలియదులే కాఫీ తీసుకురా..."

బంగారి కైలాష్‌ను అదోలా చూస్తూ వంటగదిలోకి వెళ్ళింది. కైలాష్ గోడ బీరువా తలుపుతీసి ప్యాంటూ, షర్టూ తీశాడు. అంతే... దాని కింద ఉన్న తాళం చెవి ఎగిరి ఠంగ్‌మంటూ కిందపడింది. కైలాష్ వంగి దాన్ని అందుకున్నాడు. అది గాద్రెజ్ బీరువా తాళంచెవి. సరైనచోటే దేవి తాళంచెవిని దాచిపెట్టింది. ఈ తెలి వైనా ఉంది... అదే సంతోషం! ఆ తాళం చెవితో గాద్రెజ్ బీరువాను తెరిచాడు కైలాష్.

బీరువా అరలలో కనిపించిన మార్పును చూసి ఆశ్చర్యపడ్డాడు. బయట ఫంక్షన్ల కోసం దేవి కట్టుకునే చీరలన్నీ మాయమై ఉన్నాయి. పైఅర ఖాళీగా ఉంది. కొన్ని పాతచీరలు, తన బట్టలు రెండో అరలో కుప్పగా ఉన్నాయి.

"అమ్మగారు అన్ని చీరలూ పుట్టింటికి

తీసుకెళ్ళినట్టుంది అయ్యా"

వెనకనుంచి బంగారి గొంతు విని వెనక్కు తిరిగాడు కైలాష్.

"దేవి ఎప్పుడు పుట్టింటికి వెళ్ళినా అన్ని చీరలూ తీసుకెళ్ళదే... బ్యాగులో ఓ రెండు చీరల్ని మాత్రమే పట్టుకెళుతుందిగా? "

"అవునయ్యగారూ..."

"ఈసారి మాత్రం ఎందుకు అన్ని చీరలూ పట్టుకెళ్ళింది... దానితీరేమీ అర్థం కావటంలేదు..."

"అమ్మగారికి మీమీద కోపమేమో ? "

"ఎందుకు కోపమో చెప్పి వెళ్ళుండచ్చు కదా? సరే కాఫీ ఇలా ఇవ్వు"

బంగారి కాఫీ గ్లాసు అందించి లోపలికి వెళ్ళింది. కాఫీ ఓ గుక్కతాగి బీరువాలో మూడోఅరలో ఏముందో వంగి చూశాడు కైలాష్. లోపల...

పసుపూ... ఎరుపూ రంగుల్లో... ఓ చిన్ని ప్యాకెట్ కనబడింది. ఆశ్చర్యంతో... బయటకు తీశాడు. ప్యాకెట్‌లో ఏముందో- దాని మీదున్న అక్షరాలను చదివి అదిరిపడ్డాడు.

దంపతులకోసం తయారు చేయబడ్డ కుటుంబనియంత్రణా సాధనం అది! పెళ్ళై ఈ ఏడాదిన్నర కాలంలో దాన్ని ఏనాడూ తాను కొన్నది లేదు. అంటే దేవి...?

కైలాష్ కడుపులో దేవినట్లైంది. ఆ ప్యాకెట్‌ను అసహ్యంగా చూస్తున్న కైలాష్ బంగారి అడుగుల శబ్దం విని, దాన్ని బీరువాలోకి నెట్టేసి చప్పున బీరువా తలుపు మూశాడు.

★ ★ ★

ఆటోదిగి వేగంగా లోనికి వస్తున్న కైలాష్‌ను చూసి ఎవరికో ఫోన్ డయల్ చేస్తున్న జయంతి రిసీవర్‌ను క్రెడిల్ చేసింది.

"ఏంటండీ సాయంత్రం వస్తానని అప్పుడే వచ్చేశారే? ఆఫీసుకు వెళ్ళలేదా? ఏమిటలా ఉన్నారు? "

"ఈ ప్రపంచంలో ఎవరిని నమ్మాలో తెలియటం లేదు"

"ఏమైంది మీకు... ఉన్నట్టుండి తత్వం మాట్లాడుతున్నారే! ఇంట్లో మీ భార్య ఏమైనా అందా...? "

"అది ఇంట్లో ఉంటే కదా...!" అంటూ సోఫాలో కూలబడ్డాడు.

కైలాష్ అటు ఇటు చూశాడు. ఐదునిమిషాలపాటు బాధాతప్త హృదయంతో జరిగినదంతా ఆమెకు వివరించాడు- ఆ ప్యాకెట్ సమాచారంతో సహా...!!

మనసులో ఆనంద తరంగాలు ఉవ్వెత్తున ఎగిసిపడుతున్నా బయటకు కనిపించనీయకుండా ఆశ్చర్యంగా బుగ్గలపై వేలుంచుకుంది జయంతి.

"చూస్తే పిల్లిలా ఉంది. ఆమేనా ఇలా..? నమ్మశక్యం కావడం లేదే.."

"నేను నమ్ముతున్నాను జయంతీ. గత మూడునెలలుగా దాని నడవడిక బాగోలేదు. నేను ఊరికి వెళతాననగానే దాని కళ్ళలో సంతోష ఛాయలు కనిపిస్తాయి. ఈమధ్య నేనేం చెప్పినా నా మాటలు పట్టించుకోవటం లేదు. తలచుకున్నదే తడవు పుట్టింటికి వెళతానని బ్యాగు అందుకుంటుంది. ఈసారి నేను పదిరోజులు ఊళ్ళోలేను. బాగానే ఆట్లాడినట్టుంది..."

జయంతి సోఫాలో వెనక్కువాలింది. లోగొంతుకతో అంది "సరే... దేవి విషయంలో మీ తర్వాతి స్టెప్ ఏమిటీ? "

"అదే, అర్థం కావటం లేదు..."

"నేను చెప్పినట్టు వింటారా? "

"చెప్పు"

"ఈరోజు కూడా ఆఫీసుకు సెలవుపెట్టి ముందు చిత్తూరుకు వెళ్ళండి. అమ్మగారింట్లో సెటిలైన దేవిని మంచితనంగా

తీసుకురండి..."

కైలాష్‌కు కోపం నషాళానికెక్కింది.

"తీసుకొచ్చి ఆ శీలంలేని దానితో సంసారం చెయ్యమంటావా? "

"సంసారం చెయ్యమనటంలేదు. ఇద్దరూ మాట్లాడుకొని ఒక నిర్ణయానికి రండి"

"దానితో నేనేం మాట్లాడాలి...? "

"తరచూ ఇంటికొచ్చే ఆ కర్లింగ్ హేర్ వ్యక్తి ఎవరని నిదానంగా అడగండి. బీరు వాలోని ఆ ప్యాకెట్‌ను చూపించి- 'ఈ ఇంట్లో దీని అవసరం ఏమిటీ, ఇది బీరు వాలోకి ఎలా వచ్చిందో చెప్పమనండి' దాంతో ఉక్కిరిబిక్కిరై చచ్చినట్టు నిజం చెబుతుంది. అలా దేవి నిజం చెప్పినట్ట యితే... ఆపైన మీరు కాస్త సంయమ నంతో నడుచుకోవాలి."

"ఏంటీ సంయమనంతోనా...? "

"అవును! ఇద్దరూ ఒక మంచి లాయర్ దగ్గరికి వెళ్ళి వేరే ఏవోకారణాలు చెప్పి చట్టప్రకారం విడాకులు తీసుకోండి..."

జయంతి చెప్పేకొద్దీ- కైలాష్ ఆలోచ నలో పడ్డాడు.

"ఏమిటీ ఆలోచిస్తున్నారు? "

"వ్యవహారం కోర్టువరకూ వెళితే అంతా బయటపడుతుంది."

"అయ్యే తీరుతుంది మరి!... అలా అని భయపడుతూ కూర్చుంటే సరిపోతుందా? మీరు మాట్లాడకుండా ఉంటే ఆమె అలాగే నడుచుకుంటుంది. అందుకు మీరు సమ్మ తించేటట్టయితే కోర్టుకు వెళ్ళాల్సిన అవ సరం లేదు. ముందు మీరు చిత్తూరుకు వెళ్ళి దేవిని తీసుకొచ్చి, ఆ నీచమైన వ్యవ హారం ముగిసేలా చూడండి"

★ ★ ★

కైలాష్ చిత్తూరులో బస్ దిగినపుడు సమయం ఉదయం పదకొండు గంటలు.

ఆటో మాట్లాడుకుని రామ్‌నగర్‌లో ఉన్న దేవి ఇంటిముందు దిగాడు.

ఇంటి తిన్నెపై కూర్చొని పేపర్ చదువు కుంటున్న దేవివాళ్ళ నాన్న శివశంకరయ్య, లోపల వసారాలో చాటలోని బియ్యంలో రాళ్ళేరుకుంటున్న దేవి వాళ్ళమ్మ రుక్మి ణమ్మ కైలాష్‌ను చూసి గబగబ లేచి నిల బడ్డారు. మొహంపైకి నవ్వును పులుము కుని ఇంటిలోపలికి ఆహ్వానించారు.

కైలాష్ మర్యాదకు కూడా నవ్వకుండా ఇంటిలోపలికి నడిచాడు. దేవి ఎక్కడైనా కనిపిస్తుందేమోనని అటు ఇటు చూశాడు. యాభై ఐదేళ్ళ శివశంకరయ్య కుర్చీ పట్టు కొచ్చివేశాడు.

"కూర్చో బాబూ" అన్నాడు మర్యాదపూ ర్వకంగా.

కైలాష్ గంటు పెట్టుకున్న ముఖంతో మౌనంగా కూర్చున్నాడు.

వంటగది గోడవారగా నిలబడి- తల మాత్రం బయటపెట్టి రుక్మిణమ్మ మెల్లగా కైలాష్‌ను ప్రశ్నించింది, "మీరు మాత్రమే వచ్చారా? దేవిని తీసుకు రాలేదా? "




**"ఏ**మన్నారు...? " చటుక్కున లేచి నిలబడి వంటగదివద్దకు నడిచాడు కైలాష్. ఆమె అతని గొంతులోని తీవ్ర తను గుర్తించకుండా అంది "మీరు మీ పనిమీద చిత్తూరుకు వచ్చినట్టుంది. మీతో దేవిని కూడా తీసుకొచ్చుంటే బావుండేది!"

"దేవి అక్కడుంటే కదా తీసుకు రావటా



నికి...?" వ్యంగ్యంగా అన్న కైలాష్‌ను కంగారుగా చూశారు ఆ దంపతులిద్దరూ.

"బాబూ.. ఏమిటి నువ్వంటున్నది...?"

"నిజమే చెబుతున్నాను"

"దేవి అక్కడ లేదా? ఎక్కడికెళ్ళింది?"

"ఆ విషయం తెలుసుకోడానికే ఆఫీసుకు సెలవు పెట్టి ఇక్కడికొచ్చాను" కైలాష్ గొంతులో అసహనం, అసహ్యం..

"ఏమిటల్లుడూ మీ మాటలు అదో రకంగా ఉన్నాయి"

"మీ అమ్మాయీ అదో రకమైందే కదా? నా మాటలూ అలాగే ఉంటాయి. నేను హైదరాబాద్ వెళ్ళివచ్చేలోపు మీ అమ్మాయి ఇంటినుండి పారిపోయినట్టుంది. ఇల్లు తాళం వేసుంది. నా ఇంట్లోకి నేనే దొంగలా డూప్లికేట్ తాళంతో తెరిచి వెళ్ళాల్సివచ్చింది"

"దేవి ఇక్కడకు రాలేదు బాబూ..."

"అయితే ఎక్కడకు వెళ్ళినట్టు...?"

"ఇరుగుపొరుగును విచారించారా?"

"విచారించాను!"

"ఏం చెప్పారు...?"

"పుట్టింటికి వెళుతున్నట్టు పక్కింట్లో చెప్పిందట. మీరేమో రాలేదంటున్నారు"

"అంటే.. అంటే.. ఇక్కడికొస్తుంటే దారిలో దేవికి ఏదో జరిగుంటుంది. అందుకే అమ్మాయి ఇక్కడికి చేరలేదు" శివశంకరయ్య తడబడుతూ అంటూండగానే వంటగదిలో రుక్మిణమ్మ గొల్లుమని ఏడుస్తున్న శబ్దం వినిపించింది.

కైలాష్ వ్యంగ్యంగా నవ్వాడు. రుక్మిణమ్మ ఏడుస్తూ భర్తతో అంది.

"ఏమండీ... మీరు చెబుతున్నది చూస్తుంటే, అమ్మాయిని ఎవరో బలవంతంగా ఎత్తుకెళ్ళినట్టు అనిపిస్తోందండీ"

"అల్లూడూ మీరు నవ్వుతూ మాట్లాడుతుంటే నా కడుపులో దేవినట్టుంది. అసలు దేవి ఏరోజున ఇల్లొదిలి వెళ్ళిందో పక్కింట్లో అడిగారా?"

"అడిగాను! మూడురోజుల కిందటే వెళ్ళిందట."

"మూడురోజుల ముందే బయలుదేరిందా?" అదురుతున్న గుండెల్ని చిక్కబట్టుకొని భార్య వంక చూశాడు శివశంకరయ్య. రుక్మిణమ్మ గోడకు చేరగిలబడి పైటకొంగును నోటికి అడ్డుపెట్టుకొని పెల్లుబుకుతున్న దుఃఖాన్ని ఆపుకోలేకపోతోంది.

"బయలుదేరు బాబూ"

"ఎక్కడికీ?"

"పోలీస్ స్టేషన్‌కు..."

"తొందరపడి పోలీస్‌స్టేషన్‌కు వెళితే, ఆ విషయం పేపర్లో పెద్ద పెద్ద అక్షరాల్లో వస్తుంది మామగారూ. దేవి ఇక్కడికి రాలేదంటే మరెక్కడికి వెళ్లుంటుందో కాస్త ఆలోచించండి!"

"ఆలోచించడానికి ఏముందల్లుడూ! అమ్మాయికి తిరుపతి తర్వాత చిత్తూరే తెలుసు. ఇంకేదీ తెలియదు"

"స్నేహితులింటికి వెళ్ళిందేమో...?"

"స్నేహితులెవరూ లేరు బాబూ..."

"అని మీరంటున్నారు! కానీ, దానికి స్నేహితులున్నారు. నిజం చెప్పాలంటే దానికి బాయ్‌ఫ్రెండే ఉన్నాడు"

"అల్లుడూ, ఏమిటి మీరంటున్నదీ" శివశంకరయ్య ముఖం ఎర్రబడింది.

కైలాష్ విలాసంగా నవ్వాడు.

"దీనికే మీరు ఇంతగా ఆవేశపడుతున్నారే మామగారు... నేను చెప్పబోయే విషయాలను మీరెలా జీర్ణించుకుంటారో"

"ఏం... చెప్పబోతున్నారు...?"

"మీ దగ్గరి బంధువుల్లో ఎవరైనా నా వయస్సు ఉండి, ఎర్రగా, కర్లింగ్ హేర్‌తో ఉన్నారా...?"

"మీరు ఏ ఉద్దేశ్యంతో అడుగుతున్నారు అల్లుడూ...?"

"అది తర్వాత చెబుతాను. ముందు



నేను అడిగిన ప్రశ్నకు జవాబివ్వండి. నేను చెప్పిన పోలికలతో ఎవరైనా ఉన్నారా...? "

"అలాంటి వాళ్ళెవరూ లేరు...? "

"అయితే... నేను ఊళ్ళోలేని సమయంలో... ఎర్రగా, కర్లింగ్ హేర్‌తో ఉన్న ఒక వ్యక్తి సాయంత్రం ఆరుగంటల తర్వాత ఇంటికి వస్తున్నాడట... మరి అతనెవరు...? "

"ఎవరు చెప్పారు మీకు...? " కోపంతో రగిలిపోతూ వంట గదిలో నుండి బయటికొచ్చింది రుక్మిణమ్మ.

"ఊc.. రండి అత్తయ్యా! ఇలా ధైర్యంగా వచ్చి నా ముందు నిలబడి అడగండి... చెబుతాను... ఆ నీచమైన విషయాన్ని గురించి బాగా నమ్మకమున్న వాళ్ళే నాకు చెప్పారు. పనిమనిషి బంగారీ, ఎదురింటి మీనాక్షి ఆంటీ..."

"ఇలా అమ్మాయిపైన అభాండాలు వెయ్యడం మంచిది కాదు అల్లుడూ" శివ శంకరయ్య ఆవేశపడ్డాడు.

"ఇలా మాట్లాడ్డం నాకేమీ సరదా కాదు మామగారూ. ప్రతి భర్తా తన భార్యను పతివ్రత అని చెప్పుకోవడానికే ఇష్టపడతాడు. కానీ నేనలా చెప్పుకోలేకపోతున్నాను. వచ్చినతను బెడ్‌రూమ్ డ్రస్సింగ్ టేబుల్ పైనున్న దువ్వెన తీసి తల దువ్వుకున్నాడు. వాడి దురదృష్టం, నా అదృష్టం... ఆ దువ్వెనలో వాడి కర్లింగ్ హేర్ చిక్కుకుపోయింది... నాకుగానీ, మీ అమ్మాయికిగానీ కర్లింగ్ హేర్ లేదన్న విషయం మీకూ తెలుసు"

"దువ్వెనలో ఎవరివో వెంట్రుకలు ఉందన్న కారణాన్ని చూపి అమ్మాయిని తప్పుగా ఆలోచించవచ్చా అల్లుడూ? ఇరుగూ పొరుగూ వాళ్ళ చిన్న పిల్లలెవరైనా ఇంటికి వచ్చి ఉండొచ్చు వాళ్ళకు దేవి తల దువ్వి ఉండొచ్చుకదా? "

కైలాష్ నవ్వాడు.

"సరే ఒప్పుకుంటాను. ఈ వెంట్రుకల విషయాన్ని పక్కన పెట్టేద్దాం! బీరువాలో నేను తీసుకురాని ఒక వస్తువును అది దాచిపెట్టిందే... మరి దానికేమంటారు...? "

"ఏ వస్తువు? "

"ఇంటికి రండి చూపిస్తాను. అమ్మా నాన్న స్థానాల్లో ఉన్న మీ దగ్గర అదేమిటో నా నోటితో చెప్పలేను"

రుక్మిణమ్మ తన భర్తను చూసి కుమిలి కుమిలి ఏడవసాగింది.

"నా పెంపకంలో పెరిగిన అమ్మాయి ఎప్పటికీ తప్పు చెయ్యదు. పోలీసులకు ఫిర్యాదుచేసి మన అమ్మాయిని వెదకమని చెప్పండి. నా బంగారుకొండకు ఏదో అయ్యుంటుంది"

"దానికేమీ జరగలేదు అత్తయ్యగారూ.. ఏదో ఒక లాడ్జ్‌లో ఆ కర్లింగ్ హేర్ వాడితో సంతోషంగానే ఉంటుంది. పోలీసులకు ఫిర్యాదు చేశారంటే ఓ గంటలో వాళ్లు దేవినీ, ఆ ప్రియుణ్ణీ వలవేసి పట్టుకొచ్చేస్తారు. తరువాత పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి మీరూ, నేనూ, మామగారూ... అందరూ తల వొంచుకుని నిలబడాల్సిందే! నేను ఈ రోజు ఏదో ఈ మాట అంటున్నానని అనుకోకండి. మీ అమ్మాయి దేవికి మొదటి నుండీ నేనంటే ఇష్టంలేదు. చాలా రోజులుగా మీకు ఈ విషయాన్ని చెబుదామని అనుకుంటున్నాను. కానీ ఆ అవకాశమే రాలేదు"

శివశంకరయ్య కల్పించుకున్నాడు.

"మా అమ్మాయికి మీమీద చాలా అభిమానం అల్లుడూ... కానీ మీ నడవడికే దానికి నచ్చలేదు"

"నా నడవడికలో ఏం నచ్చలేదట? "

"రెండు మూడు విషయాలున్నాయి..."

"ఏమిటో చెప్పండి..."

"మీరు నాటకాలాడ్డం..."

"తరువాత...?"

"ఆ డ్రామా ఆర్టిస్ట్ జయంతి ఇంటికి అప్పుడప్పుడూ మీరు వెళ్ళటం"

"ఇంతేనా, ఇంకా ఏమైనా ఉన్నాయా మామగారూ? నేను ఉద్యోగం చేస్తూ ఒక డ్రామా ట్రూప్‌ను నడపటం పెళ్ళికి ముందే మీకు తెలుసు. అప్పుడు ఆ విషయాన్ని ఓపికగా నలుగురికీ చెప్పి సంబరపడ్డారట. పంతులు ఇప్పటికీ చెబుతుంటాడు నాతో! నేను డ్రామా ట్రూప్‌ను నడపటం తెలిసే మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళిచేశారు... ఇక ఆ జయంతి విషయానికి వద్దాం. ఆవిడ ఒక డ్రామా ఆర్టిస్ట్. నటన ఆవిడ వృత్తి. నటించడంలో ఆవిడ ఇప్పటికీ టాప్. ఆమె నటిస్తే ఆడిటోరియం హౌజ్ ఫుల్. పెద్దబంగళా, టెలిఫోన్ ఉన్న ఆమెకు కాస్త గర్వం కూడా ఉంది. నా నాటకాల్లో ఆమెను నటించమని అడిగేందుకు అప్పుడప్పుడూ వెళ్ళి ఆమెను కలవాల్సివస్తోంది. అందుకని వెంటనే నా గురించి తప్పుగా అనుకోవడమేనా? ఇక మూడవ విషయం సినిమా. ఈ ఛాన్స్ అందరికీ రాదు మామగారూ. తిరుపతిలో ఎన్ని డ్రామా ట్రూపులు లేవు. ఏ ట్రూప్‌నూ వెదుక్కుంటూ ఆ డైరెక్టర్ వెళ్ళలేదే? నా దగ్గరికేగా వచ్చాడు! అదృష్టం వరిస్తున్నప్పుడు నేను కాలదన్నుకోవచ్చా మావయ్యా? రేపు సినీఫీల్డులో నేను ఓ ప్రముఖ వ్యక్తినైతే, అది మీకూ, మీ అమ్మాయికీ గొప్పకాదా?"

శివశంకరయ్య చేత్తో ఆపమని చెప్పి,

"ఇదిగో చూడండి అల్లుడూ- మీరు చెప్పే కారణాలను వినడానికి నేను తయారుగా లేను. పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళబోతున్నాను. మీరు నాతో వస్తారా, రారా?"

"నేను ఇంతగా చెబుతున్నా మీరు వినటం లేదు. తర్వాత మీ ఇష్టం... సరే, రండి- స్టేషన్‌కు వెళదాం. కానీ, నేను

## కొత్తగాలి...

**వారమంతా 'వెబ్'**
**వారాంతాల్లో 'పబ్'**
**ఇదీ నవతరం 'హబ్'**

-ప్రియ, హైదరాబాద్

రిపోర్ట్ ఇవ్వను. మీరే ఇవ్వాలి"

"నేనే ఇస్తాను. రండి!"

★ ★ ★

పోలీస్‌స్టేషన్!

కొత్తగా రిక్రూటై వచ్చిన ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్ కొత్త యూనిఫాంతో చురుగ్గా కనిపించాడు. శివశంకరయ్య చెప్పిన వివరాలను విన్నాక, కైలాష్ వైపు దృష్టి సారించాడు.

"దేవి హజ్బెండ్ మీరే కదూ?"

"యస్... ఇన్‌స్పెక్టర్"

"మీరు హైదరాబాద్ నుండి ఎప్పుడొచ్చారు?"

"నిన్న రాత్రి...."

"మీ భార్య కనిపించటంలేదని తిరుపతి పోలీస్‌స్టేషన్‌లో రిపోర్ట్ ఇచ్చారా...?"

"లేదు సార్"

"దేవి ఎక్కడికి వెళ్ళుంటుందని మీరు అనుకుంటున్నారు....?"

కైలాష్, ఇన్‌స్పెక్టర్ ముందున్న బల్లపై తన రెండు మోచేతుల్నీ ఆనించి సన్నగొంతుతో చెప్పటం ప్రారంభించాడు.

"ఇన్‌స్పెక్టర్, నేను చెప్పబోయే విషయం మా మామయ్యకూ, అత్తయ్యకూ చేదుగా ఉండొచ్చు. కానీ అదే నిజం.. దేవికి ఒక యువకునితో అక్రమ సంబంధం ఉంది. ఆమె వాడితో పారిపోయుండాలి"

"అంత కచ్చితంగా ఎలా చెప్పగలరు?"

## కాకలు తీరిన రచయిత రాజేష్‌కుమార్


రాజేష్‌కుమార్

రాజేష్ కుమార్ 1947 మార్చి 20న జన్మించారు. బి.ఎస్సీ చదివి ఉపాధ్యాయులుగా, సేల్స్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేశారు. 1968నుండే రచనలు ప్రారంభించినా వృత్తి రచయితగా మారింది మాత్రం 1980 నుంచే. ఇప్పటిదాకా ఆయన వేయికి పైగా నవలలు, పదిహేను వందల కథలు, పాతిక పైనే రేడియో నాటకాలు రాసి గిన్నిస్ బుక్‌లో స్థానం సంపాదించబోతున్నారు. ఆనంద వికటన్, కుముదం, చావి, కుంగుమం, దేవి, రాణి తదితర తమిళ పత్రికల్లో వీరి నవలలు సీరియల్స్‌గా ప్రచురితమయ్యాయి.

దూరదర్శన్‌లో ప్రసారమైన 'ఎంగేఅవళ్', 'జనవరిల్ ఒరునాళ్' సీరియల్స్‌కు ప్రేక్షకుల నుండి సైతం మంచి ఆదరణ లభించింది. వీరి డిటెక్టివ్ నవలలు ప్రచురించటానికే 'క్రైమ్ నావల్' అన్న మాసపత్రిక నడుస్తోందంటే వీరు ఎంత ప్రతిభావంతులో తెలుస్తుంది. ప్రస్తుతం మూన్ టి.విలో వీరి డిటెక్టివ్ కథలు సీరియల్‌గా రానున్నాయి.

చిరునామా: రాజేష్ కుమార్,
23, యమున స్ట్రీట్, క్యూరియో గార్డెన్ అవెన్యూ, భారతీయార్ యూనివర్సిటీ పోస్ట్, కోయంబత్తూర్-641046

కైలాష్ అన్ని విషయాలూ చెప్పాడు... దువ్వెనలో చిక్కుకున్న కర్లింగ్ హేర్, బీరువాలో కనబడ్డ కండోమ్స్ ప్యాకెట్, దేవి పట్టుకెళ్లిన చీరెలు- ఒక్కటీ విడిచి పెట్టకుండా అన్నీ చెప్పాడు.

"ఆ వ్యక్తి ఎవరో మీకు తెలుసా? "

"తెలియదు సార్. ఎర్రగా, కర్లింగ్ హేర్... ఈ రెండు గుర్తులు తప్ప నాకింకేమీ తెలియదు..."

"దేవి మీ పెళ్లికి ముందు పనిచేసిన కంపెనీ పేరేమిటీ? "

"స్వస్తిక్ ప్లాస్టిక్ ఇండస్ట్రీస్"

"అది చిత్తూరులోనే ఉంది కదూ? "

"ఔను సార్..."

ఇన్‌స్పెక్టర్- కంపెనీ ఫోన్ నెంబర్ తెలుసుకుని డయల్ చేశాడు.

"హలో! స్వస్తిక్ ప్లాస్టిక్ ఇండస్ట్రీస్..."

"యస్..."

"ఎస్సై ధ్యానేశ్వర్‌ను మాట్లాడుతున్నాను. మీ మేనేజర్ ఉన్నారా? "

"మేనేజర్ రఘుపతినే మాట్లాడుతున్నా"

"సార్ ఒక చిన్న ఎంక్వయిరీ..."

"అడగండి..."

"మీ కంపెనీలో గతంలో- దేవి అనే ఒక అమ్మాయి పని చేసిందా? "

"ఔను... చేస్తుండేది, పెళ్లయ్యాక మానేసింది.. ఏం సార్, ఏంటి విషయం..? "

"నథింగ్...! మీ కంపెనీలో ఎర్రగా, కర్లింగ్ హేర్‌తో ఎవరైనా స్టాఫ్ ఉన్నారా? "

"ఔను మోహన్ అని ఒకతను ఉన్నాడు. దేవీ అతనూ ఒకే సెక్షన్‌లో పనిచేసేవారు"

"ఇద్దరి మధ్యా ఎలాంటి సంబంధం ఉండేదో కాస్త చెప్పగలరా? "

"ఆఫీస్ లంచ్ అవర్లో ఇద్దరూ ఒకటిగా కూర్చొని భోజనం చేస్తుండగా చూశాను. బస్సుకోసం ఇద్దరూ కాచుకుని ఉండటం చూశాను. వాళ్లిద్దరి గురించి ఆఫీసులో ఏవేవో గుసగుసగా చెప్పుకొనేవారు. ఏం సార్ ఎనిథింగ్ రాంగ్? "

"జస్ట్ ఒక ఎంక్వయిరీ ... బై ద బై ఆ

మోహన్‌ను కాస్త పిలుస్తారా? "

"సారీసర్ అతను సెలవులో ఉన్నాడు"

## 5

ఆ విషయం విని ఓ రెండు క్షణాలు ఆలోచించి మళ్లీ ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"సెలవులో ఉన్నాడా... ఏం...? "

"కారణం- 'పర్సనల్' అని రాశాడు!"

"ఎప్పటినుండి ఎప్పటివరకూ..? "

"ఒక్క నిమిషం సార్... హెడ్ క్లర్క్‌ను అడిగి చెబుతాను" అని అటు నుండి చెప్పిన మేనేజర్ సరిగ్గా అరనిమిషం తర్వాత మళ్లీ జవాబిచ్చాడు.

"ఈ నెల 5వ తేదీ నుండి వచ్చే నెల 10వ తేదీ వరకు సెలవు పెట్టాడు సార్!"

"మెడికల్ లీవా..."

"నో... నో... మెడికల్ లీవు కాదు... 'లాస్ ఆఫ్ పే'లో సెలవు అప్లై చేశాడు. రీజన్ 'పర్సనల్' అని రాసుకున్నాడు.

"ఇంటి చిరునామా చెప్పగలరా? "

"నోట్ చేసుకోండి.. ఎం. మోహన్, 10-132, మూడో వీధి సంతపేట, చిత్తూరు."

"థాంక్యూ"

రిసీవర్ క్రింద పెట్టి తనకెదురుగా కూర్చొని ఉన్న వాళ్లని చూసి చెప్పాడు ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్.

"మీరు చెప్పిన గుర్తులుగల వ్యక్తి పేరు మోహన్. ప్రస్తుతం సెలవులో ఉన్నాడు. ఇంటి అడ్రస్ ఇచ్చారు. కైలాష్ నాతో రండి... ఆ మోహన్ ఇంటికి వెళ్లి విచారించి వద్దాం..."

కైలాష్ నవ్వుతూ లేచాడు.

"ఒకటి ఒకటి రెండు- అన్నంత సులభంగా సమస్య ఈజీగా సాల్వ్ అయిపోయింది ఇన్‌స్పెక్టర్. దేవి కనిపించడం లేదు. మోహన్ కూడా సెలవులో ఉన్నాడు. ఇక ఒక నిర్ణయానికి రాలేమా ఇన్‌స్పెక్టర్? "

"విచారణ చేస్తేనేగా తెలిసేది? "

"మావయ్యా అత్తయ్యతో ఇంటికి వెళ్లి

## పాతికేళ్ల రచనా వ్యాసంగం



జిల్లేళ్ళ బాలాజీ

పాతికేళ్ల సాహితీ ప్రస్థానంలో వందకు పైగా కథలు, యాభైకి పైగా కవితలు, అయిదు అనువాద నవలలు రాశాను. కొన్ని కథలు తిరుపతి ప్రసారభారతి నుండి ప్రసారమయ్యాయి. ఆధారం, శత్రుసంహారం, నలుగురిలో ఒకడు, అమ్మడైరీ, సజీవం, కొలువు తదితర కథలకు వివిధ సంస్థలు, వారపత్రికల నుండి బహుమతులు అందుకున్నాను. తమిళభాషపై పట్టు ఉన్నందున అనువాదాలు చేస్తున్నాను. జ్ఞానపీఠ పురస్కార గ్రహీత జయకాంతన్‌గారి రెండు నవలలను తెలుగువారికి 'కళ్యాణి వెడ్స్ దివాకర్', 'అనుబంధాలు' పేరిట అందించాను. అటు క్లాసిక్స్‌తోపాటు మాస్ నవలల్ని కూడా మనవాళ్లకు పరిచయం చేయాలని రాజేష్ కుమార్‌గారి నవలలను అనువదించాను. దీనితో ఇప్పటి వరకూ చతురలో నావి రెండునవలలు వచ్చినట్లయింది. మంచి కథలూ, నవలలూ రావటానికి సహకారాన్నందిస్తున్న చతుర, విపుల సంపాదక వర్గానికి కృతజ్ఞతలు.

చిరునామా: జిల్లేళ్ళ బాలాజీ,
ఇం. నెం. 5-17, టెలిఫోన్ కాలనీ,
లింగేశ్వర నగర్, బైరాగిపట్టెడ,
తిరుపతి-517501.



పోండి. నేనూ ఇన్‌స్పెక్టరూ ఆ మోహన్ ఇంటికి వెళ్లి మాట్లాడి వచ్చేస్తాం"

శివశంకరయ్య, రుక్మిణమ్మ ముఖాలు రక్తం లేనట్టు పాలిపోయి ఉన్నాయి.

★ ★ ★

సంతపేట-

3వ వీధి, 10-132వ నెంబరున్న ఇల్లు ఒక చిన్న బంగళాలా ఉంది. కాంపౌండ్ గేట్‌కు ఇరువైపులా పూలమొక్కలు విర బూసి ఉన్నాయి. 'కుక్క ఉంది జాగ్రత్త' అన్న బోర్డు గేట్‌కు వ్రేలాడుతోంది. కుక్కకు భయపడి లోనికి రాడేమోనన్న సందేహంతో బీట్ పోస్ట్‌మేన్‌కోసం - గేట్‌కు లెటర్ బాక్స్ వేలాడుతోంది.

జీప్‌లో నుండి కిందకు దిగాడు ధ్యానే శ్వర్. వెనుకే అనుసరించాడు కైలాష్.

కాంపౌండ్ గేట్‌ను తీయగానే కుక్క గుర్ర్‌ర్రమనడం, ఆ వెంటనే "ఏయ్... టైగర్.. కీప్ క్వయిట్" అన్న మాటలూ వినిపించాయి. కుక్కగుర్రు ఆగింది.

ఇద్దరూ లోపలికి వెళ్లారు.

వాకిలి దగ్గర ఓ అమ్మాయి కనిపిం చింది. ఈ మధ్యే ఓణీల నుండి చీర్లలోకి మారినట్టుంది. మెడలో సన్నటి బంగారు గొలుసు. పొడవాటి చేతులు, అలాగే వేళ్ళూనూ. జీప్‌నూ, పోలీస్ యూనిఫా మ్‌నూ చూశాక కళ్లల్లో కాస్త భయం కని పించింది. ఆమే మొదట ప్రశ్నించింది.

"ఎవరు కావాలి సార్... మీకు?"

"మోహన్‌ఇల్లు ఇదే కదూ...?"

"ఔను.. లోపలికి రండి ఇన్‌స్పెక్టర్!"

లోపలికి అడుగు పెడుతూ అడిగాడు.

"మీరు మోహన్ సిస్టరా?"

"ఔను..."

"ఇంట్లో అమ్మా, నాన్నా ఉన్నారా...?"

"నాకు అమ్మ లేదు... నాన్న మాత్రం ఉన్నారు. నాన్న ఇప్పుడు పెట్రోల్ బంక్‌లో ఉంటారు.. కూర్చోండి సార్..."

"పెట్రోల్ బంక్ మీ సొంతమేనా...?"

కూర్చున్నాక అడిగాడు ధ్యానేశ్వర్.

"ఔను"

"బంక్ ఎక్కడుంది...?"

"పలమనేరు రోడ్డులో... న్యూ తేజ కాలేజ్ ఎదురుగా..."

"సరే.. మోహన్ ఇంట్లో ఉన్నారా...?"

"అన్నయ్య ఊరెళ్లారు..."

"ఏ ఊరికి...?"

"తెలియదండీ..."

"ఎప్పుడెళ్ళారు...?"

"వారం అయిందండీ..."

"ఎందుకు ఊరెళ్లాడో నీకు తెలుసా?"

"తెలియదండీ, నాన్నను అడిగితే తెలు స్తుంది" అంటూనే "మా అన్నయ్యను గురించి ఎందుకు అడుగుతున్నారు ఇన్ స్పెక్టర్?" అందామె.

"మీకు 'దేవి' తెలుసా...?"

"ఏ 'దేవి'...? అన్నయ్య పనిచేసే కంపె నీలో టైపిస్ట్‌గా పని చేశారే, ఆవిడా?"

"ఆవిడే..."

"బాగా తెలుసు"

"ఎలా?"-

"అన్నయ్య దేవిని అప్పుడప్పుడు ఇంటికి తీసుకొచ్చేవాడు. కానీ దేవి పెళ్లయ్యాక ఇక్కడికి రావటం పూర్తిగా మానేసింది!"

"మీ బ్రదర్‌కూ దేవికీ మధ్య ఎలాంటి సంబంధం ఉండేదో చెప్పగలరా...?"

"సారీ ఇన్‌స్పెక్టర్! దీనికి సమాధానం చెప్పలేను. వాళ్ల మధ్య ఉన్నది ఫ్రెండ్ షిప్పా ప్రేమా అన్నది తెలియదు. దేవి తన పెళ్లి గురించి మా అన్నయ్య దగ్గర ప్రస్తావించినపుడు- ఇద్దరూ సంతోషపడ్డారే కానీ ఎవరూ బాధ పడ్లేదు"

"అంటే... వాళ్ల మధ్య ఉన్నది కేవలం ఫ్రెండ్‌షిప్పేనా?"

"నేను ఆ నిర్ణయానికి రాలేకపోతు న్నాను ఇన్‌స్పెక్టర్..."

"ఎందుకలా అనుకుంటున్నారు...?"

"ఇద్దరూ ఏ కారణం చేతనో 'పెళ్ళి చేసుకోకూడదు' అనుకున్నారులా ఉన్నారు... ఆ కారణం ఏమిటో వారినే అడగాలి"

"మీ నాన్నగారి పెట్రోల్ బంక్ ఎక్కడుందన్నారు?" కుర్చీలో నుండి లేస్తూ ధ్యానేశ్వర్ అడిగాడు.

"పలమనేరు రోడ్‌లో... తేజ కాలేజ్ ఎదురుగా 'అనూష పెట్రోలియం' అన్న పేరుతో ఒక పెట్రోల్ బంక్ ఉంది. నాన్నగారు అక్కడే ఉంటారు..."

"మీ నాన్న పేరేంటీ?"

"మాధవమూర్తి!"

"అనూష అన్నది?"

"నా పేరే"

"థాంక్యూ మిస్ అనూషా...! మేము మీ నాన్నగారిని కలవడానికి వెళుతున్నాం" అంటూ బయటకు వచ్చి జీప్ ఎక్కాడు ఎస్సై ధ్యానేశ్వర్. వెనుకే కైలాష్ కూడా జీప్ ఎక్కాక అది బయలుదేరింది.

జీప్ బయలుదేరేంతవరకూ తలుపు దగ్గర నిల్చున్న అనూష తర్వాత లోపలికి పరుగెత్తింది. లోపలి గదిలోని టెలిఫోన్ దగ్గరికి వెళ్ళి గబగబ నెంబర్లు నొక్కింది.

★ ★ ★

జీప్ పలమనేరు రోడ్డువైపు వేగంగా దూసుకెళ్ళసాగింది.

ధ్యానేశ్వర్ వెనక్కు తిరిగి చూసి కైలాష్‌ను అడిగాడు.

"అనూష చెప్పినదాన్ని బట్టి మీరు ఏమనుకుంటున్నారు కైలాష్...?"

కైలాష్ నవ్వి అన్నాడు.

"అనుకునేందుకు ఏమీ లేదు ఇన్‌స్పెక్టర్ గారూ... నేను ఒక నిర్ణయానికి వచ్చేశాను... వాళ్ళిద్దరూ ఒక పథకం ప్రకారం ఊరు వదిలి పారిపోయారు... బయట ఊరు వెళుతున్న మోహన్, ఏ ఊరు వెళుతున్నదీ చెప్పకుండానే వెళతాడా...? ఆ అమ్మాయి ఏదో దాస్తోంది సార్"

"దేవి, మోహన్‌లు ఒకరినొకరు ఇష్టపడట్టు మీకు పెళ్ళికి ముందే తెలుసా?"

"ఒక్క పర్సెంట్ కూడా తెలియదు. తెలిస్తే దేవిమెడలో తాళి కట్టి ఉండేవాణ్ణే కాను. దేవి మెళ్ళో తాళి కట్టమని చెప్పేవాణ్ణి"

"మీకు పెళ్లై సంవత్సరం పైగా అయిందన్నారుగా. ఈ సంవత్సర కాలంలో ఆ మోహన్‌ను మీరెప్పుడూ చూళ్ళేదా?"

"నేను ఊళ్ళో ఉన్నప్పుడు వాడు రాడు కదా ఇన్‌స్పెక్టర్. నేను బయటి ఊరు వెళ్ళినప్పుడే వస్తున్నాడు. వాడు అలా రావటం మా ఇంటిపని మనిషి చూసింది. ఎదురింటి మీనాక్షి ఆంటీ చూసింది..."

జీప్ 'అనూషా పెట్రోలియం' ముందు ఆగింది. ధ్యానేశ్వర్, కైలాష్ బంక్‌లో బిల్లులను చూసుకుంటున్న పెద్దాయన వైపు దారి తీశారు.

తల పైకెత్తి చూశాడు ఆయన.

"మీరేనా మాధవమూర్తి అంటే...?"

"ఔను నేనే..." అంటూ ఇన్‌స్పెక్టర్‌ను చూసి నిలబడ్డాడు ఆయన.

"కూర్చోండి ఇన్‌స్పెక్టర్... ఇప్పుడే మా అమ్మాయి ఫోన్‌చేసి చెప్పింది. మోహన్ గురించి ఎందుకు విచారణ చేస్తున్నారో తెలుసుకోవచ్చా.."

ధ్యానేశ్వర్, కైలాష్ లిద్దరూ చెరో కుర్చీలో కూర్చున్నారు.

ధ్యానేశ్వర్ అడిగాడు- "మోహన్ ఏ ఊరికి వెళ్ళాడో కాస్త చెప్పగలరా?"

"షిమోగా..."

"కర్ణాటక స్టేట్...?"

"ఔను..."

"ఎందుకు...?"

"వాడేదో ఒక బిజినెస్ ప్రారంభించబోతున్నట్టు చెప్పాడు... దానికి అవసరమైన రా మెటీరియల్ అక్కడ దొరుకుతుందట! అందుకనీ అక్కడున్న ఒక ఫ్రెండ్‌ను కల



వడానికి వెళ్ళాడు"

"ఎప్పుడెళ్ళాడు...? "

"గత ఆదివారం రాత్రి..."

"మీ అబ్బాయి షిమోగా వెళ్ళి ఈరోజుకి ఐదురోజులు కావస్తోంది. అతని దగ్గర నుండి ఏమైనా ఉత్తరాలొచ్చాయా? "

"లేదు..."

"పోనీ ఫోన్ చేశాడా...? "

"లేదు..."

"షిమోగాలో ఉన్న ఫ్రెండ్ పేరూ, చిరునామా చెప్పగలరా? " ధ్యానేశ్వర్ అడగ్గానే మాధవమూర్తి నసుగుతూ అన్నాడు.

"ఇన్‌స్పెక్టర్... ఎందుకు విచారణ చేస్తున్నారో నేను తెలుసుకోవచ్చా..."

"ష్యూర్... ష్యూర్.." అంటూ తల ఊపిన ధ్యానేశ్వర్ కైలాష్‌ను చూపిస్తూ అన్నాడు.

"ఇతను మిస్టర్ కైలాష్, దేవి హజ్‌బెండ్..." అంటూ మొదలుపెట్టి దేవి కనిపించకుండాపోయిన విషయం వరకూ చెప్పి ముగించాడు.

మాధవమూర్తి మొహం నల్లబడింది. కళ్ళద్దాలు తీసి బల్లపై పెట్టి కోపంగా అన్నాడు.

"సో మా అబ్బాయి ఇతడి వైఫ్‌ని తీసుకుని పారిపోయినట్టు చెబుతున్నారా ఇన్‌స్పెక్టర్...? "

"ఇదే తీర్మానం కాదు... ఒక అనుమానం మాత్రమే..."

"మా అబ్బాయి అటువంటి వాడుకాడు ఇన్‌స్పెక్టర్. వాడు షిమోగాలోనే ఉన్నాడు. వాడు ప్రారంభించబోయే బిజినెస్ బయటివాళ్ళకు తెలియకూడదనే నెపంతోనే ఆఫీసులో సెలవుకు కారణం- 'పర్సనల్' రాశాడట. మీరీ విషయం- షిమోగాలోని వాడి ఫ్రెండ్ పేరు సి. దాసప్ప మినరల్స్ డీలర్... ఫోన్ నెంబర్ కావాలంటే నోట్ చేసుకోండి. వద్దు... మీకు ఆ శ్రమ కూడా వద్దు... నేనే షిమోగాకు లైట్నింగ్ కాల్ బుక్ చేస్తాను.. మీరే మోహన్‌తో మాట్లాడండి.." మాధవమూర్తి గబగబ బల్లపైనున్న టెలిఫోన్‌ను దగ్గరకు లాక్కొని, కాల్ సర్వీసుకు డయల్ చేసి నెంబర్ చెప్పి బుక్ చెయ్యగా ఒక్క నిమిషంలోనే షిమోగా నెంబర్ దొరికింది.

"మీరే మాట్లాడండి ఇన్‌స్పెక్టర్... ఫ్రెండ్ పేరు దాసప్ప. మీరు ఇన్‌స్పెక్టరని చెప్పకండి...! మోహన్ స్నేహితుణ్ణని చెప్పి మాట్లాడండి..."

రిసీవర్ అందుకున్నాడు ధ్యానేశ్వర్.

## చతురోక్తులు



సుప్రసిద్ధ బెంగాలీ రచయిత శరత్ చంద్ర ఛటర్జీ స్వాతంత్ర్యోద్యమంలో రాజీలేని పోరాటపంథాను సమర్థించాడు. వివిధ సందర్భాలలో ఆయన సంధించిన చమత్కార బాణాలు కొన్ని..

### దేశ ద్రోహులా?

ఓసారి కాంగ్రెస్ సమావేశంలో వేదికపైన సుభాష్‌చంద్రబోస్, గాంధీజీ, ఇతర నాయకులు ఉన్నారు. సత్యాగ్రహం గురించి వివరిస్తూ.. సాయుధ బాటలో పోరాడుతున్న ఆనాటి యువ విప్లవకారులను గాంధీజీ దేశద్రోహులన్నారు. ఈ కటువైన వ్యాఖ్యలను జీర్ణించుకోలేక పలువురు లోలోపలే బాధపడ్డారు. ఆ సమయంలో శరత్‌చంద్ర లేచి, 'బాపూజీ... మీకు భిన్నంగా పోతున్న విప్లవకారుల్ని మీరు దేశద్రోహులని పిలిస్తే, తమకు భిన్నంగా పోతున్న మిమ్మల్ని వారు సైతం అదేమాట .." అనబోతుండగానే బాపూ తన మాటల్ని వెనక్కు తీసుకుంటున్నట్లు ప్రకటించారు.

"హలో!"

"హలో...! దాసప్ప హియర్" అటు నుండి దాసప్ప గొంతు వినిపించింది.

"మిస్టర్ దాసప్పా... నేను మోహన్ ఫ్రెండ్‌ను మాట్లాడుతున్నాను, మోహన్ అక్కడుంటే కాస్త మాట్లాడమనండి..."

"ఏ మోహన్..."

"చిత్తూరు మోహన్..."

"అతనిక్కడ లేడే...!"

"గత ఆదివారం షిమోగాకు బయలుదేరి వచ్చాడే...?"

"సారీ...! ఇక్కడకు రాలేదు"

"వస్తున్నట్టు తెలుపుతూ మీకేమైనా ఉత్తరం రాశాడా?"

"ఉత్తరం రాలేదే...!"

"సారీ ఫర్ ది డిస్టబెన్స్... నేనతడి ఇంట్లో కనుక్కుంటాలే" రిసీవర్ని క్రెడిల్ చేసి ధ్యానేశ్వర్- నవ్వుతూ మాధవమూర్తిని చూశాడు.

"మీ అబ్బాయి మోహన్ షిమోగాకు వెళ్ళలేదు సార్. మోహన్ దగ్గర ఏదో తప్పు ఉంది. అతడు ఎక్కడి నుండైనా మీతో మాట్లాడితే మీరు వెంటనే మాకు తెలియజేయండి"

నల్లబడ్డ ముఖాన్ని వాళ్ళకు చూపించ లేక తల ఆడించాడు మాధవమూర్తి.

★ ★ ★

ఇంట్లోకి అడుగుపెట్టిన కైలాష్‌ను ఆతృతగా చూశారు శివశంకరయ్య, రుక్మిణమ్మ.

"ఏమైంది అల్లుడూ...?"

"అంతా స్పష్టంగా తేలింది మామగారూ. ఆ మోహన్ షిమోగాకు బిజినెస్ విషయంగా వెళుతున్నట్టు ఇంట్లో ఒక్క అబద్ధం చెప్పి, దేవిని తీసుకుని ఎక్కడికో పారిపోయాడు. ఇన్‌స్పెక్టరే స్వయంగా షిమోగాకు ఫోన్ చేసి మాట్లాడాడు"

"నాకు నమ్మబుద్ధి కావడం లేదండీ... మన దేవి అలా దిగజారిపోయి మరొకడితో..." కమ్ముకున్న కన్నీళ్ళ మధ్య గొంతు పూడుకుపోయింది రుక్మిణమ్మకు.

ఇంతలో బయటినుండి "సార్ టెలిగ్రామ్" అన్న గొంతు వినిపించింది. శివశంకరయ్య గబగబ బయటికి వెళ్ళాడు.

"సార్ శివశంకరయ్య ఎవరండీ...?"

"నేనే!"

సంతకాన్ని తీసుకుని, టెలిగ్రామ్ కాగితాన్ని ఇచ్చాడు మెసెంజర్.

చెయ్యి వణికినట్టు అనిపించింది శివశంకరయ్యకు. అందులో ఏముందో చదివాక గుండె ఆగిపోయినంత పనైంది ఆయనకు.

"ఏం మామయ్యా... ఎవరి దగ్గరి నుండి టెలిగ్రామ్...?" కైలాష్ అడిగాడు.

"అ... అల్లుడూ..."

"చెప్పండి.. టెలిగ్రామ్ ఎవరిచ్చారు?"

"దేవి" చెప్పాడాయన.




కైలాష్ షాక్ తిన్నాడు ఆ మాటకు. చేతిలో టెలిగ్రామ్ పట్టుకున్న శివశంకరయ్య దగ్గరకి వెళ్ళాడు.

"ఏమిటి మీరంటున్నది...? దేవి టెలిగ్రామ్ ఇచ్చిందా? ఇటివ్వండి చూద్దాం.." అంటూ ఆయన టెలిగ్రామ్‌ను తన చేతికి ఇవ్వకముందే తనే వేగంగా లాక్కున్నాడు కైలాష్. అక్షరాల వెంట అతడి చూపులు పరిగెత్తాయి.

"I AM SAFE. NEED NOT WORRY







## కొత్తగాలి...

**అమ్మాయినెప్పుడైనా చూడొచ్చు**
**అడిగినంత కట్నమిస్తారా చెప్పండి**
**లాంఛనాలు మామూలే**
**అంచనాకు మించాయనొద్దు**

– కన్నోజు లక్ష్మీకాంతం,
ఫలక్‌నుమా, హైదరాబాద్

- DEVI -" పూర్తిగా చదివాక కోపం నషాళానికి అంటగా వాళ్లిద్దరి వైపూ కోపంగా చూస్తూ అన్నాడు కైలాష్.

"లేచిపోయిన మీ అమ్మాయి వాడితో క్షేమంగా ఉందట. ఎవరూ కంగారు పడాల్సిన పనిలేదని టెలిగ్రామ్ ఇచ్చింది. ఒంట్లో ఎంత మదమెక్కి ఉంటే, ఎక్కడో కులుకుతూ టెలిగ్రామ్ ఇస్తుంది..."

శివశంకరయ్య గుటక మింగుతూ కైలాష్ కేసి చూశాడు.

"అల్లుడూ... టెలిగ్రామ్ ఎక్కడి నుండి వచ్చిందో కాస్త చూసి చెప్పండి...."

కైలాష్ కోపంతో టెలిగ్రామ్‌లోని అక్షరాలను చదివి వ్యంగ్యంగా అన్నాడు.

"ఎంతో సుఖంగా ఉంటుందని మంచి ఊరికే లేచిపోయిందిలే! బెంగుళూరు నుండి ఉదయం 8 గంటలకు టెలిగ్రామ్ ఇచ్చింది. ఆ సమయానికిగానీ మీరూ, నేనూ గుర్తుకు రాలేదు కాబోలు..."

కైలాష్ మాటలు ఈటెలతో పొడుస్తుండగా దేవి తల్లి రుక్మిణమ్మ - గోడకు జారగిలపడి పొంగుతున్న కన్నీటిని ఆపుకోవడానికి ప్రయత్నించసాగింది.

శివశంకరయ్య మెల్లగా నోరు విప్పాడు.

"అల్లుడూ...!"

"ఊc..." అంటూ కైలాష్ ఆ తంతిని షర్టు ప్యాకెట్‌లో మడిచి పెట్టుకున్నాడు.

"ఇప్పుడు.... ఏం చేద్దాం...?"

"ఆ విషయం మీరు చెప్పాలి మామయ్యా! నేను క్షేమంగా ఉన్నాను, నా గురించి దిగులుపడకండి - అని మీ అమ్మాయి టెలిగ్రామ్ ద్వారా మెసేజు ఇచ్చిందిగా? ! ఇకపై ఆ మహాతల్లి గురించి మీరూ, నేనూ దిగులుపడ్డం అనవసరం... దానికి నచ్చిన వాడితో అది లేచిపోయాక మనమేం చేయగలం..."

"లేదు అల్లుడూ దేవి ఇప్పుడు బెంగుళూరులో ఉన్నట్టు కచ్చితంగా తేలిపోయింది. దీని ద్వారా అడ్రస్ తెలుసుకుని"

"ఏం చేస్తారు...? కూతురూ, కొత్త అల్లుడికీ తాంబూలాలిచ్చి విందు భోజనానికి పిలుద్దామనుకుంటున్నారా?"

"అల్లుడూ... మీరు ఎన్నైనా మాట్లాడండి... అమ్మాయి దేవి గురించి నేను నీచంగా ఆలోచించలేకపోతున్నాను..."

"నేను ఒక్కో మెట్టూ... ఒక్కో కారణం - కాంక్రీట్ ప్రూఫ్‌లా చెబుతున్నాను. మీరేమో ఇప్పటికీ మా అమ్మాయి మంచిది, ఉత్తమురాలు, పతివ్రత అంటున్నారు...సరే... రండి.. పోలీస్ స్టేషన్‌కు వెళదాం..."

"ఎందుకూ?"

"ఈ టెలిగ్రామ్‌ను ఇన్‌స్పెక్టర్‌కు ఇద్దాం. ఆయన దీని ఆధారంగా వెంటనే చర్యలు తీసుకుంటారు. బెంగుళూరులో ఈ టెలిగ్రామ్‌ను ఏ టెలిగ్రాఫిక్ ఆఫీసు నుండి ఇచ్చారో కనుక్కుంటారు. టెలిగ్రామ్ ఇచ్చిన దేవి- ఏదో ఒక ఫ్రం అడ్రస్ ఇచ్చే ఉంటుంది. దాని ఆధారంగా దేవి ఎక్కడుందో కనిపెట్టవచ్చు.. వీలైతే నేనే ఆ అడ్రస్‌కు వెళ్లి మీ అమ్మాయికీ, కొత్త అల్లుడికీ హారతిచ్చి పిలుచుకొస్తాను. రండి ఇప్పుడు స్టేషన్‌కెళదాం.."

ఆటోలో ఇద్దరూ స్టేషన్‌కెళ్లారు.

ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్- లుంగీ బనియన్ వేసుకున్న ఒక వ్యక్తిని ఏదో విచారణ జరు

పుతున్నాడు. వాణ్ణి పక్కకుతోసి వీళ్ల వైపుకు తిరిగాడు.

"రండి. కైలాష్, ఏంటీ విషయం? "

"దేవి టెలిగ్రామ్ ఇచ్చింది సార్"

"ఈజిట్... ఏ ఊరి నుండి...? "

"బెంగుళూరు నుండి..." అంటూ టెలిగ్రామ్‌ను తీసి చూపించాడు. దాన్ని చదివాక ఇన్‌స్పెక్టర్ అన్నాడు.

"టెలిగ్రామ్ ఎన్ని గంటలకు వచ్చింది? "

"ఇందాకే పదిహేను నిమిషాల క్రితం"

"ఇప్పుడు వాళ్లు బెంగుళూరులో ఉన్నారు, అంతేకదా..."

"యస్సార్... వాళ్లు బెంగుళూరులో ఎక్కడున్నారో తెలియాలి..."

"తెలుసుకుని ఏం చెయ్యబోతున్నారు? "

"దేవి ఎవరితో, ఎక్కడ ఉందో తెలియాలి... అది ఆ మోహన్‌తో అక్రమ సంబంధం పెట్టుకున్న విషయం నాకు పిల్లనిచ్చిన మామగారికీ, అత్తయ్యకూ నిరూపించాలి. అప్పుడే వాళ్లు నమ్మగలరు ఇన్‌స్పెక్టర్..."

ఇన్‌స్పెక్టర్ చెయ్యిచాపి టెలిఫోన్ రిసీవర్‌ను అందుకొని చేతిలోని టెలిగ్రామ్‌ను మరోసారి జాగ్రత్తగా గమనించాడు. ఒక నెంబరుకు డయల్ చేసి టెలిగ్రామ్‌ను పట్టుకుని అలాగే వెనక్కు వాలాడు.

"హలో! టెలిగ్రాఫిక్ ఆఫీసేనా...? "

"యస్...!"

"ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్‌ను మాట్లాడుతున్నా. మీ డిపార్టుమెంట్ నుండి ఒక ఇన్ఫర్మేషన్ కావాలి "

"చెప్పండి సార్..."

"పదిహేను నిమిషాల క్రితం బెంగుళూరు నుండి చిత్తూరుకు శివశంకరయ్య పేరుతో ఒక టెలిగ్రామ్ వచ్చింది. టెలిగ్రామ్ ఇచ్చింది దేవి అన్న మహిళ. ఆ స్త్రీ పూర్తి చిరునామా కావాలి..."

"సార్, ఎవరితోనైనా ఆ టెలిగ్రామ్‌ను ఇచ్చి పంపండి. అందులో ఉన్న టెలిగ్రాఫిక్ కోడ్ నెంబర్ సాయంతో బెంగుళూరులో ఏ ఏరియాలోని టెలిగ్రాఫిక్ ఆఫీసు నుండి ఆ టెలిగ్రామ్‌ను ఇచ్చారో సులభంగా కనిపెట్టవచ్చు. సార్, దయచేసి దాన్ని ఎవరితోనైనా పంపగలరా? "

"ఓకే" అంటూ రిసీవర్‌ను క్రెడిల్ చేసి "మిస్టర్ కైలాష్" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"చెప్పండి సార్..."

"ఈ టెలిగ్రామ్ తీసుకుని టెలిగ్రాఫిక్ ఆఫీస్‌కు వెళితే అతను బెంగుళూరులోని దేవి అడ్రస్ ఇస్తాడు"

"థాంక్యూ సార్! అడ్రస్ అందిన వెంటనే మేము బెంగుళూరు వెళతాం"

ఇన్‌స్పెక్టర్ నుండి టెలిగ్రామ్‌ను వెనక్కు తీసుకుని స్టేషన్ నుండి బయటికి వచ్చారు ఇద్దరూ.

ఆటోలో టెలిగ్రాఫిక్ ఆఫీసు చేరుకున్నారు. ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్ పేరు చెప్పి అక్కడి అధికారికి టెలిగ్రామ్‌ను ఇచ్చాడు కైలాష్.

అతడు దాన్ని అందుకొని ఓసారి పరిశీలించి- "ప్రభాకర్" అని గట్టిగా పిలిచాడు.

"సార్" అంటూ ఆ పేరుగల వ్యక్తి గది లోపలి నుండి వస్తూ కైలాష్‌ను, శివశంకరయ్యనూ ఓ కంట గమనించాడు.

"ఈ టెలిగ్రాఫిక్ కోడ్ నెంబర్‌ను నోట్ చేసుకోండి... ఆ కోడ్ నెంబర్‌కు రిప్లై టెలి

## కొత్తగాలి...

**నదంటే గోదారే**
**నవ్వంటే వెన్నెలే**
**పువ్వంటే గులాబే**
**ప్రేమంటే నువ్వే.. నువ్వే..**

– శ్రీనివాస్ కాళి,
బిచ్‌కుందా, నిజామాబాద్ జిల్లా



గ్రామ్ ఇచ్చి- సెండర్ అడ్రస్ తీసుకోండి... పోలీస్ వ్యవహారం. కొంచెం తొందరగా తీసుకోండి.. సార్! రిప్లై టెలిగ్రామ్‌కు అయ్యే చార్జ్ ఆ కౌంటర్‌లో కట్టేసి రెండు గంటల తర్వాత రండి సెండర్ అడ్రస్ రెడీగా ఉంటుంది"

"థాంక్యూ సార్!"

కౌంటర్ దగ్గర డబ్బును చెల్లించి, అక్కడున్న హాల్లో బెంచీలపై కూర్చున్నారిద్దరూ. ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా గోడలకు అతికించిన పోస్టర్లను చదువుతూ కూర్చున్నారు. ఒక అమ్మాయి ఏడుస్తూ వచ్చి తన తండ్రి చనిపోయిన విషయాన్ని ఎవరికో టెలిగ్రామ్ ఇచ్చిన వైనాన్ని ఇద్దరూ మౌనంగా చూశారు. రెండుసార్లు సిగరెట్ తాగడానికి లేచివెళ్ళాడు కైలాష్. శివశంకరయ్య మాత్రం అలాగే కూర్చున్నాడు.. హృదయంలో సుడిగుండాల సుళ్ళు..

సరిగ్గా రెండు గంటలు గడిచాక ఆ ఆఫీస్ అటెండర్ కైలాష్ దగ్గరికొచ్చాడు.

"సార్ పిలుస్తున్నారు"

ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

"మీరడిగిన సెండర్ అడ్రస్ వచ్చింది తీసుకోండి..."

కాగితాన్ని అందుకొని చూశాడు కైలాష్.

"మిసెస్ దేవీ మోహన్ C/o హోటల్ కింగ్స్‌వే, 7-A మెజెస్టిక్ సర్కిల్, బెంగళూరు".

థ్యాంక్స్ చెప్పి ఇద్దరూ ఆ ఆఫీసు నుండి బయటికొచ్చారు. టెలిగ్రాఫిక్ ఆఫీస్ కాంపౌండ్ గేట్ దాటేంతవరకూ మౌనం వహించిన కైలాష్, రోడ్డు మీదికి వచ్చాక అన్నాడు-

"ఇప్పుడేమంటారు మామయ్యా...? మీ అమ్మాయి నా పేరును తీసిపారేసి ఆ మోహన్ పేరును తగిలించుకుంది..."

"నమ్మబుద్ధి కావడంలేదు అల్లుడూ..."

"బెంగుళూరు వెళ్ళి మీ అమ్మాయి దాంపత్యాన్ని చూసి వద్దామా మామయ్యా...?" కైలాష్ వ్యంగ్యంగా అన్న ఆ మాటలకు శివశంకరయ్య ముఖం నల్లబడింది.

"ఏంటి మామయ్యా... మాట్లాడరు?"

"ఆ చిరునామాలో ఉన్న హోటల్‌కు ఫోన్‌చేసి మాట్లాడుదామా?"

"వద్దు, వెళ్ళి చూసొద్దాం! ఇప్పుడు బయలుదేరితే రాత్రి పది గంటలకల్లా బెంగుళూరు చేరుకోవచ్చు.. మీ కూతుర్నీ, రెండో అల్లుణ్ణీ చూసి ఆశీర్వదించి రాత్రి మళ్ళీ బయలుదేరితే రేపు ఉదయం ఎనిమిదింటికల్లా వచ్చేయవచ్చు.."

"మీరు మాత్రం వెళ్ళి చూసిరండి అల్లుడూ"

"నేను చూసివచ్చి చెప్పినా మీరు నమ్మరు... మీరూ వచ్చి చూడ్డమే మంచిది. నేను ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడి, బస్‌స్టాండులో ఎదురుచూస్తుంటా. మీరు అత్తయ్యతో ఈ విషయాన్ని చెప్పి అక్కడికి వచ్చేయండి"

కళ్ళల్లో నీరు ఉబుకుతుంటే తల ఊపాడు శివశంకరయ్య.

★ ★ ★

బస్సు బెంగుళూరు బస్‌స్టాండ్ చేరుకున్నప్పుడు సమయం రాత్రి పదిగంటలు.

ఆ పెద్ద హోటల్ పోర్టికోమెట్లెక్కి రిసెప్షన్ కౌంటర్ దగ్గరికి వెళ్ళారిద్దరూ.

లెడ్జర్‌లో ఏదో రాసుకుంటున్న ఆ యువకుడు కైలాష్‌ను చూసి- "యస్" అంటూ తలపైకెత్తాడు.

"ఈ హోటల్లో మిస్టర్ మోహన్, మిసెస్ దేవీ మోహన్ ఉన్నారా...?" రిసెప్షనిస్టు చప్పున వెనక్కు తిరిగి టెలిఫోన్ ఆపరేటర్‌తో ఏదో కన్నడంలో సంభాషించి మళ్ళీ కైలాష్ వైపుకు తిరిగాడు.

"మీ పేరు కైలాషా...?"

కైలాష్ ఔను అన్నాడు ఆశ్చర్యపోతూ.



"మీరు వెదుక్కుంటూ వచ్చిన దేవి - మోహన్‌లిద్దరూ ఉదయం ఎనిమిదిన్నర గంటలకే గది ఖాళీచేసి వెళ్ళిపోయారు"

శివశంకరయ్య, కైలాష్ ఆశ్చర్యంగా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

కైలాష్ తన ఆశ్చర్యాన్ని కప్పి పుచ్చుకుంటూ "ఎక్స్‌క్యూజ్ మి. నా పేరు మీకెలా తెలిసింది?" అడిగాడు.

"చిత్తూరు నుండి ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్ గంట ముందు ఫోన్ చేశారు. దేవి - మోహన్‌ల గురించి ఆయనా ఎంక్వయిరీ చేశాడు. దెన్... మిస్టర్ కైలాష్ అని ఒక తనూ, మరో పెద్దాయనా ఈ హోటల్‌కు వస్తున్నట్టూ వస్తే వెంటనే చిత్తూరుకు ఫోన్‌చేసి తనతో మాట్లాడమని చెప్పారు"

"ఫోన్‌లో మాట్లాడమని చెప్పారా.?"

"ఔను... ఇదిగోండి ఆయన టెలిఫోన్ నెంబర్.. డయల్ చెయ్యమంటారా?"

"ఊc..."

"ఒక నిమిషం అలా సోఫాలో కూర్చోండి... లైన్లోకి వచ్చాక పిలుస్తాను" అనగానే ఇద్దరూ అక్కడున్న సోఫాలో కూర్చున్నారు.

ఐదు నిమిషాలయ్యాక రిసెప్షన్ కౌంటర్‌లోని యువకుడు పిలిచాడు- "మిస్టర్ కైలాష్, ప్లీజ్ కమ్..."

కైలాష్ లేచి వెళ్ళాడు. రిసీవర్ అందుకుని "హల్లో" అన్నాడు.

"మిస్టర్ కైలాష్?"

"సార్- చెప్పండి"

"వెంటనే బయలుదేరి తిరుపతి రండి"

"ఏం సార్... ఏమిటీ విషయం?"

"దేవి దొరికింది..."

ఆ మాటకు ఉక్కిరి బిక్కిరై ఆతృతగా అడిగాడు కైలాష్, "రియల్లీ..."

"యస్... మిస్టర్ కైలాష్... దేవి దొరికింది! కానీ దురదృష్టవశాత్తు.."

"ఆc దురదృష్టవశాత్తు..."

"శవంగా దొరికింది...!"




రిసీవర్ని పట్టుకున్న కైలాష్ చెయ్యి వణికింది. గుండె ఆగి మళ్ళీ కొట్టుకోసాగింది. గొంతులోని మాట గొంతులోనే ఆగిపోయింది. ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్ గొంతు పెంచి గట్టిగా అన్నాడు.

"మీరు బెంగుళూరు నుండి నేరుగా తిరుపతి వచ్చేయండి"

"ఇన్‌స్పెక్టర్ నాకేమీ అర్థంకావటంలేదు. కన్‌ఫ్యూజింగ్‌గా ఉంది. దేవి-మోహన్‌లు ఈ ఉదయమే ఎనిమిదిన్నర గంటలకు హోటల్‌గది ఖాళీచేశారుట!"

"ఆ మోహన్‌తో ఉన్నది మీ దేవి అయి ఉండటానికి వీల్లేదు కైలాష్. దేవి చనిపోయి నాలుగు రోజులై ఉండొచ్చని రిపోర్ట్ చెబుతోంది. మీరు వెంటనే తిరుపతి బయలుదేరండి. నేరుగా రుయా ఆసుపత్రికి వచ్చేయండి. నేనూ మీ అత్తయ్యా అక్కడే వెయిట్ చేస్తుంటాం"

ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్ రిసీవర్ పెట్టేశాక కైలాష్ తనూ రిసీవర్ని పెట్టేసి తననే చూస్తున్న శివశంకరయ్యతో స్థూలంగా అన్ని విషయాలూ చెప్పాడు. ఆ మాట వింటూనే స్తంభించిపోయాడాయన.

ఐదు నిమిషాలయ్యాక "మామయ్యా" అంటూ పిలిచాడు కైలాష్.

"ఏంటి అల్లుడూ...?" కన్నీళ్లు తుడుచుకుంటూ అన్నాడు.

"దేవి ఫొటో తీసుకొచ్చాంగా... అది మీ దగ్గరే ఉంది కదూ?"

"ఔను..."

"దాన్నిలా ఇవ్వండి..."

శివశంకరయ్య తన జేబులో ఉన్న కవర్‌లో నుండి దేవి ఫొటోను తీసిచ్చాడు. దాన్ని అందుకొని రిసెప్షన్ కౌంటర్‌లోని ఆ యువకుణ్ణి అడిగాడు.

"ఎక్స్‌క్యూజ్‌మీ... ఇక్కడ దిగిన దేవి, ఈ ఫొటోలోని అమ్మాయేనా కాస్త చూసి చెబుతారా?"

యువకుడు ఆ ఫొటోను చూశాడు.

"ఈ అమ్మాయి కాదు సార్..."

"కచ్చితంగా తెలుసా...?"

"కచ్చితంగా చెప్పగలను..."

"ఇక్కడున్న ఆ యువతి ఎలా ఉంటుందో చెప్పగలరా? ఇబ్బంది పెడుతున్నానని అనుకోకండి. ఇదొక విధంగా పోలీస్ ఎంక్వయిరీ లాంటిది"

ఆ యువకుడు మళ్ళీ ఫొటోను చూసి "ఇంత అందం ఆ అమ్మాయిలో లేదు సార్... కాస్త నలుపే. మోతాదు మించిన మేకప్... నిన్న ఉదయం 9 గంటల సమయంలో ఇక్కడికొచ్చి రూమ్ బుక్ చేసుకున్నారు. ఈ రోజు ఉదయం ఎనిమిది, ఎనిమిదిన్నర ప్రాంతంలో ఖాళీ చేసేశారు"

"ఆమెతో వచ్చిన వ్యక్తి ఎలాఉన్నాడు?"

"ఎర్రగా... కర్లింగ్ హేర్‌తో చూడ్డానికి బాగానే ఉన్నాడు. కానీ అతడు ఎక్కువగా రూమ్‌ను వదిలి బయటకు రాలేదు. ఆ యువతి మాత్రం ఈ రోజు ఉదయం ఎనిమిది గంటలకు బయటకు వెళ్ళి ఎనిమిదింపావుకంతా తిరిగొచ్చి- 'రూమ్ ఖాళీ చెయ్యబోతున్నాం బిల్స్ రెడీ చెయ్యండ'ని చెప్పి రూమ్‌కు వెళ్ళిపోయింది. సరిగ్గా ఎనిమిదిన్నరకు లగేజ్‌తో ఇద్దరూ బయటకు వచ్చారు. బిల్లు ఇచ్చాం. డబ్బు పేచేసి వెళ్ళిపోయారు..."

"రిజిస్టర్‌లో ఏ ఊరికి వెళుతున్నట్టు రాశారు?"

"చెన్నై..."

★ ★ ★

ఆటోవాడికి డబ్బిచ్చి రుయా ఆసుపత్రి ముందు దిగిన కైలాష్, శివశంకరయ్యలు వేగంగా మార్చురీవైపు నడిచారు.

మార్చురీ గది బయట ఒక పోలీస్ జీప్, ఇద్దరు ఖాకీ యూనిఫామ్ ధరించిన పోలీసులూ కనిపించారు. కైలాష్ ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్‌ను సమీపించాడు.

గది బయట పొడవాటి బెంచ్‌పై కూర్చుని చీరకొంగును నోట్లో కుక్కుకొని ఏడుస్తున్న రుక్మిణమ్మ- భర్తని చూసి "ఏమండీ... మ...న...దే...వి... దేవి" అంటూ పరుగెత్తుకొచ్చింది.

ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్ మెల్లగా అన్నాడు, "చూడండమ్మా... ఇలా ఏడుస్తూ కూర్చునేలా ఉంటే అలా వరండావైపు వెళ్ళిపోండి... ఇన్వెస్టిగేషన్ కోసం క్రైం బ్రాంచ్ అధికారులు వస్తున్నారు. మీరిలా ఏడుస్తుంటే వాళ్ళకు ఇబ్బంది.."

రుక్మిణమ్మ పైటకొంగును నోటికి అడ్డం పెట్టుకొని రోదిస్తూ పక్కకు తప్పుకుంది. అదురుతున్న గుండెలతో, కన్నీటితో ఇన్‌స్పెక్టర్ వెనుకనే మార్చురీ గదిలోకి అడుగుపెట్టాడు శివశంకరయ్య.

ఆ గదిలో- ఒక పెద్ద చెక్కపెట్టె ఉంది. లోపలికి వచ్చిన కానిస్టేబుల్ పెట్టె మూత

## కొత్తగాలి...

**మ్యారేజి**
**విభిన్న భావ ప్రవాహాలను**
**కలిపే బ్యారేజి**

– హరితశ్రీ, గుంటూరు

తీసి గోడపక్కగా పెట్టాడు. శివశంకరయ్య, కైలాష్‌లిద్దరూ వెళ్ళి తొంగిచూశారు.

దేవి ఎంతగానో ఇష్టపడి కట్టుకునే- తెల్లని వృత్తాలతో ఉన్న ఆ వంగపువ్వు రంగు చీర కళ్ళకు దర్శనమివ్వగానే శివశంకరయ్య అదిరిపడ్డాడు.

దేవి దేహం పెట్టె లోపల వెల్లకిలా ఉంది. ముఖమంతా ఉబ్బిపోయి గుర్తుపట్టడానికి వీల్లేనంత ఘోరంగా ఉంది. ముక్కు ఉన్నచోట ఒక రంధ్రం కనిపించింది. పండ్ల వరుస కిందికి సాగి ఉన్నది. దుర్వాసన రాకుండా ఫార్మాలిన్ వేసినట్టుంది-

అది గాలిలో తేలుతూ వచ్చి ముక్కుపుటాలకు సోకింది.

"దేవీ...!" కైలాష్ కళ్ల నుండి నీరు కారుతుండగా పెదాలు వణికాయి. శివశంకరయ్య పిచ్చివాడిలా కూతురి ముఖాన్నే చూస్తూండిపోయాడు.

ఇన్‌స్పెక్టర్ కైలాష్ భుజంపై తట్టాడు.

"రండి, బయటికి వెళదాం..."

కైలాష్ కన్నీళ్ళమధ్య అడిగాడు " దేవిని ఎవరు సార్... ఇ... ఇలా...? "

"ఇక మీదటే కనిపెట్టాలి..."

"డెడ్‌బాడీ... ఎక్కడ దొరికింది సార్"

"స్కై ఈగిల్ లారీ ట్రాన్స్‌పోర్టు ఆఫీసు నుండి తిరుపతి టూ టౌన్ పోలీస్‌స్టేషన్‌కు ఒక ఫోన్‌కాల్ వచ్చింది. వాళ్ళకు వచ్చిన ఒక పార్శెల్లో ఏదో దుర్వాసన వస్తున్నట్టు చెప్పారు. పోలీసులు వెళ్ళి పెట్టెను ఓపెన్ చేసి చూడగా, లోపల డెడ్‌బాడీ ఉంది... పార్శిల్ బుక్ చేసినవాళ్ళు, ఇచ్చిన ఫ్రం అడ్రస్‌కు వెళ్లిచూస్తే అది ఒక బోగస్ అడ్రస్. పెట్టెమీద చుట్టబడి ఉన్న గోనెసంచెను తీసి చూశాకే ఒక చిన్న క్లూ దొరికింది. ఆ పాత గోనెసంచిపై రంగు వెలసిపోయి మీ ఇంటి అడ్రస్ దొరికింది"

"మా... మా ఇంటి అడ్రెస్సా...? "

"యస్... ఆ గోనెసంచి- మీ ఇంటికి ఎప్పుడైనా పార్శిల్ కోసం చుట్టి పంపిన గోనెసంచై ఉండవచ్చు. అదే గోనెసంచిని వెనక్కు తిప్పి కుట్టారు"

"మీరు చెబుతున్నది వింటూంటే ఆ సంఘటన మా ఇంట్లోనే జరిగి ఉండాలి. ఔనా ఇన్‌స్పెక్టర్? "

"నేనూ అలాగే అనుకుంటున్నాను మిస్టర్ కైలాష్. నేను ఈ కేసును డీల్ చెయ్యడానికి సాధ్యపడకపోవచ్చు. ఇన్‌స్పెక్టర్ గోకుల్‌నాథ్, క్రైం బ్రాంచ్ వివేక్ ఇంకొక అరగంటలో వస్తున్నారు. మీ అత్తయ్య రుక్మిణమ్మ- తిరుపతి నుండి దేవి మరణవార్త అందగానే ఏడుస్తూ నా దగ్గరకి వచ్చింది. ఈ కేసులో నేను ఒక విధంగా ఇన్‌వాల్వ్ అయినందున ఆమెను వెంటబెట్టుకుని ఇక్కడికి వచ్చాను"

కైలాష్ ఆశ్చర్యపోతూ ముఖంపై పరుచుకున్న చెమటను తుడుచుకోవడం కూడా మరచిపోయి చేష్టలుడిగినవాడిలా అలాగే నిల్చుండిపోయాడు. ఒక్క నిమిషం తర్వాత అన్నాడు.

"దేవి మరణాన్ని నేను జీర్ణించుకోలేకపోతున్నాను సార్..."

"బెంగుళూరు హోటల్లోని వాళ్లేం చెప్పారు...? "

అక్కడి విషయాలన్నీ చెప్పాడు కైలాష్.

"ఆ యువతితో ఉన్న వ్యక్తి మోహనై ఉండొచ్చు. మీరు చెప్పిన ఎరుపు రంగు, కర్లింగ్ హేర్.. కచ్చితంగా సరిపోతోంది. దేవి హత్య వెనుక ఎవరో ఇద్దరు వ్యక్తులు- ఒకమగ, ఒకఆడ ఉన్నారు. దేవి బెంగుళూరు నుండి టెలిగ్రామ్ ఇచ్చినట్టు నమ్మించారు. మీకు ఎవరిమీదైనా అనుమానం ఉందా కైలాష్...? "

"నాకేమీ అర్థం కావటంలేదు సార్...!"

"ఆలోచించి చెప్పండి" ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్ అంటూ ఉండగానే ఒక యమహా బైక్ మార్చురీ గదికి ఎదురుగా ఉన్న వేప

చెట్టు క్రిందకు వచ్చి ఆగింది.

'Nobody Escape' అన్న అక్షరాలుగల ఉలెన్ టీ షర్ట్‌తోనూ, స్కై బ్లూ రంగులోని స్టోన్‌వాష్ జీన్స్లూ ధరించిన వివేక్ యమహా దిగాడు. కళ్ళకున్న గాగుల్స్‌ను తీసి షర్ట్ ముందు భాగంలో చెక్కాడు. అక్కడున్న గోకుల్‌నాథ్‌కేసి దారితీశాడు.

"గోకుల్‌నాథ్! బాడీ ఇంకా మార్చురీలోనే ఉందికదూ"

"ఔను వివేక్... పోస్ట్‌మార్టమ్ కాలేదు. అయితే బాడీ చెడిపోకుండా ఉండటానికి ఫార్మాలిన్ రాయమని చెప్పాను..."

ఇద్దరు మాట్లాడుకుంటూ వరండా మెట్లెక్కారు.

"ఆ యువతి పేరు దేవీ? "

"ఔను..."

"పెళ్లయిందా...? "

"అయింది- కానీ పిల్లల్లేరు..." మాట్లాడుకుంటూ ఇద్దరూ మార్చురీ గది దగ్గరకు వచ్చాక ఎదురుపడ్డ ధ్యానేశ్వర్ చప్పున నిలబడి సెల్యూట్ చేశాడు..

గోకుల్‌నాథ్ అడిగాడు "బెంగుళూరుకు వెళ్లిన ఆ యువతి హజ్‌బెండ్, ఆమె తండ్రీ వచ్చేశారా ధ్యానేశ్వర్? "

"వచ్చేశారు సార్" అన్న ధ్యానేశ్వర్, తన సమీపంలో ఉన్న కైలాష్‌ను వారికి పరిచయం చేశాడు. గోకుల్‌నాథ్ కైలాష్‌ను పరిశీలనగా చూస్తూ అన్నాడు:

"ఏమంటున్నాడు...? "

"ఎంక్వయిరీ చేస్తున్నాను సార్..."

"ఎంక్వయిరీని కంటిన్యూ చెయ్యండి... మేము వెళ్ళి బాడీని చూసొస్తాం..." అని మార్చురీ గదిలోకి నడిచారిద్దరూ. వివేక్ ఓసారి ముక్కును రుద్దుకున్నాడు.

"ఫార్మాలిన్ రాసినా ఇంకా వాసన వస్తోందేమిటీ గోకుల్‌నాథ్? "

"నాలుగు రోజులుగా ఈ డెడ్‌బాడీ పెట్టె లోపలే ఉంది. అందుకే కుళ్లిపోయి వాసన వస్తోంది"

పెట్టె మూత తీశాడు గోకుల్‌నాథ్.

వివేక్ ఖర్చీఫ్‌తో ముక్కు మూసుకుని పెట్టెలోపలికి చూశాడు. పెన్ టార్చ్ తీసి వెలుగును లోనికి ప్రసరింపచేశాడు.

"చేతులూ కాళ్ళూ కట్టేసి చెక్క పెట్టెలో పడుకోబెట్టారే గోకుల్‌నాథ్! చాలా హారిబుల్... ఈ చెక్క పెట్టెను ఏ లారీ ఆఫీసులో బుక్ చేశారని చెప్పారు? "

"స్కై ఈగిల్ ట్రాన్స్‌పోర్ట్"

"అదెక్కడుందీ...? "

చిరునామా చెప్పాడు గోకుల్‌నాథ్.

"ఈ పార్శిల్‌ను బుక్ చేసిన క్లర్క్‌తో నేను కొంచెం మాట్లాడాలి"

"అలాగే వివేక్..." అంటూ గోకుల్‌నాథ్ బయటకు దారితీయగా- వివేక్ అక్కడున్న ఒక స్టూల్‌ను దగ్గరకు లాక్కొని కూర్చున్నాడు. కర్చీఫ్‌ను ముక్కుకు అడ్డుపెట్టుకుని, కుడిచేతిలోని టార్చ్‌లైట్‌ను దేవి శవం మీదకు ఫోకస్ చేసి అణువణువూ జాగ్రత్తగా పరిశీలించాడు. వెలుగు కుడిచేతి వేళ్ళపై పడ్డప్పుడు వివేక్ నుదుటిపై ముడతలు పడ్డాయి.

దేవి- కుడిచేతి ఉంగరపు వేలు నరికివేయబడి ఆ ప్రదేశం మొండిగా కనిపించింది. చేతికున్న రాగి కడియం విరిగిపోయి కనిపించింది. దాన్ని పరీక్షగా చూస్తున్న సమయంలో-

కిర్ర్... మంటూ మార్చురీ గది తలుపు మెల్లగా తీస్తున్న శబ్దం వినిపించి తలతిప్పి చూశాడు వివేక్.

కైలాష్ గది బయట నిలబడున్నాడు.

వివేక్ ఒక్కక్షణం ఆశ్చర్యానికి లోనైవెంటనే తేరుకొని కైలాష్‌ను అడిగాడు.

"దేవి హజ్‌బెండ్ మీరేకదూ...? "

"ఔను... సార్..."

"దేవి కుడిచేతి ఉంగరపు వేలు కట్ అయివుంది... ఐ మీన్ ఆమెను హత్యచే



సిన హంతకుడు ఉంగరాన్ని లాగటానికి ప్రయత్నించి, అది రాకపోవడంతో వేలునే నరికి తీసుకుని ఉండాలి... దేవి తన వేలికి ఉంగరం తొడుక్కుందా...? "

"ఔను సార్... తొడుక్కుంది..."

"ఎలాంటి ఉంగరమో చెప్పగలరా...? "

"వజ్రం పొదిగిన అరసవరు ఉంగరం..."

"ఒంటిమీద ఇంకా ఏమైనా నగలు న్నాయా...? "

"మెడలో సన్నటిచైను వేసుకునేది సార్..."

వివేక్ మళ్లీ దేవి మెడకేసి చూశాడు. మెడ నరాలు ఉబ్బిపోయి కుళ్లిన శరీరంతో కనబడింది. కైలాష్ చెప్పిన చైన్ కనిపించ లేదు. పసుపుతాడు మాత్రం మురికిపట్టి కనిపించింది. తడబడుతూ వెళ్లి పెట్టెలోప లికి తొంగి చూశాడు కైలాష్. అంతే...! అలాగే కూలబడిపోయాడు. పెద్దగా ఏడ వటం మొదలుపెట్టాడు. కళ్లలోంచి జలజ లమంటూ కన్నీరు కారసాగింది.

"సార్... దేవి చాలా మంచిది సార్... ఎవరికీ ఏ అపకారాన్ని తలపెట్టాలని అను కోదు. ఆమెను ఎందుకిలా, ఇంత ఘోరంగా హత్య చేశారు? నాకేమీ అర్థం కావడంలేదు సార్" కైలాష్ చిన్న పిల్లా డిలా వెక్కిళ్లు పెట్టి ఏడవసాగాడు.

"మిస్టర్ కైలాష్... హంతకుణ్ణి త్వర లోనే పట్టుకుంటాం. అందుకు మీరు పోలీ సులకు సహకరించాల్సి ఉంటుంది... అడిగే ప్రశ్నలన్నింటికీ నిజమైన జవాబులి వ్వాలి"

కైలాష్ తల ఆడించాడు. అతడి కన్నీళ్లు మాత్రం ఆగలేదు.

"దేవిని హత్యచేసిన వ్యక్తి, ఆమె చేతుల్నీ, కాళ్లనూ కట్టేసి ఒక చెక్క పెట్టెలో కూర్చోబెట్టి పైన పలకతో మూసేసి ఒక గుడ్డల అంగడికి వచ్చిన పార్శిల్‌లా లారీ ఆఫీసుకు తీసుకెళ్లి ఆ పెట్టెను బుక్ చేశాడు. పెట్టెను పార్శిల్ చేయడానికి ఉప యోగించిన గోనెసంచి మీద మీ పేరు, చిరునామా ఉంది. ఆ గోనె సంచిలో మీకు గతంలో పార్శిల్ వచ్చిందా? "

కైలాష్ అవునన్నట్లు తలాడించాడు.

"ఔను సార్... గత నెలలో మద్రాస్ లోని ఫ్రెండొకడు నేను కోరిన స్టీలు పాత్రలు కొన్ని ఒక పెట్టెలో పెట్టి గోనె సంచి చుట్టి పంపించాడు. ఆ గోనె సంచిని, ఆ పెట్టెను ఇంటి వెనుక భాగంలో ఓ మూల ఉంచాం. దేవిని హత్య చేసిన ఆ దుర్మార్గుడు ఆ పెట్టెను, గోనె సంచిని ఉపయోగించినట్టున్నాడు"

"దేవి చేతికి ఒక రాగి కడియం ఉంది దాన్నెందుకు వేసుకుందో చెప్పగలరా...? "

కైలాష్ ఓ మారు పెట్టెలోపలికి తొంగి చూసి చెప్పాడు.

"దేవికి దైవభక్తి చాలా ఎక్కువ సార్... నాలుగు నెలల క్రితం దేవి, ఆమె తల్లిదం డ్రులతో సూళ్లూరుపేట చెంగాళమ్మ గుడి కెళ్లి వచ్చింది. అప్పుడు ఆమె చేతికి రాగి కడియం కనిపించింది. పెట్టెలో నుండి మరో రాగికడియం తీసి నా చేతికి తొడగ డానికి ప్రయత్నించింది. ఈ గుళ్లూ... గోపురాలు... దేవుడూ భక్తీ... వీటిపైన నమ్మకం లేనందువల్ల నేను తొడుక్కోనేం దుకు ఇష్టపడలేదు"

అతడు అలా చెపుతూ ఉండగానే, వివేక్ అడ్డుకొని తన ప్రశ్నల దిశను మార్చాడు.

"మీరెక్కడ పని చేస్తున్నారు? "

"హై పవర్ ట్రాన్స్‌మిషన్ రోప్స్‌లో సేల్స్ మేనేజర్‌గా ఉన్నాను..."

"మీది ప్రేమ వివాహమా? "

"కాదు సార్ పెద్దలుచేసిన వివాహమే"

"మీ పేరెంట్స్ ఎక్కడున్నారు...? "

"గ్రామంలో..."

"మీరు పదిరోజులు హైదరాబాద్‌లో

ఉన్నట్టుగా ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్ చెప్పాడు. హైదరాబాద్ ఎందుకెళ్లారు...? ఆఫీస్ పనిమీదా? "

"నో సార్? .. నేను ఓ డ్రామా ట్రూప్‌ను నడుపుతున్నాను. నా డ్రామా ఒకటి సినిమాగా రాబోతోంది... ఆ విష యంపై నేను హైదరాబాద్ వెళ్లొచ్చాను"

"వెళ్లి ఎప్పుడొచ్చారు..."

"మొన్న రాత్రి వచ్చాను సార్..."

"అంటే గురువారం రాత్రి..."

"యస్ ఇంటికొచ్చేసరికి ఇల్లుతాళం వేసుంది. పక్కన విచారిస్తే దేవి చిత్తూరులోని పుట్టింటికి వెళ్లిందని చెప్పారు. పక్కవీధిలోని ఫ్రెండ్ సాయంతో ఇంటి తలుపులు తీయవలసివచ్చింది..."

వివేక్ అడ్డుపడి "ఎవరా ఫ్రెండ్...? " అని ప్రశ్నించాడు.

"రంగమణి అనీ పూర్ణిమా లాడ్జిలో ఉంటాడు... అతడి దగ్గరున్న మాస్టర్ కీ-బంచ్ సాయంతో తాళం తీశాను"

"మీ ఫ్రెండ్ వద్ద మాస్టర్ కీ-బంచ్ ఎందుకుంది...? సంఘ విద్రోహులే అలాంటి కీ-బంచ్‌ను దగ్గరుంచుకుంటారు...!" వివేక్ అలా అంటూ ఉండగానే- ద్వారం వద్ద ఎవరివో నీడలు పడగా చప్పున వెనక్కు తిరిగి చూశాడు.

ఇన్‌స్పెక్టర్ గోకుల్‌నాథ్, ఓ యువకుడూ నిలబడున్నారక్కడ. నిద్రనుండి లేపుకొచ్చినట్టు అతడి ముఖమే చెబుతోంది. కళ్లల్లో భయం కనిపిస్తోంది.

గోకుల్‌నాథ్ చెప్పాడు "స్కై ఈగిల్ రోడ్‌వేస్ బుకింగ్ క్లర్క్ ఇతనే వివేక్. ఆ పార్సిల్ గురించి పోలీసులకు తెలియజేసింది ఇతనే..."

వివేక్ అతని దగ్గరకు వెళ్లాడు.

"రండి. అలా వరండావైపు వెళదాం" అంటూ ముందుకు నడిచాడు. ఆ యువకుడు తడబడుతూ అనుసరించాడు.

"మీ పేరు...? " అడిగాడు వివేక్.

## కొత్తగాలి...

**శిశిరశ్వాసంలోంచే**
**వసంతహాసం**
**కష్టాల కొలిమిలోంచే**
**సుఖాల కలిమి**

— తులశ్రీ, గుంటూరు

"అశోక్..."

"పేరు బాగుంది. ఈ శవం వచ్చిన పార్శిల్ గురించి మొదట మీరే ఫోన్ చేశారా? "

"ఔను సార్...!"

"దాన్ని బుక్‌చేయటానికి వచ్చిందెవరు"

"ఎవరో తెలియదు సార్...? "

"ఏ రోజు బుక్ చేశారు...? "

అశోక్ తన షర్ట్ జేబునుండి నాలుగ్గామడిచి ఉన్న కాగితాన్ని తీసి చూసి చెప్పాడు.

"నాలుగు రోజుల క్రితం సార్... అంటే మంగళవారం ఉదయం ఫస్ట్ ఈ పార్సిల్ బుక్ అయింది"

"ఏ పేరుతో బుక్ చేశారు? ..."

"అతని పేరు రాజమనోహర్ అని ఇచ్చాడు సార్. అడ్రస్ - నెం. 32, 3వ లైను, పి.కె. లే-అవుట్, తిరుపతి- అని రాశాడు. పార్శిల్ నుండి దుర్వాసన రావటం మొదలెట్టేసరికి మా లారీ ఆఫీసు వాళ్ళు ఆ చిరునామాకు వెళ్ళి విచారించారు. అది బోగస్ అని తెలిసింది"

"టు అడ్రస్ ఏ పేరుతో ఉంది"

"గోవింద స్వామి... నెం:54, పెద్ద మేస్త్రీ వీధి, నెల్లూరు. నెల్లూరులోని మా బ్రాంచ్ ఆఫీసుకు ఫోన్‌చేసి ఈ నెల్లూరు అడ్రస్ ఇచ్చి విచారించమన్నాం. అరగంటలోపు అదీ బోగస్ అడ్రస్ అని తెలిసింది"

"ఆ పేపర్లను ఇలా ఇవ్వండి..."



అతడు ఆ కాగితాలను వివేక్‌కు ఇచ్చాడు. ఓసారి వాటికేసి దృష్టిసారించాడు. వివరాలన్నీ టైప్ చేయబడి ఉంది.

The Parcel contains Household Articles valued Rs. 5,000/- The details of Articles- అన్న వాక్యాలు, అతికించబడి ఉన్నాయి. ఆ కాగితంతో బాటు చెక్‌పోస్ట్ అధికారికి, 'పార్శిల్లో ఉన్నది ఇంటికి ఉపయోగపడే పాత్రలే' అన్న విషయాన్ని తెలిపే ఒక ఉత్తరం జత చేయబడి ఉంది.

"అన్నీ పథకం ప్రకారం చాలా జాగ్రత్తగా చేశారు... మంగళవారం ఉదయం ఎవరు బుకింగ్ క్లర్క్‌గా ఉన్నారు...? "

"నేనే సార్...? "

"వచ్చిందెవరో గుర్తు రావటం లేదా? "

"రావటం లేదు సార్... వచ్చినతను గబగబ ఆ పార్శిల్‌ను బుక్‌చేసి వెళ్ళినట్టు జ్ఞాపకం... కళ్ళకు కూలింగ్ గ్లాసెస్ ఉన్నట్టు జ్ఞాపకం. అతడి ముఖం గుర్తుకు రావటం లేదుసార్..."

"నాలుగు రోజులుగా ఈ పార్శిల్ మీ గోడౌన్‌లోనే ఉందా...? "

"ఔను సార్... మా ట్రాన్స్‌పోర్ట్ లారీ ట్రావెల్స్‌లో సగం మంది సమ్మెలో ఉన్నారు... అందుకే మెటీరియల్స్ వెంట వెంటనే లోడ్ చేయలేకపోయాం. నిన్న రాత్రి నుండే లారీ ఆఫీసులో చెడువాసన ఎక్కువ కాసాగింది. గోడ వెంబడి చీమలు క్యూ కట్టటం కనిపించింది. వెంటనే పార్శిల్ బుక్ చేసింది ఎవరో చూసి ఆ అడ్రస్‌కు వెళ్ళి ఎంక్వయిరీ చేశాం. ఆ అడ్రస్ బోగస్ అని తెలిసిన వెంటనే పోలీసులకు తెలియచేశాం సార్"

వివేక్ కొంచెం దూరంలో నిలబడున్న ఇన్‌స్పెక్టర్ గోకుల్‌నాథ్ వైపు దారితీశాడు.

కాసేపు ఇద్దరూ ఏదో చర్చించుకున్నాక వివేక్, గోకుల్‌నాథ్ జీప్‌లో ఆఫీసుకు బయలుదేరి వెళ్ళారు.

★ ★ ★

రాత్రి పదిగంటలు...

కాలింగ్ బెల్ శబ్దం విని గబగబ వెళ్ళి తలుపు తీసింది జయంతి. తలుపు దగ్గర నిలబడ్డ కైలాష్ మౌనంగా తన రెండురోజుల గడ్డాన్ని రుద్దుకుంటూ లోపలికి వచ్చాడు. ఆ వెంటనే శబ్దం చెయ్యకుండా మెల్లగా తలుపు వేసి గడియపెట్టింది జయంతి. కైలాష్ దీర్ఘంగా నిట్టూర్చి సోఫాలో దబ్బున కూర్చొని జయంతికేసి చూశాడు

"ఏ... ఏమిటండీ.. ఇదీ...? "

కైలాష్ మౌనంగా ఉండిపోయాడు. ఎర్రబడ్డ కళ్ళల్లోంచి జలజలమంటూ కన్నీటి బొట్లు రాలి కిందపడ్డాయి. అది చూసి జయంతి పెదాలు తడబడ్డాయి.

"నాకు నమ్మబుద్ధి కావటం లేదు. దేవికేనా ఇలాంటి గతి పట్టింది? పేపర్లో చూశాను. ఎవరు చేసి ఉంటారండి ఇలా...? పోలీసులు కనిపెట్టారా...? "

లేదన్నట్టు తల ఆడించాడు కైలాష్.

"దేవిని ఖననం చేసేశారా? "

"ఊ..."

"ఎప్పుడూ...? "

"ఇవ్వాళ సాయంత్రం..."

"నాకెందుకు తెలియపరచలేదు? "

"నీకు సమాచారం తెలిపితే నువ్వొస్తావు.. పోలీసుల దృష్టి నీమీద పడుతుంది... నిన్నెవరని అడుగుతారు. నేను ఏదో ఒకటి చెప్పాలి... తర్వాత లేనిపోని సమస్యలు ఎదురవుతాయి"

"పోలీసులు ఏయే చర్యలు తీసుకుంటున్నారు...? "

"ఇంతవరకూ ఏమీ లేదు..."

"ఎవరినైనా సందేహిస్తున్నారా...? "

"అదీ కనిపించటం లేదు... టైప్ చేసిన కాగితాలు చేతిలో పట్టుకుని కనిపించిన

ప్రతి జాబ్ టైపిస్ట్ దగ్గరికెళుతున్నారు..."

"మీ అత్తామామలు ఇంట్లో ఉన్నారా? చిత్తూరుకు వెళ్ళిపోయారా...?"

"శ్మశానం నుండి అటే చిత్తూరుకు వెళ్ళిపోయారు... ఒంటరిగా నేను ఆ ఇంట్లో ఉండలేకపోతున్నాను. అందుకే ఇక్కడికి వచ్చాను... సుమతి లోపలుందా...?"

"లేదు మధ్యాహ్నమే ఊరెళ్ళింది?"

"ఈ రాత్రి ఇక్కడ ఉండొచ్చా జయంతీ?"

"భేషుగ్గా..."

కైలాష్ సోఫాలోంచి లేచి షర్టువిప్పి హేంగర్‌కు తగిలించి మళ్ళీ సోఫాలో కూర్చున్నాడు.

జయంతి అడిగింది. "ఆ కర్లింగ్ హేర్‌వ్యక్తి ఎవరో కనుక్కున్నారా?"

"కనిపెట్టాను.. వాడి పేరు మోహన్. ఊరు చిత్తూరు.. దేవీ, వాడు ఇద్దరూ ఒకే ఆఫీసులో పనిచేసేవారట"

"మీతో మాట్లాడారా?"

"అతను ఆ ఊళ్ళోనే లేడు...!"

"ఎక్కడికెళ్ళాడు...?"

"ఇంట్లో షిమోగాకు వెళుతున్నట్టు చెప్పి ఇంకెక్కడికో వెళ్ళాడు... నాకు వాడిమీదే అనుమానం... పెళ్ళికి ముందే ఇద్దరూ ఒకరినొకరు ఇష్టపడ్డారు. ఏ కారణం చేతనో పెళ్ళి చేసుకోలేకపోయారు..."

"చనిపోయిన మనిషి గురించే మాట్లాడుతుంటే ఇంకా అప్సెట్ అయిపోతారు. ఏమైనా తినడానికి తీసుకురానా...?" జయంతి లేస్తూ అడిగింది.

"నాకేమీ వద్దు..."

"స్కాచ్ ఉంది. ఒక పెగ్ తీసుకురానా...?"

కైలాష్ నోట్లో నీరూరింది.

"మనసూ, శరీరమూ ఇప్పుడున్న పరిస్థితుల్లో ఒక పెగ్ చాలదు జయంతీ...!"

పక్కగదిలోని ఫ్రిజ్ దగ్గరికి జయంతి వెళ్ళిన అదే క్షణంలో బర్ర్..ర్ మంటూ కాలింగ్ బెల్ మ్రోగింది.

జయంతి అక్కడినుంచే అంది, "ఎవరో చూడండి.. మా కజిన్ సీతాపతి వస్తున్నట్టు చెప్పాడు.. అతనే అయ్యుంటాడు"

కైలాష్ లేచి వెళ్ళి తలుపుకున్న గడియ తీసిన వెంటనే భళ్ళున తలుపు తెరుచుకుంది.

"ఎవరూ...?"

"అయాం వివేక్.. క్రైం బ్రాంచ్..." నవ్వుతూ లోపలికి వచ్చాడు వివేక్. అతను ధరించిన టీషర్ట్‌పై- 'Who can be against me' అన్న అక్షరాలు కైలాష్ కళ్ళబడ్డాయి.

కైలాష్ ముఖం ఎర్రబడింది. పిడికిలి బిగుసుకుంది. పళ్ళ బిగువున ఆవేశాన్ని అణుచుకున్నాడు.

## అవేమైనా తోడ్పడగలవా?



శరత్ చంద్ర కుల, మత మూఢాచారాలను వ్యతిరేకించారు. అప్పటికే బాగా పేరున్న రచయితలు పంచభూతాలయిన గాలి, నీరుకు ఎలాంటి కులభేదం ఉండదనీ, పెంపుడు జంతువులైన పిల్లులను ఒడిలోకి తీసుకుంటామనీ, అలాంటప్పుడు సాటి మనుషులు హీనమెలా అవుతారని, ఇంటింటికి ప్రాకే చీమలకు లేని కులం మనకెందుకని బోధించేవారు. దాన్ని ఎద్దేవా చేస్తూ శరత్, 'సొంత తల్లే కొడుకును సముద్రప్రయాణం చేసొచ్చాడని జీవితాంతం వెలివేసినటువంటి సమాజంలో చీమలు, పిల్లులు, గాలి, నీరులాంటి వాటిగురించి చెప్పడంద్వారా ఆ దురాచారాన్ని అంతమొందించగలమా? నిజానికి దీనికి అవేమైనా తోడ్పడగలవా?' అన్నాడు. దురాచారాలపై పాత్రల అంతఃసంఘర్షణల ద్వారా చదువరుల్లో బాధను రగిల్చాలన్నాడు.

## కొత్తగాలి...



**పెనం పెద్దదయినా తయారయ్యేది**
**పిండి కొద్ది రొట్టే**
**ఆశ-ఆకాశమంతయినా చేసే**
**కృషిని బట్టే ఫలితం**

*- ఆర్.వెంకటేశ్వర శర్మ, గుంటూరు*

"సా...సార్... మీరు...?"

"ఇక్కడికెలా వచ్చానా? అని అడుగుతున్నారా మిస్టర్ కైలాష్...? మీ వైఫ్ దేవిని ఖననం చేశాక కేస్ ముగిసిపోయిందని మీరనుకోవచ్చు కానీ... ఒక పోలీసు ఆఫీసరుకు ఆ నిమిషం నుండే ప్రారంభమవుతుంది. బై...ది..బై... ఇది మీ ఇల్లా?"

"నో... నో... ఇది... మిస్ జయంతి వాళ్ళ ఇల్లు..."

లోపలి గది ముందు నిలబడి కలవరపాటుతో చూస్తున్న జయంతిని కళ్ళతో చూపిస్తూ- "వారేనా మిస్ జయంతి?" అడిగాడు వివేక్.

"ఔను..."

"ఆమె మీకేమన్నా బంధువా...?"

"నో..."

"మరి...?"

"ఒక ఫ్రెండ్..."

"గర్ల్ ఫ్రెండా...?"

కైలాష్‌కు ఏమి చెప్పాలో తెలియక గుటకలు మింగుతూంటే జయంతి వివేక్ సమీపానికి వచ్చింది.

"సారు... మీరు అనుకునే అర్థంతో నేను ఆయనకు గర్ల్ ఫ్రెండ్‌ను కాను... నేనొక డ్రామా ఆర్టిస్ట్‌ను. ఆయనా ఒక డ్రామా ట్రూపును నడుపుతున్నారు. నేను అప్పుడప్పుడూ ఆయన ట్రూపులో నటించే దాన్ని... వృత్తిరీత్యా నేనూ ఆయనా ఫ్రెండ్స్‌మి, అంతే"

వివేక్ చిరునవ్వు చిందించాడు.

"మీ మధ్య ఉన్న ఫ్రెండ్‌షిప్‌ను గురించి లోపల కూర్చొని మాట్లాడుకుందామా మిస్ జయంతీ?"

"రండి..." జయంతి గొంతులో లీలగా భయం..

వివేక్ లోపలికొచ్చి కైలాష్ చూపించిన సోఫాలో కూర్చున్నాడు. జయంతీ, కైలాష్ లిద్దరూ ఎదురుగా ఉన్న కుర్చీలలో కూర్చున్నారు. వివేక్ సావకాశంగా అడిగాడు:

"రోజూ రాత్రిపూట వృత్తిరీత్యా మాట్లాడటానికి మీరు ఒక స్నేహితుడిగా వస్తున్నారా మిస్టర్ కైలాష్...? మీ పద్ధతులేం బాలేదని చాలామంది చెప్పారే?"

"ఎవరు...?"

"పేరు చెబితే ఒప్పుకుంటారా...? మీ డియరెస్ట్ ఫ్రెండ్ రంగమణిని ఓ గంట ముందు పూర్ణిమా హోటల్లో కలిశాను. అతనితో జరిపిన విచారణలో మీ గురించి చెప్పిన ముఖ్యమైన విషయాలలో ఇదీ ఒకటి. జయంతి మీకు ఇల్లీగల్ వైఫ్, యామై కరెక్ట్...?"

నల్లబడ్డ ముఖాలతో కైలాష్, జయంతీ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. వివేక్ తన మాటల్ని కొనసాగించాడు-

"ఈ ఇంట్లో మీరు షర్టు విప్పి బనియన్ ప్యాంట్‌తో స్వతంత్రంగా కూర్చుని ఉన్న తీరే చాలు మిస్టర్ కైలాష్...!"

కైలాష్ నోట మాటరాక ముఖానికి పట్టిన చెమటను తుడుచుకున్నాడు.

"ఓకే... మిస్టర్ కైలాష్... ఇది మీ వ్యక్తిగత విషయం. దీన్ని తప్పు అని చెప్పడానికి నేనిక్కడికి రాలేదు... నేనడిగే కొన్ని ప్రశ్నలకు మాత్రం సరియైన సమాధానాలు చెప్పేశారంటే నేను ఇక్కణ్ణించి వెళ్ళిపోతాను..."

"అడగండి సార్..." కైలాష్ చివరికి ఎలాగో నోరు తెరిచాడు.

"మీకు జయంతితో ఉన్న సంబంధం

దేవికి తెలుసా...?"

"తె...లు...సు..."

"తెలిసీ మిమ్మల్ని ఏమీ అనలేదా?"

కైలాష్ మౌనం వహించాడు.

"ఊ చెప్పండి కైలాష్... ఇంకా మౌనం వహించి ఏం సాధిద్దామని.... ప్లీజ్... సమాధానం చెప్పండి..."

"మొదట్లో తిట్టింది... ఏడ్చింది. ఆత్మ హత్య చేసుకుంటానని బెదిరించింది... ఆపై నా మానాన నన్ను వదిలేసింది..."

"మీరు హైదరాబాద్ వెళ్ళడం దేవికి ఇష్టం ఉండేది కాదు, ఔనా...?"

"ఔను..."

"మీరు సినీ ఫీల్డుకు వెళ్ళడం కూడా ఇష్టం లేదా?"

"ఔను"

"మరో ముఖ్యమైన ప్రశ్న. విన్న వెంటనే నాపై కోపగించుకోండి"

"అడగండి సార్..."

"దేవిని ఎలా చంపారు...?"

ఉన్నట్టుండి వాతావరణం వేడెక్కింది.




**వి**వేక్ అడిగిన ఆ ప్రశ్నకు ఎవరో ముఖంపై చరిచినట్టు అదిరిపడ్డాడు కైలాష్. వారికి సమీపంలో కూర్చుని ఉన్న జయంతి ముఖం పాలిపోయింది. వివేక్ ఇద్దర్నీ మార్చి మార్చి చూడసాగాడు. కైలాష్ పెదాలు తడుపుకొని గొంతు పెగుల్చుకొని అన్నాడు-

"దేవిని నేను చంపానా...? ఏంటి సార్ మీరు అంటున్నది..."

వివేక్ చిర్నవ్వు చిందించాడు. "నేను అనడం కాదు కైలాష్... మీ ప్రవర్తనే చెబుతోంది... మీ గురించి బయటివాళ్ళు చెప్పిన విషయాలు దాన్ని స్పష్టం చేస్తున్నాయి. దేవికీ మీకూ పెళ్ళయిన రోజు నుండే టర్మ్స్ బాగాలేవు... బయటి ప్రపంచానికి మీరిద్దరూ భార్యాభర్తలు. కానీ ఇంట్లో ఎడమొగం పెడమొగం.. యామై కరెక్ట్...?"

కైలాష్ చేత్తో నుదుటిపై రాసుకున్నాడు. "యు ఆర్ సెంట్ పర్సెంట్ కరెక్ట్ సార్. నాకు దేవికీ పెళ్ళయిన రోజు నుండే టర్మ్స్ బాగాలేవు. నిజమే! మేమిద్దరం ఇంట్లో ఎడమొగం పెడమొగంగా ఉంటున్నాం... కానీ, దేవిని హత్యచేసేంత దుర్మార్గుణ్ణి కాను నేను"

"ఈజిట్? సంతోషం. మీరు హైదరాబాద్ వెళుతున్నప్పుడు దేవి ఎలాఉంది?"

"ఎలా ఉందంటే...? మీ ప్రశ్న నాకు అర్థంకావటం లేదు సార్...?"

"సంతోషకర మూడ్‌లోనే ఉందా...?"

"నేను బయటి ఊరికి వెళుతున్నానంటేనే ఆమెకు చాలా సంతోషం కదా..."

"ఎందుకలాగా...?"

"ఈ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో తెలియటం లేదు సార్. ఆమెకు నాతో అంతగా ఎటాచ్‌మెంట్ లేదనే చెప్పాలి"

"దేవిని మీరు హత్య చేయలేదని నిస్సందేహంగా చెప్పగలరా?"

"ఔను..."

"ఎవరు చేసుండొచ్చని..?"

"ఆ మోహన్ అయి ఉండొచ్చు.."

"ఎలా అనుకుంటున్నారు...?"

"నేను ఊళ్లోలేని సమయంలో దేవి, మోహన్‌లిద్దరూ ఒక పథకం ప్రకారం ఊరొదిలి పారిపోయుండాలి సార్...

వెళ్ళాక ఇద్దరికీ ఏవైనా మనస్పర్ధలొచ్చి దేవిని మోహన్ హత్య చేసుండొచ్చు..."

"ఈ కారణం నాకు సమంజసంగా అనిపించటం లేదు మిస్టర్ కైలాష్. ఒకరినొకరు ఇష్టపడి ఊరొదిలి పారిపోయిన వాళ్ళ మధ్య స్పర్ధలు రావటానికి అవకాశమే లేదు. పైగా దేవి హత్య బయట జరిగినట్టు లేదే? మీ ఇంట్లోనే జరిగినట్లుంది. దేవిని పార్శిల్ చేయటానికి ఉపయోగించిన పెట్టె, గోనె సంచీ - అన్నీ మీ ఇంట్లో ఉన్నవాటినే ఆ 'ఎక్స్' ఉపయోగించాడు"

"సార్, మీరెన్నైనా చెప్పండి.. నాకు ఆ మోహన్‌మీదే అనుమానం. షిమోగా వెళుతున్నట్టు ఇంట్లో చెప్పాడు. కానీ చెప్పినట్టు అతను షిమోగా వెళ్ళలేదు. అతను ఇప్పుడు ఎక్కడున్నాడో తెలియటం లేదు. కచ్చితంగా ఈ హత్యకు కారణం ఆ రాస్కెలే" కైలాష్ ఆవేశంతో అరిచాడు. అంతవరకూ కైలాష్‌తో మాట్లాడుతున్న వివేక్ తన చూపును జయంతివైపు తిప్పాడు. దాంతో కాస్త తడబడింది ఆమె.

"మీ అసలు పేరు జయంతేనా...? "

"ఔను..."

"ఈ ఇంట్లో మీరొక్కరే ఉంటారా...? "

"ఔను..."



"దేవితో మీరెప్పుడైనా మాట్లాడారా? "

"ఒకే ఒకసారి మాట్లాడాను..."

"ఎప్పుడు...? "

"నేను నటిస్తున్న నాటకాన్ని చూడ్డానికి వచ్చినపుడు. కైలాషే పరిచయం చేశాడు. ఆ రోజే దేవిని మొదటిసారి చూశాను"

"మాట్లాడారా...? "

"ఊc..."

"ఏం మాట్లాడారు...? "

"నాటకం మధ్యలో వెళ్ళిపోకండి... నాటకం పూర్తిగా చూసి వెళ్ళమన్నాను. అందుకామె నవ్వుతూ తలాడించింది"

"ఆ తర్వాత మీరామెని చూడలేదా? "

"లేదు"

కూర్చుని ఉన్న వివేక్ చటుక్కున లేచి నిలబడ్డాడు.

"కైలాష్.. నాకో సాయం చేస్తారా? "

"చెప్పండి సార్...!"

"మీ ఇంటి వరకూ రాగలరా...? "

"ఎందుకూ...? "

"ఇంటిని ఓసారి పరిశీలించాలి...!"

కైలాష్ జయంతికేసి చూడగా, ఆమె కోపంతో అంది "వెళ్ళిరండి...! నన్నెందు కలా చూస్తారు... మీ మీద పోలీసుల కున్న అనుమానాన్ని పూర్తిగా తొలగించి... ఆ తర్వాతే ఇక్కడికి రండి... నేనెక్కడికీ పారిపోను"

★ ★ ★

వీధి తలుపులు బార్లా తెరిచాడు కైలాష్. వివేక్ లోపలికి దారితీయగా గోడ కున్న స్విచ్‌ను నొక్కాడు కైలాష్. చమక్ మని బల్బులు వెలిగాయి.

వివేక్ చుట్టూ పరికించి చూస్తూ అడిగాడు "ఇది అద్దె ఇల్లే కదూ...? "

"ఔను సార్..."

"ఓనర్ ఎవరు...? "

"పేరు రంగయ్య... తిరుచానూరులో ఉంటారు..."

వివేక్ వంటగదిలోకి తొంగిచూస్తూ - "దేవికి చాలా దగ్గరి స్నేహితులెవరు...? " అని అడిగాడు.

"నాకు తెలియదు సార్... కానీ 'వనజ'





అన్న యువతి దేవికి రాసిన ఉత్తరం ఒకటి, రెండు రోజుల క్రితం నాకు దొరికింది. దేవి ఆ ఉత్తరాన్ని చిన్న చిన్న ముక్కలుగా చింపి మంచం కింద పడేసింది... నేను ఆ ముక్కల్నన్నింటినీ తీసి ఓ పేపర్‌లో అతికించాను..."

"ఆ లెటర్ మీ దగ్గరుందా..." వివేక్ చూపుల్లో కుతూహలం తొంగిచూసింది.

"ఉంది సార్..." అంటూ అల్మారాలోని డైరీని తీసి, అందులో దాచిన ఆ ఉత్తరాన్ని తీసి వివేక్‌కు ఇచ్చాడు కైలాష్.

వివేక్ ఆ ఉత్తరాన్ని ఓసారి చదివి-

"ఈ ఉత్తరం నా దగ్గరే ఉండనీ కైలాష్..." అంటూ అతని సమాధానం కోసం ఎదురుచూడకుండా దాన్ని మడిచి జేబులో పెట్టుకున్నాడు.

తర్వాత "ఈరోజు ఉదయం ఆసుపత్రిలో మీతో మాట్లాడినపుడు దేవి క్యారెక్టర్ మంచిదికాదని చెప్పారు... జ్ఞాపకముందా కైలాష్...?" అన్నాడు.

"ఔను... చెప్పాను..."

"ఏ ఆధారంతో చెప్పారు...?"

"నేను తీసుకురాని - నేను ఉపయోగించని కండోమ్స్ ప్యాకెట్‌ను బీరువాలో దాచిపెట్టింది సార్"

"దాన్ని మీరు నిజంగా తేలేదా?"

"లేదు" తలఅడ్డంగా ఊపాడు కైలాష్.

"కుటుంబ నియంత్రణపై శ్రద్ధ ఉన్న మీ భార్య దేవి, మంచి ఆలోచనతోనే దాన్ని కొని ఉండవచ్చు కదా?!"

కైలాష్ నవ్వాడు.

"ఏ సంసారపక్షమైన ఆడది కూడా అంగడికి వెళ్ళి సిగ్గువిడిచి- దీన్ని తీసుకురాదు సార్... దేవి హత్య చేయబడటానికి అసలు కారణం- తను చెడు మార్గంలో నడవటమే సార్..."

"అయితే దేవిని మీరే హత్యచేసి ఉండాలి... భార్య నడవడిక చెడ్డదని తెలిసిన ఏ భర్తయినా ఎలా ఊరుకుంటాడు...?"

"సార్ ప్రమాణం చేసి చెబుతున్నాను. నేను దేవిని ఏమీ చేయలేదు! దేవికి ఆ మోహన్‌తో పాటు ఇంకెవరితోనైనా స్నేహం ఉండొచ్చు.. అది మోహన్‌కు తెలిసిపోయిండాలి... అది సహించలేక మోహన్ ఆమెను హత్యచేసి ఉండొచ్చు"

వివేక్ నవ్వాడు.

"మంచి అనుమానమే. సరే! నా మనసులో ఒక మూల ఈ విషయాన్నీ జ్ఞాపకముంచుకుంటాలే...!"

"అలాగే సార్..."

"ఈ బీరువాను తెరవండి..." గోడవారగా నిలబెట్టి ఉన్న గాద్రెజ్ బీరువాను చూపించి అన్నాడు వివేక్.

కైలాష్ ఫ్యాంట్ జేబులో నుంచి తాళం

## ఎవరు గొప్ప?

శరత్‌చంద్ర తన సాహిత్యంలో యవ్వనభరితమైన లౌకికవాద, మానవతావాద, ద్వంద్వాత్మక భౌతికవాద భావాలకు పట్టంగట్టాడు. రవీంద్రనాథ్ ఠాగూర్ రచనల్లో కనిపించే మానవతావాదం అంత శక్తిమంతంగా ఉండదని భావించిన ఓ శరత్ అభిమాని, 'మీరు రవీంద్రనాథ్ గురించి ఏమంటారు?' అని అడిగాడు. దానికి శరత్ ఎంతో నమ్రతగా, 'నేను పామరులకోసం రచనలు చేస్తుంటే, గురూజీ మాత్రం నాలాంటి వారికోసం చేస్తుంటారు' అన్నాడాయన. దీంతో ఆ ప్రశ్న అడిగిన వ్యక్తి శరత్‌బాబు నమ్రతకు అవాక్కయ్యాడు.



చెవుల గుత్తి తీసి బీరువాను తెరిచాడు. తీసి కాస్త పక్కకు జరిగి నిలబడ్డాడు.

"ఈ బీరువాను మీరిద్దరూ ఉపయోగిస్తారా కైలాష్...?"

"ఔను సార్..."

"డబ్బూ... నగలూ...?"

"ఇందులోనే దాస్తాం... పై రెండు అరలలో దేవి తనకు సంబంధించిన చీరలు, జాకెట్లు, లోదుస్తుల్నీ దాచుకుంటుంది... కింద రెండు అరలలో నా ప్యాంట్లూ, షర్టులు దాచుకుంటాను..."

"ఆ కండోమ్స్ ప్యాకెట్ ఏ అరనుండి తీశారో చెప్పగలరా కైలాష్...?"

"కింద అరనుండి..."

"అంటే మీరు ఉపయోగించే అర నుండి... అంతేకదూ...?"

"ఔను..."

వివేక్ నవ్వుతూ కైలాష్‌ను చూశాడు.

"ఇక్కడ నాకో విషయం స్పష్టమవుతోంది కైలాష్. మీరు ఆలోచించి చూశారా? దేవి నిజంగానే ఒక నీచురాలైతే ఆ కండోమ్స్ ప్యాకెట్ అంత బహిరంగంగా- అదే బీరువాలో- మీరు దుస్తులు దాచే అరలో పెడుతుందంటారా?"

"సార్...!" అంటూ నసిగాడు కైలాష్.

"ఒక విషయం అర్థమవుతోంది కైలాష్. దేవి హత్యకు కారకుడైనవాడు దేవిని ఒక నీచురాలిగా చిత్రించడానికి చాలా శ్రమపడ్డాడు. ముఖ్యంగా మిమ్మల్ని నమ్మించడానికి ఆ కండోమ్స్ ప్యాకెట్ కొని మీ కళ్లబడేలా ఉంచాడు. కాస్త కామన్‌సెన్స్‌తో ఆలోచించి చూడండి కైలాష్. లాజిక్ దొరుకుతుంది..."

కైలాష్ ఏమీ మాట్లాడలేక మౌనంగా వివేక్‌ను చూశాడు.

వివేక్ తన మాటలను కొనసాగించాడు: "మీ వైఫ్ దేవి ఎవరితోనూ, ఏ ఊరికీ వెళ్లి ఉండదన్నది నా ఆలోచన. ఈ ఇంట్లోనే ఆమె హత్య చేయబడి ఉండాలి. ఇక్కడ నుండే పార్శిల్ చేయబడి- ఉండాలి... ఆc అన్నట్టు ఆ పెట్టెనూ, గోనె సంచినీ ఎక్కడపడేసి ఉంచారు...?"

**కొత్తగాలి...**

**మనిషి మీద కత్తి దూస్తే**
**నెత్తుటి గాయాలు**
**మనసు మీద కలం దూస్తే**
**నెత్తుటి గేయాలు**

—అద్దంకి శ్రీనివాస్, హైదరాబాద్

"రండి సార్, చూపిస్తాను..."

వంటగదిలోని లైట్లనూ - ఇంటి వెనకున్న లైట్లనూ వేసి పెరటి వైపుకు దారితీశాడు కైలాష్.

అక్కడ విరిగిన ప్లాస్టిక్ బకెట్ ఒకటి, నాలుగైదు రేకుల డబ్బాలు, రంగు వెలిసిపోయిన గొడుగు, ఓటి కుండలు రెండు - ఇవన్నీ ఉన్న ఆ ప్రదేశాన్ని చూపుతూ- "దీన్ని పక్కనే ఆ పెట్టెనూ, గోనె సంచినీ ఉంచాను సార్" అన్నాడు కైలాష్.

వివేక్ ఆ ప్రదేశాన్ని క్షుణ్ణంగా పరిశీలించాడు. నేలమీద అక్కడక్కడా మట్టి కుప్పలు.. వాటి నడుమ చెదల బారొకటి తలుపువైపు వెళుతూ కనిపించింది. నిదానించి చూడగా అక్కడ ఏదో ఒక బరువైన వస్తువును నేలపై లాక్కుంటూ తీసుకెళ్లిన గుర్తులు కనిపించాయి.

"దేవిని పార్శిల్ చేసిన పెట్టెను ఈ దారిలోనే బయటకు తీసుకెళ్లి ఉండాలి. ఆ చిన్న తలుపు, గోడ, నేల కాస్త దెబ్బతిన్నది గమనించారా? ఆ పెట్టె ఆకృతి, దాన్ని బయటకు తీసుకెళ్లిన విధానాన్ని చూస్తోంటే, దేవి హత్యలో ఇద్దరు పాల్గొని ఉండాలి..."

కైలాష్ తన ముఖానికి పట్టిన చెమటను తుడుచుకుంటూ - "కావచ్చు.." అని



తలాడించాడు. ఎందుకో అతడి ముఖం నల్లగా మాడిపోయి ఉంది.

"మోహన్ గురించి సమాచారం అందితే కానీ ఈ కేసులో క్లూ దొరకదు. తరువాత దేవికి లెటర్ రాసిన ఆ వనజ ఎవరో తెలియాలి. వనజ గురించి దేవి వాళ్ల తల్లిదండ్రులకు తెలిసుండొచ్చు వాళ్లను అడిగి కనుక్కోవాలి" అలా మాట్లాడుతున్న వివేక్ చప్పున ఆగిపోయాడు. పెరటి తలుపు గడియపై అతని చూపులు పడ్డాయి.

"కైలాష్ కాస్త పక్కకు తప్పుకోండి..."

అతడు పక్కకు తప్పుకోగా వివేక్ తలుపు దగ్గరికి నడిచాడు. దీక్షగా ఆ ప్రదేశాన్ని పరిశీలించాడు.

"ఏంటి సార్ చూస్తున్నారు? " ఆతృతగా అడిగాడు కైలాష్.

"ఆ తలుపుకున్న గడియ, దాని చుట్టుపక్కల జాగ్రత్తగా పరిశీలించండి కైలాష్"

కైలాష్ చూసి అన్నాడు: బ్రౌన్ రంగులో ఏదో మరకలా ఉంది సార్"

"యస్, అదిమరక కాదు- రక్తం...!!"




"రక్తమా...? " అలాగే నోరు తెరుచుకుని ఉండిపోయాడు కైలాష్.

వివేక్ తలతిప్పి అతణ్ణి చూడకుండా అన్నాడు, "ఔను. గడ్డకట్టిన రక్తం.... శవాన్ని ఇంట్లో నుండి బయటకు తీసుకెళ్లటానికి హంతకులు ప్రయత్నించినపుడు ఈ రక్తపు మరకలు అంటినట్టు- ఉంది కైలాష్. శ్రమ అనుకోకుండా ఒక వేస్టుపేపరూ, ఈ రక్తపు మరకలు తీయటానికి ఒక రేకు ముక్కా పట్టుకురాగలరా? "

కైలాష్ ఇంట్లోకి వెళ్లి వివేక్ అడిగిన వస్తువులను పట్టుకొచ్చి ఇచ్చాడు. వివేక్ ఆ గడ్డగట్టిన రక్తపు మరక పొడిని పేపర్‌లోకి తీసుకొని పొట్లం కట్టాడు. ఇంకా ఎక్కడైనా రక్తపు మరకలు కనిపిస్తాయేమోనని మరింత క్షుణ్ణంగా పరిశీలించి కైలాష్ వైపు తిరిగి "దేవి బ్లడ్ గ్రూప్ ఏమిటో తెలుసా...? "అడిగాడు వివేక్.

"తెలియదు సార్..."

"దేవికి ఒంట్లో బాగోకపోతే తరచూ ఏ డాక్టర్ దగ్గరకు వెళుతుంది...? "

"డాక్టర్ మాధవీ..."

"ఆమె ఎక్కడుంటారు...? "

"పక్క వీధిలో- లాస్ట్ బంగళా..."

"మీరొక పని చెయ్యాలి కైలాష్. రేపు ఉదయం పది గంటలలోపు డాక్టర్ మాధవిని కలిసి దేవి ఎప్పుడైనా బ్లడ్‌గ్రూప్ టెస్ట్ చేయించి ఉంటే ఆమె గ్రూప్ ఏమిటో తెలుసుకొని నాకు చెప్పాలి"

"అలాగే సార్..."

పెరటి తలుపులు మూసేసి ఇద్దరూ లోపలికి వచ్చారు.

"సారీ ఫర్ ది డిస్ట్రబెన్స్... ఇంత రాత్రి సమయంలో మీకు చాలా ఇబ్బంది కలిగించాను. రేపు ఉదయం పది గంటలకు మీరు నన్ను టెలిఫోన్‌లో కానీ, నేరుగా కానీ కలవండి...!"

మౌనంగా తల ఊపాడు కైలాష్.

వివేక్ వీధి తలుపు తీశాడు. మెట్లు దిగుతున్నప్పుడు- చూశాడు వివేక్. ఇరుగు పొరుగు ఇళ్లల్లో లైట్లు వెలుగుతున్నాయి. ఆ ఇళ్లలోనివారు గుమ్మాల్లోంచే వివేక్‌నూ, కైలాష్‌నూ వింతగా చూస్తున్నారు.

తన యమహా దగ్గరకు వెళ్ళిన వివేక్ ఒక నిమిషం ఆగి పక్కింటి ముంగిట్లో

నిలబడున్న లాయర్ సీతారామ్, ఆయన భార్య సరోజనూ ఓమారు చూశాడు.

"వీళ్ళను ఓసారి విచారణ చేస్తే? " అనుకున్నదే తడవు వాళ్ళ వైపుకు దారితీశాడు.

సరోజ లోగొంతుకతో భర్తతో అంది, "ఏమండీ అతను ఇటే వస్తున్నాడండీ? "

"రానీయ్...! దేవిని నువ్వే హత్య చేసినట్టు ఎందుకలా భయపడతావ్? హత్య చేయబడ్డ వ్యక్తి ఇంటి పక్కన ఉంటే ఇలాంటి ఇబ్బందులు తప్పవు మరి. జాగ్రత్తగా మాట్లాడు... నోటికొచ్చింది మాట్లాడితే పోలీసులు పట్టుకుపోతారు..."

సరోజ పైట సర్దుకుని లేని ధైర్యాన్ని తెచ్చుకుంటూ వివేక్‌ను చూసింది.

వివేక్ వాళ్ళను సమీపించి- "ఒక చిన్న ఎంక్వయిరీ..." అన్నాడు.

"వెల్ కమ్ ఐయామ్ సీతారామ్, లాయర్. షీ ఈజ్ మై వైఫ్ సరోజ. పక్కింటి దేవి నా వైఫ్‌తో చనువుగానే ఉండేది. దేవిని గురించి అడిగేటట్టుంటే ఈమెను అడగండి... మీకు ఉపయోగపడే విషయాలు చెప్పవచ్చు" అన్నాడాయన.

భర్తను ఉరిమి చూసింది సరోజ.

వివేక్ సరోజ వైపు తిరిగాడు.

"సరోజగారూ ఒకే ఒక ప్రశ్నకు మాత్రం మీరు సమాధానం చెబితే చాలు"

"అడగండి..."

"దేవిని చూడ్డానికి 'వనజ' అన్న పేరుతో ఎవరైనా వచ్చారా? "

"వనజ- అన్న పేరుతోనా...? "

"ఔను..."

"నేను చూళ్ళేదు..."

"దేవి మీ ఇంటికి వచ్చేదా...? "

"ఎన్నోసార్లు పిలిచానుకానీ రాలేదు"

"ఎందుకలా...? "

"కారణం తెలియదు. మొదట్లో ఆమెకు గర్వం అనుకున్నాను. తర్వాత ఆమె స్వభావమే అంత అని గ్రహించాను..."

"దేవి హజ్‌బెండ్ కైలాష్‌ను గురించి మీరేమనుకుంటున్నారు? "

"అతను ఒక జెంటిల్‌మేన్ సార్. బాగా పలకరిస్తాడు. దేవిలా మూడీ టైప్ కాదు... దేవిని గురించి మీకు ఇంకా వివరాలు కావాలంటే... ఎదురింటి మీనాక్షి ఆంటీని అడగండి. ఆమె మరిన్ని వివరాలు చెబుతుంది"

వివేక్ వెనక్కు తిరిగి ఎదురింటి వైపు చూశాడు. ఇంటి బయట మీనాక్షి, సాంబయ్య నిలబడి ఉండటం కనిపించింది. వివేక్ లాయర్ దంపతుల దగ్గర సెలవు తీసుకొని ఆవైపు దారితీశాడు. వాళ్ళిద్దరూ అతణ్ణే చూస్తున్నారు. వివేక్ మీనాక్షి ఆంటీని అడిగాడు: "మీరు చివరిసారిగా దేవిని ఎప్పుడు చూశారు...? "

"గత సోమవారం సాయంత్రం ఆరు గంటలకు? "

"అప్పుడు దేవితో ఎవరైనా ఉన్నారా? "

"ఔనండీ ఎర్రగా, కర్లింగ్ హేర్‌తో ఒకతను దేవితో మాట్లాడుతూ కూర్చుని ఉన్నాడు. అతను అప్పుడప్పుడూ వచ్చిపోయే పరిచయస్తుడే...!"

వివేక్ మరో ప్రశ్నను అడగడానికి నోరు తెరవకమునుపే, అతని వెనుక- 'టక్... టక్...'మంటూ ఏదో శబ్దం వినిపించింది.

వెనక్కు తిరిగి చూశాడు.

ఊతకర్రల సాయంతో వస్తున్నాడొక వ్యక్తి. దగ్గరకు వచ్చి నమస్కరించాడు.

"నమస్కారమండీ! నన్ను అందరూ 'మిలట్రీ నాయుడు' అని పిలుస్తారు. దేవి హత్యకు సంబంధించి నేను మీతో కొన్ని విషయాలు చెప్పవచ్చా..? "

"ఏం చెప్పబోతున్నారు...? " వివేక్ నవ్వుతూ అడిగాడు.

"సంఘటన జరిగిన రోజు రాత్రి సుమారు ఒంటిగంట ప్రాంతంలో నేను టీ తాగొద్దామని బయలుదేరాను. దేవి ఇంటి



దగ్గరకొచ్చేసరికి లోపలినుండి ఎవరో పెట్టెకు చీలలు కొడుతున్న శబ్దం వినిపించింది. కైలాష్ ఊరునుండి వచ్చి దేన్నైనా కొడుతున్నాడేమోనని అనుకున్నాను..."

"తలుపు తట్టి అదేమిటో అడగలేదా? "

"నాకు అడగాలనిపించలేదండీ..."

"మీరు రోజూ ఒంటిగంట తర్వాత టీ తాగడానికి బయటకు వెళతారా? "

"ఔను..."

"ఎందుకలా...? "

"అది నా అలవాటు... కొంతమందికి టీ తాగితే నిద్రరాదు. నాకు టీ తాగితేనే కానీ నిద్రపట్టదు!"

"దేవి మీకు పరిచయమేనా...? "

"ఎందుక్కాదు? ఒకట్రెండు సందర్భాలలో నన్ను 'రండి నాయుడుగారూ' అంటూ ఇంటి లోపలికి ఆహ్వానించింది. మనసులో ఏ కల్మషమూ లేని అమ్మాయి. అటువంటి అమ్మాయిని చంపటానికి అతడికెలా చేతులొచ్చాయో? "

"మీరుండేది ఎక్కడ...? "

"ఇదే వీధిలో చివర గది నాదే..."

"మీరు ఒంటరిగా ఉంటున్నారా...? "

"ఔను..."

అలాగా అంటూ తన విచారణను ముగించి, అతని దగ్గర సెలవు తీసుకొని, తన యమహా దగ్గర నిలబడి ఉన్న కైలాష్ దగ్గరకు వచ్చాడు వివేక్.

యమహాకు కిక్ ఇస్తూ అన్నాడు, "కైలాష్.. ఇక సెలవు తీసుకుంటాను. ఈ కేసు ముగిసేంతవరకూ మీరు బయటి ఊర్లకు ఎక్కడికీ వెళ్ళకూడదు"

"వెళ్ళను సార్..."

"తర్వాత ఇంకో విషయం..."

"చెప్పండి సార్..."

"ఆ డ్రామా ఆర్టిస్ట్ జయంతి ఫొటో ఒకటి కావాలి నాకు. పూర్వాశ్రమంలో జయంతి ఎలాంటిది? ఏమిటీ, అన్న వివరాలు కావాలి. సొంత ఊరు, తల్లిదండ్రులెవరు? అన్నదమ్ములు ఉన్నారా? నాటకాల మోజు మధ్యలో పుట్టిందా... లేక వంశపారంపర్యంగా వచ్చిందా? ఇలాంటి వివరాలు కావాలి..."

"ఇస్తాను సార్..." అన్న కైలాష్ గొంతులో ఏదో తెలియని ఓ సన్నని జీరను వివేక్ గుర్తించాడు.

★ ★ ★

మధ్యాహ్నం మూడు గంటలు.

వన్‌టౌన్ పోలీస్ స్టేషన్‌లో వివేక్, గోకుల్‌నాథ్- దేవి పోస్ట్‌మార్టం రిపోర్టును జాగ్రత్తగా గమనిస్తున్నారు.

"ఒక విషయం స్పష్టమైపోయింది గోకుల్‌నాథ్... హత్యకు ముందు దేవి మానభంగం చేయబడలేదు. సో, హత్య దేవి పొందుకోసం కాదు. మరేదో కారణంగా

## సొలీడులెందుకు?

కాంగ్రెస్ నాయకులంతా ఓ సందర్భంలో నూలు వడుకుతున్నారు. గాంధీజీ వారి పనితనాన్ని పరిశీలిస్తున్నారు. చాలామంది వడుకుతున్న దారపు పోగులు లావుగా ఉంటే శరత్‌చంద్రుడివి



మాత్రం ఒకేమందంతో నాజూకుగా ఉన్నాయి. వెంటనే బాపూజీ, 'ఇది మీకెలా సాధ్యమైంది?' అన్నారు. దానికాయన, 'నేను మిమ్మల్ని ఎంతగానో ప్రేమిస్తు న్నందునే ఇంత చక్కగా కుదిరింది' అన్నారు. వెంటనే గాంధీజీ, 'మరి అలాంటప్పుడు నా మార్గాన్ని అంగీకరించరెందుకు?' అన్నారు. దానికి శరత్, 'బాపూజీ! స్వాంతంత్ర సాధనకు సొలీడులు కాదు కావాల్సింది.. తుపాకులు చేబూనిన నెత్తురు మండేసైనికులు కావాలి' అని చురకంటించారు

జరిగింది!"

"పొత్తికడుపులో లోతైన కత్తిపోటు వల్ల వెంటనే చనిపోయిందని చెబుతున్న ఈ రిపోర్ట్- ఒకచోట కాస్త తికమకపడ్డట్టుంది వివేక్"

"ఎక్కడ? "

"ఒంటిపై మరెక్కడైనా గాయాలున్నాయా? " అన్న ప్రశ్నకు- "ఉండొచ్చు కానీ శరీరం డీకంపోజ్ అయినందువల్ల స్పష్టంగా కనిపించటం లేదు" అన్న సమాధానం కొంత కన్‌ఫ్యూజింగ్‌గా ఉంది వివేక్. పోస్ట్‌మార్టం చేసిన డాక్టర్‌ను ఈ విషయం క్షుణ్ణంగా అడిగి తెలుసుకోవాలి..."

వివేక్ దానికి సమాధానం చెప్పేటంతలో టెలిఫోన్ మోగింది.

వివేక్ రిసీవర్‌ను అందుకున్నాడు.

"హలో..."

"హలో ఇన్‌స్పెక్టర్ ధ్యానేశ్వర్‌ను."

"చెప్పండి ధ్యానేశ్వర్!"

"మీరు అడిగిన ఆ 'వనజ' గురించిన సమాచారం కోసం దేవి వాళ్ళ అమ్మగారింటికి వెళ్లాను..."

"వివరాలు తెలిశాయా...? "

"అవును సార్. ఆ వనజ తిరుపతికి దగ్గరలోని శ్రీకాళహస్తిలో ఉంటుందట. అడ్రస్ ఇచ్చారు... నోట్ చేసుకోండి..."

వివేక్ నోట్ చేసుకున్నాడు. "థాంక్యూ మిస్టర్ ధ్యానేశ్వర్...!" రిసీవర్ క్రెడిల్ చేసి లేచి నిలబడ్డాడు వివేక్.

"గోకుల్‌నాథ్... ప్రస్తుతం మనం శ్రీకాళహస్తికి బయలుదేరుతున్నాం..."

"ఎందుకూ...? "

"దేవి స్నేహితురాలు వనజ అడ్రస్ దొరికింది. ఆమెను విచారిస్తే కేసు సాగడానికి మార్గం సులువవుతుందేమో..."

"ఇప్పుడే బయలుదేరాలా...? "

"ఈ నిమిషమే...!" అంటూ పోస్ట్‌మార్టమ్ రిపోర్ట్‌ను సొరుగులో దాచి బైక్ తాళాలు చేతిలోకి తీసుకున్నాడు వివేక్.

ఇంతలో మళ్ళీ టెలిఫోన్ మోగింది. వివేక్ రిసీవర్‌ను అందుకున్నాడు. ఫోన్‌లో విషయం విన్న వివేక్ ముఖంలో రంగులు మారాయి.

"ఎప్పుడు జరిగింది కైలాష్...? " ఆత్రుతగా అడిగాడు వివేక్.

"............"

"అలాగా...! నేనిప్పుడే వస్తున్నాను. మీరు ఇంటి బయటే నిలబడి... శవం దగ్గరకు ఎవరినీ వెళ్ళనివ్వకుండా చూడండి..."

రిసీవర్‌ను క్రెడిల్ చేసి గడ్డం గోక్కున్నాడు వివేక్.

"ఏంటి వివేక్... ఏమైంది...? "

"రేపు ఉదయం మనం శ్రీకాళహస్తికి వెళదాం గోకుల్‌నాథ్. ఇప్పుడు మనం వైకుంఠపురం వెళుతున్నాం..."

వైకుంఠపురంలోని మిలట్రీ నాయుడు గదిముందు జనం గుంపులుగా చేరి ఉన్నారు. తెరిచిఉన్న కిటికీ గుండా లోపలికి చూడ్డానికి ఒకరినొకరు తోసుకుంటున్నారు. పోలీసులను చూసేసరికి అందరూ పక్కకు తప్పుకున్నారు. యమహా దిగిన వివేక్‌నూ, గోకుల్‌నాథ్‌నూ చూసి పరుగెత్తుకొచ్చాడు కైలాష్. వివేక్ అతనితో నడుస్తూ లోగొంతుకతో అడిగాడు, "బాడీ దగ్గరకెవరూ వెళ్ళలేదు కదూ? "

"లేదు సార్..."

"మీకెప్పుడు ఈ న్యూస్ తెలిసింది...? "

"ఇరవై నిమిషాల ముందే సార్"

వివేక్ ఆ చిన్నగది తలుపు దగ్గరికి వెళ్ళి దాన్ని నెట్టాడు. అది కిర్రుమంటూ చప్పుడు చేస్తూ తెరుచుకుంది.

గది మధ్యలో మిలట్రీ నాయుడు శవమై కనిపించాడు. భయంతో అతడి కళ్ళు, నోరూ తెరుచుకుని ఉన్నాయి. ఛాతీ



పైనా, కడుపుపైనా రక్తం మడుగు.. పేగులు బయటికి కనిపిస్తున్నాయి.

అతను ఉపయోగించే ఊతకర్రలే అతని మరణానికి కారణమైనట్టు తోస్తోంది. క్రూరంగా చంపబడ్డాడు. ఊతకర్రల చివర రక్తం గడ్డకట్టి ఉంది. చూస్తున్న వివేక్ పిడికిళ్ళు ఆవేశంతో బిగుసుకున్నాయి.




దారుణ హత్యకు గురైన మిలట్రీ నాయుడి శవంపైనుండి చూపులను పక్కకు సారించాడు వివేక్. పక్కనున్న గోడలపైన, నేలపైన రక్తం చిందిపడి ప్రస్తుతం దాని రంగుమారిపోయి కనిపించింది. ఒక మూల త్రాగు నీటికోసం ఉపయోగించే ఒక చిన్న కూజా కిందపడిపోయి ఉంది. దాని పక్కనే ఓ గ్లాసు కూడా పడుంది.

తన పక్కనే నిలబడున్న కైలాష్ వైపుకు తిరిగి అడిగాడు వివేక్, "మీకీ విషయాన్ని ఎవరు చెప్పారు? "

"ఎవరూ చెప్పలేదు సార్. చిరాకుగా ఉండి మధ్యాహ్నం తర్వాత ఆఫీసులో పర్మిషన్ తీసుకుని ఇంటికొచ్చేశాను. వీధంతా గుంపులు గుంపులుగా జనాలు .. విషయం ఏమిటని విచారిస్తే మిలట్రీ నాయుణ్ణి ఎవరో చంపేసినట్టు చెప్పారు. పరుగెత్తికెళ్ళి చూశాను. వెంటనే మీకు ఫోన్ చేశాను..."

"బాడీ కండిషన్, రక్తం గడ్డకట్టి ఉన్న తీరూ చూస్తోంటే ఈ సంఘటన నిన్న రాత్రి జరిగినట్టుగా అనిపిస్తోంది... బాడీని మొదట చూసింది ఎవరు...? "

వివేక్ కైలాష్‌ను అడగ్గా- కైలాష్ గది బయటున్న గుంపును ఉద్దేశించి అరిచాడు. "నాయుడి శవాన్ని మొదట చూసింది ఎవరు? చూసినవాళ్ళు వచ్చి చెప్పండి..."

జనాల్లో గుసగుసలు బయలుదేరాయి. మరునిమిషమే పూర్తిగా నెరిసిపోయిన జుట్టుతో ఉన్న ఒక ముసలమ్మను లాక్కొచ్చి వివేక్ ముందు నిలబెట్టారు.

"ఈ ముసలమ్మే సార్ మొదట మిలట్రీ నాయుణ్ణి చూసి వచ్చి వీధి వీధంతా గగ్గోలు పెట్టేసింది..."

వివేక్ ఆ ముసలమ్మను చూశాడు.

"మీ పేరేమిటమ్మా? "

"మంగమ్మ" ముసలమ్మ జవాబిచ్చింది.

"మొదట నువ్వా శవాన్ని చూసింది? "

"ఔనండి"

"నాయుడింటికి ఎందుకు వచ్చావు? "

"అయ్యా- నేను రోడ్డు పక్క ఇడ్లీలు, దోసెలు అమ్ముకునేదాన్ని. నాయుడు ఉదయం ఎనిమిది గంటలకల్లా నా అంగడికొచ్చి టిఫిన్ తినివెళ్ళేవాడు. ఇడ్లీలు మిగిలిపోతే వాటినే మధ్యాహ్నమూ తినేవాడు. ఈ రోజు ఉదయమూ టిఫిన్‌కి రాలేదు, మధ్యాహ్నమూ రాలేదు. ఒంట్లో ఏమైనా సుస్తీ చేసిందేమోనని- చూడ్డానికి వచ్చానండి! తలుపు దగ్గరగా వేసుంది. కిటికీ గుండా లోపలికి చూశాను. చూస్తే ఇంకేముంది! నాయుడు రక్తపు మడుగులో పడున్నాడు" అలా మాట్లాడుతూ ఉండగానే ముసలమ్మ గొంతు జీరబోయింది. జలజలమంటూ కన్నీళ్ళు ఉబికాయి. పెద్దగా ఏడవడానికి ప్రయత్నించింది.

"సరే నువ్వెళ్ళు" ముసలమ్మను పంపేసి గోకుల్‌నాథ్‌వైపు తిరిగాడు వివేక్.

"వివేక్.. వీధిలో గుంపు పెరుగుతోంది.

పోస్ట్‌మార్టమ్ ఏర్పాట్లు చెయ్యనా.? ఫోరెన్సిక్ సిబ్బందికి ఫోన్ చేశాను, ఇంకాసేపట్లో రావచ్చు"

ఊఁc కొడుతూ తన చూపుల్ని గది ఎడమవైపునకు సారించాడు వివేక్. అక్కడ... గది మూలగా.. తళుక్కుమని- ఒక చిన్న గాజు ముక్క- నల్లగా కనిపించింది, దగ్గరి కెళ్ళి చూశాడు. విరిగిన కూలింగ్ గ్లాస్ ముక్క అది. కర్చీఫ్‌తో దాన్ని తీశాడు. అంతలో వెనకనుండి కైలాష్ గొంతు..

"ఏంటిసార్ కూలింగ్ గ్లాస్ పీసా? "

వివేక్ దాన్ని చూపిస్తూ అడిగాడు, "నాయుడు కళ్ళద్దాలు వాడేవాడా...? "

"నాయుడు అద్దాలు వాడగా నేను చూళ్ళేదు సార్"

"నాయుడితో సన్నిహితులు ఎవరు? "

"ఆయన ఈ వీధిలోని అందరితోనూ బాగానే ఉండేవాడు. పిల్లలు 'సిపాయి మావయ్య' అని చనువుగా పిలిచేవారు. పెద్దలు 'కేప్టెన్' అని పిలుస్తారు"

వివేక్, కైలాష్ బయటికొచ్చారు. అక్కడి గుంపు వారి రాకతో తప్పుకున్నారు. ఇద్దరూ కాస్త ఎడంగా నిల్చున్నారు.

"కైలాష్...నిన్న రాత్రి మీతో మాట్లాడినపుడు మీ భార్య దేవి బ్లడ్ గ్రూప్ ఏమిటో డాక్టర్‌ను అడిగి తెలుసుకుని ఇన్‌ఫార్మ్ చెయ్యేమని చెప్పాను. కానీ మీరు ఇంతవరకూ ఇన్‌ఫార్మ్ చెయ్యలేదు...? "

"ఆ డాక్టర్ ఊళ్ళోలేదు సార్...!"

"వెళ్ళి చూశారా...? "

"క్లినిక్‌కు వెళ్ళి చూశాను. ఎవరో బంధువుల పెళ్ళికి వెళ్ళినట్టు చెప్పారు..."

"ఆ విషయం నాకు ఫోన్‌చేసి చెప్పి ఉండొచ్చుకదా? "

కైలాష్ ఒక్క క్షణం మౌనం వహించి గడ్డంపై రాసుకుంటూ అన్నాడు: "సారీ సార్, మర్చిపోయాను!"

"ఆ డ్రామా ఆర్టిస్ట్ జయంతి వివరాలు అడిగాను. ఏం? ట్రై చెయ్యలేదా...? "

"మాటల సందర్భంలో జయంతిని అడిగాను. జయంతి వాళ్ళ ఊరు- తమిళనాడులోని తిరుత్తణి అట! వాళ్ళ అమ్మ మాత్రం ఊళ్ళో ఉందట. నాన్న ఎవరో తెలియదట. ఒకే ఒక చెల్లెలు, పేరు సుమతి. ఆమె సినిమాల్లో నటించేందుకు మద్రాస్, హైదరాబాద్ అంటూ తిరుగుతోంది" కైలాష్ పూర్తిచేయకముందే వివేక్ అడ్డు తగిలి అడిగాడు:

"జయంతికి అన్నదమ్ములు లేరా? "

"అన్న ఉన్నాడని చెప్పింది. అయితే, నేనింతవరకూ అతణ్ణి చూళ్ళేదు సార్..."

కైలాష్ అలా అంటూ ఉండగానే మార్చురీ వ్యాన్ అక్కడికి వచ్చింది. వివేక్ గోకుల్‌నాథ్‌కేసి నడిచాడు.

సాయంత్రం ఐదు గంటలు కావస్తోంది. సూర్యుడు పడమటి దిక్కున అస్తమిస్తున్నాడు. శ్రీకాళహస్తివైపు వెళ్ళే రహదారిపై వివేక్ డ్రైవ్ చేస్తున్న యమహా వేగంగా దూసుకెళుతోంది. వెనుక గోకుల్‌నాథ్ స్థిమితంగా కూర్చుని ఉన్నాడు.

"దేవిని హత్యచేసిన వాళ్ళే మిలట్రీ నాయుణ్ణి కూడా హత్య చేసుంటారని నేను అనుకుంటున్నాను...!" అన్నాడు వివేక్.

"ఎలా అనుకుంటున్నారు వివేక్...? "

"మిలట్రీ నాయుడు- దేవి హత్యచేయబడ్డ రాత్రి ఆమె ఇంటి ముందునుండి వెళ్ళడం జరిగింది. దేవి ఇంట్లో పెట్టెకు చీలలు కొడుతున్న శబ్దాన్ని నాయుడు విన్నాడు. మనిషిని చూశాడేమోనన్న సందేహం హంతకుడికి కలిగింది. సో, నాయుణ్ణీ చంపేశాడు... హంతకుడు మన వెనుకే తచ్చాడుతున్నాడు గోకుల్‌నాథ్"

గోకుల్‌నాథ్ దీర్ఘంగా విశ్వసించాడు.

"దేవి హత్య విషయంలో ఊపిరి సలపనంతగా తలమునకలయ్యుంటే ఇప్పుడీ నాయుడి కేసు ఒకటి వచ్చి పడింది"







"ఈ నాయుడి హత్యలో దొరికిన ఒకే ఒక క్లూ... ఆ కూలింగ్ గ్లాస్ పీస్ ఒక్కటే... దాని ఆధారంగానే కేసును ముందుకు నడిపించాలి. దేవి హత్య ఎంతో కన్‌ఫ్యూజన్‌గా ఉంది. దేవి హజ్ బెండ్ కైలాష్ విషయంలో మనం ముందుకూ వెనక్కూ ఊగిసలాడుతున్నాం. హైదరాబాద్ వెళ్ళినవాడు రహస్యంగా ఫ్లైట్‌లో వెనక్కొచ్చి దేవిని హత్యచేసి... పార్శిల్ చేసి- మళ్ళీ ఏమీ ఎరగనట్టు హైదరాబాద్ వెళ్లాడేమో"

గోకుల్‌నాథ్ కావచ్చున్నట్టు తల ఊపాడు.

"అతని చూపులూ, మాటలూ సరిగాలేవు వివేక్. అతడు హైదరాబాద్‌లో ఉన్న రోజుల్ని అణువణువూ శోధించాలి. ప్రతి రోజూ ఎక్కడికెళ్ళిందీ, ఎవర్ని కలిసిందీ, రాత్రిళ్ళు ఎవరితో గడిపిందీ ఇలాంటి వివరాలన్నీ సేకరించాలి... అతడు తప్పుచేసుంటే ఎక్కడైనా దొరక్కపోతాడా? "

"ఇవాళ మధ్యాహ్నం నేను కైలాష్‌తో మాట్లాడుతున్నప్పుడు అతడొక సమాచారం అందించాడు. జయంతికి ఒక అన్న ఉన్నాడట, కానీ కైలాష్ ఇంతవరకూ చూళ్ళేదట. ఈ సమాచారం మనకు ఉపయోగపడేలా ఉంది. సాధారణంగా ఈ 'చిన్నిల్లు' బామ్మర్దులు 'పెద్దింటి అమ్మ'గారిపై అసూయతో రగిలిపోతుంటారు. ఆ అసూయ కొద్దికొద్దిగా పెరుగుతూ ఘర్షణలు, హత్యలు వరకూ వెళ్ళొచ్చు అదేవిధంగా దేవి విషయంలో ఎందుకు జరిగి ఉండకూడదు...? "

"ఈ కేసులో కార్నర్స్ ఎక్కువ ఉన్నాయి వివేక్. ఇప్పుడు మనం కలుసుకోబోతున్న వనజ ఏదన్నా కొత్త సమాచారం చెప్పి కేసును వెలుగులోకి తీసుకురావచ్చు ఈ కేసుకు వనజే ఒక విటమిన్ మాత్ర..."

★ ★ ★

తలుపు వద్ద ఆ యువతి వయ్యారంగా నిలబడుంది. ఆనాటి వైజయంతిమాల పోలికలు కనిపిస్తున్నాయి. ఆఫీసునుండి వచ్చే భర్తకోసం మేకప్ కాస్త ఎక్కువే వేసుకున్నట్టుంది. కట్టుకున్న చీరకు మ్యాచింగన్నట్లు అదేరంగులో బొట్టు పెట్టుకుంది. తలనిండా మల్లెపూలు తురుముకుంది. వివేక్‌నూ, గోకుల్‌నాథ్‌ను చూశాక ఆ కాటుక కళ్ళల్లో ఆశ్చర్యం తొంగిచూసింది.

వివేక్ నవ్వుతూ అడిగాడు "ఇక్కడ మిసెస్ వనజ అంటే ఎవరు"

"నేనే...!"

"మేము పోలీస్ డిపార్టుమెంట్ నుండి వస్తున్నాం, మీతో కొంచెం మాట్లాడాలి"

వనజ పక్కకు తప్పుకొని ఇంట్లోపలికి దారి తీసింది. కుర్చీలను చూపించి కూర్చోమని, తానూ ఒక కుర్చీలో కూర్చుంది. ఆమెలో భయపడుతున్న ఛాయలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

వివేక్ గొంతు సవరించుకొని అడిగాడు:

"పేపర్లో మీ స్నేహితురాలు దేవిని గురించిన న్యూస్ చదివారా వనజా? "

"చదివాను" కొంగు వేలికి చుట్టుకుంటూ అంది.. చూపులు నేలమీదే ఉన్నాయి. పదేపదే గుటకలు మింగుతోంది.

"మీరేమనుకుంటున్నారు...? "

"నాకేం చెప్పాలో తెలియటం లేదు... పేపర్లో న్యూస్ చదివాక ఆ రోజంతా ఏడుస్తూ కూర్చున్నాను"

"మీరేమైనా దేవికి ఉత్తరం రాశారా? "

"పది రోజులకు ముందు రాశాను..."

"ఈ లెటరే కదూ? " కైలాష్ తెల్లకాగితంపై గమ్‌తో అతికించిన ఇన్‌లాండ్ లెటర్‌ను చూపించాడు వివేక్.

వనజ దాన్ని విప్పి చూసి 'ఔనంది'.

అప్పుడప్పుడూ వీధివైపు దృష్టి సారిస్తోంది. దాన్ని గమనించి వివేక్ అడి

గాడు, "ఏం? అలా వీధివైపు చూస్తున్నారు? ఎవరైనా రావాలా? "

"మావారు వచ్చే సమయమైంది. ఆయన అదోలాంటి మనిషి. పోలీసులు... విచారణ.. ఇలాంటివన్నీ అలర్జీ ఆయనకు. గట్టిగా కేకలు వేస్తారు నన్ను"

ఆ మాటలకు వివేక్ నవ్వాడు.

"తప్పు చేసే వాళ్ళకే కదా పోలీసులంటే అలర్జీ. దేవి మీ స్నేహితురాలు. ఆమె హత్యకు కారకులైన వారిని కనిపెట్టడంలో మీరు సాయపడ్డంలో తప్పేమిటి? "

"మీకు నేనెలా సాయపడగలను? "

"మా ప్రశ్నలకు సరైన సమాధానాలు చెప్పారంటే అంతే చాలు..."

"ఎలాంటి ప్రశ్నలు...? "

"మీరిద్దరూ ఒకే కాలేజీలో చదివారా? "

"ఔను..."

"ఏ కాలేజ్...? "

"పద్మావతీ కాలేజ్..."

"దేవికి మీరొక్కరే డియరెస్ట్ ఫ్రెండా? "

"నాకన్నా డియరెస్ట్ స్వస్తికా!"

వివేక్ కుతూహలంగా అడిగాడు.

"స్వస్తికా...? ఎవరామె...? "

"ఆమె ఊరు మదనపల్లి. హాస్టల్లో ఉండి చదువుకునేది. దేవి నాకన్నా దానితోనే సన్నిహితంగా ఉండేది"

"ఆ స్వస్తికా ఇప్పుడెక్కడుంది? "

"టీచర్ ట్రైనింగ్ పూర్తిచేసి కుప్పంలో ఏదో స్కూల్లో చేస్తోంది. మొన్న ఉగాదికి ఆ స్కూల్ చిరునామాతో నాకు గ్రీటింగ్ కార్డ్ కూడా పంపింది..."

"ఆమె చిరునామా మీ దగ్గరుందా...? "

"ఒక్క నిమిషం" అంటూ వనజ లోపలికెళ్ళి ఓ పాత కవరుతో తిరిగొచ్చింది.

దాన్ని తీసుకుని చూశాడు వివేక్, ఫ్రమ్ అడ్రస్‌లో రాసిన ముత్యాల్లాంటి అక్షరాల వెంట అతడి చూపులు పరుగెత్తాయి.

వివేక్ ఆ చిరునామాను నోట్ చేసుకొని కవర్‌ను మళ్ళీ వనజకు ఇచ్చేశాడు.

**కొత్తగాలి...**

**ఎన్నికల ముందు**
**వాడు**
**కాళ్ళు పట్టుకుంటాడు**
**అయ్యాక**
**పీకట్టుకుంటాడు**

-యలమర్తి అనూరాధ, పెనుగొండ

"దేవిని చూడ్డానికి గానీ, మిమ్మల్ని చూడ్డానికి గానీ ఎప్పుడైనా స్వస్తికా కుప్పం నుండి వచ్చేదా...? "

"ఊహూఁ" వనజ తల అడ్డంగా ఊపింది.

"స్వస్తికాకు వివాహమైందా...? "

"కాలేదు..."

"దేవి భర్త కైలాష్‌ను గురించి మీరేమనుకుంటున్నారు...? "

"అతడి నడవడిక సరిగాలేదని దేవి అప్పుడప్పుడూ ఉత్తరాలు రాసేది. ఓదారుస్తూ ఉత్తరాలు రాసేదాన్ని. అంతే!"

"దేవి హత్యకు ఎవరు కారకులై ఉండొచ్చని మీరనుకుంటున్నారు వనజా? "

వనజ సమాధానమేమీ చెప్పకుండా తాను కూర్చొని ఉన్న కుర్చీ అంచుల్ని వేళ్ళతో రాస్తూ ఉండిపోయింది.

"ఊఁ... చెప్పండి... మీకు ఎవరిపైనన్నా అనుమానం ఉందా? అతనెవరైనా ఫరవాలేదు... చెప్పండి..." వివేక్ చెప్పమని ప్రోత్సహించాడు.

కొద్ది క్షణాల మౌనం తర్వాత -వనజ నోరు తెరిచింది. చాలా సన్నని గొంతులో జవాబిచ్చింది.

"దేవిని ఆ కృపాకరే చంపి ఉంటాడు."

వనజ చెప్పింది విన్నాక వివేక్, గోకుల్‌నాథ్‌లిద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. వివేక్ వెంటనే తేరుకొని అడిగాడు. "కృపాకరా? అతనెవరూ...? "



"వాడొక లక్షాధికారి. లోఫర్ సార్... కాలేజీ రోజుల్లో దేవి దగ్గర చాలాసార్లు తోకాడించాడు... 'కాలేజ్ డే' రోజు జరిగిన ఆ సంఘటన నేనిప్పటికీ మర్చిపోలేను. ఫంక్షన్ ముగిసాక... ఆ రాత్రి పది గంటల తర్వాత కాలేజ్ నుండి బయటపడ్డాం. అదే సమయ్ఘంలో రోడ్డుకు అటు ప్రక్కన చెట్టు కింద బైక్‌తో నిలబడి ఉన్నాడు కృపాకర్. బైక్‌ను స్టార్ట్ చేసి వేగంగా మా వైపుకు దూసుకొచ్చాడు. మేము పక్కకు తప్పుకునేలోపే వాడు దేవి ముఖంపై రంగు చల్లి మాయమయ్యాడు. దేవి ఆ సంఘటనను ఈజీగా తీసుకుని వదిలేసుంటే బావుండేది. కానీ... ఆ విషయాన్ని అది సీరియస్‌గా తీసుకుంది..."

"ఏం చేసింది?" వివేక్ అడిగాడు.

"సరాసరి ఆటోలో డీఎస్పీ ఆఫీసుకెళ్ళింది. ఆ సయమంలో ఉన్న డీఎస్పీ ఒక మహిళ. ఆమె ఎంతో ధైర్యవంతురాలిగా పేరు తెచ్చుకుంది. తిరుపతిలోని వీధి రౌడీలందరూ ఆ సమయంలో తోకలు ముడిచి ఉన్నారు. నేరుగా ఆవిడ దగ్గరికెళ్ళి దేవి కంప్లయింట్ చేయటంతో వ్యవహారం పెద్దదైపోయింది. ఆ రోజు రాత్రి డిఎస్పీ బలగంతో వెళ్ళి నిద్రపోతున్న కృపాకర్‌ను లాఠీతో కొడుతూ, బట్టల్ని ఊడదీయించి అండర్‌వేర్‌తో వీధుల వెంట తిప్పి లాక్కెళ్ళి లాకప్‌లో పడేసింది"

గోకుల్‌నాథ్ నవ్వుతూ అడ్డుపడ్డాడు-

"నాకీ సంఘటన గుర్తుంది. అతనో పెద్ద సారా కాంట్రాక్టర్ కొడుకు కదూ? !"

"ఔనండీ..."

"తర్వాత ఏమైంది.. కృపాకర్ లాకప్ నుండి బయటపడ్డాడా?"

"మరుసటిరోజు సాయంత్రం ఐదు గంటలకు బయటికొచ్చాడు. కాలేజ్ గేట్ బయట నిలబడి- "పిరికి పందా...! నన్ను అవమానించిన నిన్ను ఎక్కువ రోజులు బ్రతకనివ్వను.

ఈరోజు కాకపోతే ఏరోజైనా నీ బట్టలు ఊడదీయించి నగ్నంగా ఊరంతా తిప్పక పోతే నాపేరు కృపాకరే కాదు" అంటూ కేకలు పెట్టాడు. తర్వాత నేను మళ్ళీ అతణ్ణి చూడనేలేదు..."

"ఈ సంఘటన జరిగి ఎన్నాళ్ళైంది..?"

"రెండేళ్ళ పైనే!"

"ఇలాంటి ఒక సంఘటన జరిగినట్టు దేవి భర్తకు తెలుసా?"

"దేవి చెప్పే ఉంటుందని నేను అనుకుంటున్నాను సార్..."

"ఆ సంఘటన తర్వాత ఎక్కడైనా మీరు కృపాకర్‌ను చూశారా...?"

"చూళ్ళేదు సార్..."

"కృపాకర్ అడ్రస్ మీకు తెలుసా...?"

వనజ తిరుపతిలోని కృపాకర్ చిరునామా చెప్పింది. దాన్ని నోట్ చేసుకొని "థాంక్స్" చెప్పి బయటపడ్డారిద్దరూ.

★ ★ ★

"ఎవరు కావాలి...?"

"ఇంట్లో ఎవరున్నారు...?"

"అయ్యగారూ, అమ్మగారూ ఉన్నారు..!"

"ఇద్దర్నీ రమ్మని చెప్పండి" వివేక్ అక్కడున్న చెయిర్లో కూర్చున్నాడు. పనిమనిషి గోకుల్‌నాథ్ యూనిఫామ్‌ను చూస్తూ వేగంగా లోపలికెళ్ళాడు.

వివేక్ గోకుల్‌నాథ్‌ను అడిగాడు.

"వనజను కలిశాకే కేసుకు ప్రాణం వచ్చింది. ఈ కృపాకర్ వ్యవహారం అటు కైలాష్ చెప్పలేదు, ఇటు దేవి తల్లిదండ్రులూ చెప్పలేదు. ఆ సంఘటన వాళ్ళకు తెలియదా...? లేక మరిచిపోయారా?"

"కైలాష్‌కు తెలిసుంటే చెప్పి ఉండేవాడు. దేవి తల్లిదండ్రులు ఆ విషయాన్ని పూర్తిగా మరచిపోయి ఉండొచ్చు వివేక్" ఇంతలో ఎవరో వస్తున్న శబ్దం వినిపించింది. వివేక్ అటు చూపు సారించాడు.

మధ్య వయస్సులో ఉన్న ఒక వ్యక్తీ,





## కొత్తగాలి...

**సంగీత నిధితో**
**మిలియనీర్లకు మిలియనీర్.**
**జయహో రహమాన్**
**స్లమ్‌డాగ్ మిలియనీర్!**

– గుడిమెట్ల గోపాలకృష్ణ, శ్రీకాకుళం.

అతని వెనుక అతని భార్యా కనిపించారు. ఇద్దరిలోనూ ధనమదం అణువణువూ తాండవిస్తోంది.

"రండి ఇన్‌స్పెక్టర్..." నవ్వుతూ ఆహ్వానించాడు ఆ పెద్దాయన. వెనక నిలబడున్న అతడి భార్య మొహం వాడిపోయి కనిపించింది.

"ఏం పనిమీద వచ్చారో తెలుసుకోవచ్చా..?" పెద్దాయన ప్రశ్నకి వివేక్ నోరు విప్పాడు.

"కృపాకర్ ఫాదరా మీరు...?"

"ఔను..."

"అతన్ని కాస్త పిలుస్తారా...?"

"ఏంటి విషయం..."

"ప్లీజ్ పిలుస్తారా...? అతనొచ్చాక అతనిముందే అన్ని వివరాలూ చెబుతాం"

"సారీ! ఇంట్లో లేడు. స్విస్ వెళ్ళాడు"

వివేక్ ఉలిక్కిపడ్డాడు. "స్విస్ వెళ్ళాడా? యు మీన్ స్విట్జర్లాండ్...?"

"యస్..."

"ఎప్పుడు వెళ్ళాడు...?"

"ఇరవై రోజులు కావస్తోంది..."

"ఏం పనిమీద వెళ్ళాడు...?"

"హనీమూన్...! గత నెలలో కృపాకర్‌కు మేరేజ్ అయింది. కవితా మిల్స్ రంగనాథ్‌గారి అమ్మాయితో పెళ్ళి జరిగింది. పెళ్ళై పది రోజులయ్యాక రంగనాథ్ కూతుర్నీ, అల్లుణ్ణీ సొంత ఖర్చుతో స్విస్‌కు పంపాడు. వారంరోజుల్లో తిరిగొచ్చేస్తారు. ఇప్పటికైనా కృపాకర్‌ను ఎందుకు అడుగుతున్నారో నేను తెలుసుకోవచ్చా..?"

వివేక్ ముఖంలో తాము మోసపోయామన్న భావం కదలాడింది. గోకుల్‌నాథ్ ఆ పెద్దాయనతో అన్నాడు-

"మీకు దేవి తెలుసా...?"

"దేవి అనే అమ్మాయా...?"

"రెండేళ్ళ క్రితం మీ అబ్బాయి ఒక కాలేజ్ అమ్మాయి దగ్గర తోకాడించి... డిఎస్పీ చేతిలో అవమానం పొందడం మీరు మరచిపోలేదనే అనుకుంటున్నాం"

ఆయన ముఖం మాడిపోయింది.

"ఔను... చెప్పండి..."

"మీ అబ్బాయి అల్లరిపెట్టిన అమ్మాయి పేరే దేవి..."

"ఆ దేవికి ఏమైంది ఇన్‌స్పెకర్? మళ్ళీ ఏమైనా కంప్లైంట్ చేసిందా?"

"నో... ఆ అమ్మాయిని ఎవరో హత్య చేశారు. ఆ కేసు విచారణలో మీ అబ్బాయి సంగతి బయటపడింది"

కాసేపటికంతా ఆ టెన్షన్ నుండి బయటపడి ఆ పెద్దాయన అన్నాడు "ఆ అమ్మాయి హత్యకు సంబంధించి మా వాణ్ణి సందేహిస్తున్నారా...?"

వివేక్ చప్పున లేచి నిలబడి అన్నాడు.

"మేము ఈ ఇంటిలోపలికి ప్రవేశిస్తున్నప్పుడు ఆ అనుమానంతోనే వచ్చాము. కానీ ఇప్పుడు తీరిపోయింది. మీ అబ్బాయీ కోడలూ ఏ తారీఖున స్విస్‌కు వెళ్ళారో చెప్పగలరా...?"

"గత నెల 21వ తేదీన వెళ్ళారు" అతడు చెప్పేలోపు అతడి భార్య చెప్పింది.

వివేక్ ఆ తేదీని డైరీలో నోట్ చేసుకొని, వాళ్ళను ఇబ్బంది పెట్టినందుకు సారీ చెప్పి బయటకొచ్చాడు.

"వివేక్..."

"ఊఁ..."

"మొదటి ఓవర్ మొదటి బంతికే క్లీన్ బౌల్డ్ అయినట్టుంది..."

"విచారించకండి గోకుల్‌నాథ్... మన దగ్గర ఇంకో వికెట్ ఉంది"

"అవును 'స్వస్తికా'! కానీ నాకెందుకో నమ్మకం కలగటం లేదు వివేక్. ఈ కేసు... చీకటి గదిలో గంతలు కట్టుకొని నల్లపిల్లికోసం వెదికినట్టుంది" అన్నాడు.

స్టేషన్ బయట యమహా ఆగింది.

స్టేషన్ లోపలికి వెళుతుండగా బయటున్న కానిస్టేబుల్ వివేక్‌తో అన్నాడు.

"సార్ మిమ్మల్ని కలవాలని ఓ వ్యక్తి రెండుగంటల నుండి వెయిటింగ్"

"ఎవరతను...?"

"చిత్తూరు నుండి వచ్చాడట... పేరు మోహన్ అని చెప్పాడు"

వివేక్, గోకుల్‌నాథ్‌లిద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకొని లోపలికెళ్లారు. కుర్చీలో కూర్చొని ఉన్న మోహన్ లేచి నిలబడ్డాడు. తలకు బ్యాండేజ్ ఉంది. ఎర్రటి మొహంలో విషాదఛాయలు.. మాసిన గడ్డం... కళ్ళలో శోకం గోచరిస్తోంది.

"కూర్చోండి మిస్టర్ మోహన్"- వివేక్ అలా అనగానే, అతడు మళ్ళీ కుర్చీలో కూర్చుంటూ అన్నాడు,

"చిత్తూరు ఎస్సై ధ్యానేశ్వర్ మిమ్మల్ని కలవమని చెప్పారు సార్"

"అన్ని విషయాలూ మీకు తెలిసే వచ్చారు కదూ...?"

"ఔను సార్..."

"గత సోమవారం రాత్రి బిజినెస్ విషయంగా షిమోగాకు వెళ్తున్నట్టు ఇంట్లో చెప్పి వెళ్లారుట. కానీ మీరు షిమోగాకు వెళ్లలేదట... ఎందుకూ...?"

మోహన్ గడ్డం తడుముకుంటూ "సార్... గత సోమవారం రాత్రి నేను షిమోగాకే బయలుదేరాను. నేను వెళ్ళిన బస్సు హొసూరు వద్ద ఒక చెట్టుకు ఢీకొని ఆక్సిడెంట్‌కు గురైంది. బస్సులో ముందు సీట్లో కూర్చున్న నాకు తలకు బలంగా దెబ్బ తగిలినందువల్ల స్పృహ కోల్పోయాను. ఆ స్థితిలోనే నాలుగైదు రోజులు ఉన్నానట. నిన్న ఉదయానికి గానీ స్పృహలోకి రాలేకపోయాను. ఆక్సిడెంట్ జరిగినచోట, మాకు సహాయం చెయ్యడానికి వచ్చిన ఆ ఊరి గ్రామస్థుల్లో ఎవరో నా సూట్‌కేస్ దొంగిలించినందువల్ల నా గురించిన ఎలాంటి వివరాలూ తెలియక నాకు ఆసుపత్రిలోనే ట్రీట్‌మెంట్ ఇస్తూ వచ్చారు... మా ఇంటి చిరునామా తెలియనందువలన నా విషయాలు మావాళ్ళకు తెలియజేయలేకపోయారు" మోహన్ తన మాటల్ని పూర్తిచేయక మునుపే వివేక్ అడ్డుపడి అడిగాడు:

"మీరు ప్రయాణించింది ఏ బస్‌లో?"

"కర్ణాటక ఆర్‌టిసి బస్‌లో. నెంబర్... ఆక్సిడెంట్ గురించిన సమాచారం మీరు డిపోలో అడిగి తెలుసుకోవచ్చు సర్..." వినయంగా పలికాడు మోహన్.

"అదలా ఉంచండీ.. మీరు దేవిని చివరిసారిగా ఎప్పుడు చూశారు...?"

"వారం క్రితం చూశాను సార్. అంటే షిమోగాకు వెళ్లక మునుపు..."

"ఎక్కడ చూశారు..."

"ఇక్కడే, దేవి వాళ్ళ ఇంట్లో"

"మీరు దేవిని కలిసి మాట్లాడ్డం కైలాష్‌కు తెలుసా...?"

"నేను దేవిని చూడ్డానికి వెళ్ళినప్పుడల్లా అతడు ఇంట్లో ఉండేవాడు కాదు. కైలాష్‌ను నేను పెళ్ళిలో చూశానంతే! తర్వాత నేను అతన్ని చూడ్డం జరగలేదు"

"దేవికీ మీకూ మధ్య సంబంధం ఎలాంటిదో చెప్పగలరా? ఇల్లీగల్ అయినా సరే ధైర్యంగా చెప్పండి"

మోహన్ బాధగా అన్నాడు, "నో సార్! మీరనుకునే సంబంధం ఏదీ మా మధ్యలో లేదు. నేనూ దేవీ మంచి స్నేహితులం. ఒకే ఆఫీసులో ఉద్యోగం చేశాం. ఆకర్షణ,



కామోద్రేకం మా మధ్య ఎప్పుడూ కలగలేదు. ఇతరులు మమ్మల్ని తప్పుగా అర్థం చేసుకున్నా బాధపడలేదు. దేవికి పెళ్ళి నిశ్చయమైనపుడు అందరూ ఆశ్చర్యపోయారు. మేమిప్పటికీ మంచి స్నేహితులుగానే ఉంటున్నాం..."

"అంటే... మీకూ దేవికీ మధ్య మరో రకమైన దగ్గరితనం లేదంటారు...?"

"కచ్చితంగా లేదు సార్...!"

"దేవి హత్యకు కారణం ఏమై ఉంటుందని మీరనుకుంటున్నారు...?"

"నాకేం చెప్పాలో అర్థం కావటంలేదు సార్. అయితే పెళ్ళి అయ్యాక పాపం దేవి సంతోషంగా లేదు. అప్పుడప్పుడు- 'ఏదో ఒకరోజు నేను ఆత్మహత్య చేసుకున్నట్టు న్యూస్ రావచ్చు. అప్పుడు ఆశ్చర్యపడొద్దు మోహన్' అంటుండేది"

"ఎందుకలా? కారణం అడిగారా?"

"అడిగాను.. అందుకు ఆమె 'అనుమానపు మొగుడితో ఎన్నాళ్ళు సంసారం చేయగలను? గ్యాస్ సిలిండరూ, నేనూ ఏదో ఒకరోజు ఒకటిగా పేల్తాం చూడూ' అని చెప్పేది..."

"కైలాష్ దేవిని కొట్టేవాడటనా...?"

బాధగా నవ్వాడు మోహన్. "కైలాష్ మూర్ఖుడు సార్. చేతికి ఏది దొరికితే దానితో కొట్టేవాడట. ఓసారి నేను దేవిని చూడ్డానికి వెళ్ళినప్పుడు, నడుము పట్టేసి లేవలేక పడుకోనుంది. కారణం అడిగితే, 'నా నడుముకూ, మా వారి కుడి కాలుకూ కాస్త మనస్తాపం కలిగిందిలే' అని నవ్వింది. దేవికి ఏదైనా అపాయం కలిగిందీ అంటే అది కచ్చితంగా దేవి హజ్‌బెండ్ కైలాష్ మూలంగానే అయి ఉంటుంది సార్..." మోహన్ కంఠం స్థిరంగా పలికిన అదే సమయంలో బల్లపైనున్న ఫోన్ మ్రోగింది. వివేక్ రిసీవర్ అందుకొని "హలో" అన్నాడు.

అటునుంచి మాట్లాడుతుంటే వివేక్ ముఖంలో రంగులు మారసాగాయి.




వివేక్ ఎదురుగా కూర్చుని ఉన్న ఇన్‌స్పెక్టర్ గోకుల్‌నాథ్- వివేక్ రిసీవర్ పెట్టేంతవరకూ ఆగి, తర్వాత అడిగాడు-

"ఏంటి వివేక్.. ఏదైనా ముఖ్యమైన విషయమా?"

"చాలా ముఖ్యమైన విషయం... 'ఓకె మిస్టర్ మోహన్, మీరు ఇక బయలుదేరండి! అవసరమైతే మిమ్మల్ని పిలిపిస్తాను' అని మోహన్‌తో చెప్పి గోకుల్‌నాథ్‌కు సైగచేసి స్టేషన్ బయటకు వెళ్ళాడు వివేక్. యమహాను స్టార్ట్ చేసి కూర్చున్నాడు. గోకుల్‌నాథ్ వెనుక కూర్చున్నాక బండిని ముందుకు పోనిస్తూ అన్నాడు:

"గోకుల్‌నాథ్! ఫోన్ ఎవరి దగ్గర నుండో తెలుసా...?"

"కైలాష్ చేసుండొచ్చు...?"

"నోనో జయంతి ఇంటిని వాచ్ చెయ్యమని నియమించిన కానిస్టేబుల్ కనకరాజు... ఫోన్ చేశాడు"

"ఏంటట విషయం...?" ఆసక్తిగా అడిగాడు గోకుల్‌నాథ్.

"పది నిమిషాల ముందు జయంతి ఇంటికి ఎవరో ఒక అపరిచిత వ్యక్తి ఆటోలో వచ్చాడట... ఆటో శబ్దం విని బయటికొచ్చిన జయంతి, అటు ఇటు దొంగచూపులు చూసి, ఆ పైన ఆటోలో

వచ్చిన వ్యక్తిని లోపలికి రమ్మందట... అతను లోపలికి వెళ్ళగానే తలుపులు వేసేసి లైట్లు ఆర్పేసిందట"

"కైలాష్ అయిఉండొచ్చు..."

"కాదని కానిస్టేబుల్ అంటున్నాడు... వచ్చిన వ్యక్తి పొడవుగా, నల్లగా... తల గుండు గీయించుకుని ఉన్నాడట... 'దేవి' కేసులోకి ఎంటరైన ఆ కొత్త ముఖం ఎవరో చూసొద్దాం పద గోకుల్‌నాథ్!"

★ ★ ★

జయంతి ఉంటున్న వీధి మొదట్లో- ఒక చెత్తకుండీ వెనకాల... చీకట్లో నిలబడున్న కానిస్టేబుల్ కనకరాజు పక్కన యమహాను ఆపాడు వివేక్.

"ఏమిటి కనకరాజూ... లోపలికి వెళ్ళిన శాల్తీ ఇంకా బయటకు రాలేదు కదూ..."

"రాలేదు సార్..."

"ఇక్కడి నుండి నువ్వెక్కడికీ కదల్లేదు కదూ...?"

"లేదు సార్..."

"సరే, నువ్వు జయంతి ఇంటి వెనకున్న వీధిలోకి వెళ్ళి నిలబడు... మేము ముందు నుండి వెళ్ళి తలుపు తడతాము... వచ్చిన వాడు చెడ్డవాడైతే, వెనకనుండి పారిపోవటానికి ప్రయత్నిస్తాడు... అలా జరిగితే వెంటనే వాణ్ణి గట్టిగా పట్టుకో..."

కనకరాజు తలాడించాడు.

బైక్‌ను ముందుకు పోనిచ్చి జయంతి ఇంటికి రెండు ఇళ్ళకు ముందు ఇంజన్ ఆఫ్ చేసి ఇద్దరూ కిందికి దిగారు. జయంతి ఇంటి మెట్లెక్కి కాలింగ్‌బెల్ నొక్కాడు వివేక్.

లోపల ట్యూబ్‌లైట్ వెలిగింది. తలుపు దగ్గరికి అడుగుల శబ్దం వినిపించింది. జయంతి గొంతు మెల్లగా, కాస్త తడబడ్డట్టు వినిపించింది.

"ఎ...వ...ర...దీ...?"

"మిస్ జయంతీ, తలుపు తెరవండి..."

వివేక్ గొంతు వినగానే లోపల నిశ్శబ్దం

## కొత్తగాలి... 

**కాలేజీలో వాడికి**
**లంబకోణం సమకోణం**
**నేర్పేరు కచ్చితంగా**
**మానవీయ కోణం నేర్పలేదు!**

-డి. హెచ్.సంతోషి, బెంగళూరు

అలుముకుంది. అరనిమిషం తరువాత తలుపు తెరుచుకుంది.

తలుపు వెనక- నైటీలో జయంతి నిలబడి ఉంది. ముఖానికి ఆలివ్ ఆయిల్ లాంటిదేదో పూసుకున్నట్టుంది.

ఏమాత్రం తేడా లేనట్టు మామూలుగా ఆహ్వానించింది.

"రండి సార్..."

"క్షమించాలి... మా రాకతో మళ్ళీ మీకు ఇబ్బంది. నిద్రలో ఉన్నట్టున్నారు?" వివేక్ లోపలికెళ్ళి సోఫాలో కూర్చున్నాడు.

"ఔను.. ఇప్పుడే కళ్ళు మూసాను"

"కైలాష్ ఈరోజు ఇక్కడికి వచ్చాడా?"

"లేదు. దేవి వ్యవహారంతో ఇప్పుడు అంతగా రావడం లేదు..."

"మిస్ జయంతీ, కాసేపటికి ముందు ఇక్కడికి ఎవరైనా వచ్చారా...?"

"లే.. లేదే..." జయంతి కళ్ళలోని కలవరపాటుని వివేక్ కళ్ళు గమనించాయి. చిరునవ్వు చిందించాడు.

ఎదురుగా ఉన్న టీపాయ్ కింది అరలో ఉన్న ఆష్‌ట్రేను బయటికి తీశాడు వివేక్.

ఆష్‌ట్రేలో- సరిగ్గా ఆర్పని సిగరెట్ ముక్కనుండి సన్నగా పొగ వస్తోంది.

"లుక్ మిస్ జయంతీ, మీరు ఒక అబద్ధాన్ని దాచాలని పది అబద్ధాలు చెప్పకండి. ఈ సిగరెట్ జాతకాన్ని గురించి చెప్పమంటారా... దీన్ని ఐదు నిమిషాల ముందు ఎవరో వెలిగించి ఉండాలి... సిగ







రెట్ తాగుతున్న వ్యక్తి దీన్ని తొందర తొందరగా ఆర్పి ఉండాలి... ఆ వ్యక్తి ఎవరో కాస్త పిలుస్తారా..."

"పిలవాలా...? ఎవరిని పిలవాలి..."

"మీరే పిలిచి ఆ వ్యక్తి బయటికి వస్తే కాస్త మర్యాదగా నడుచుకుంటాం. మేమే పట్టుకున్నామంటే మర్యాద మంటగలుస్తుంది. ఏమంటారు జయంతీ...?"

వివేక్ కఠినంగా అలా అంటూ ఉండగానే పక్కనున్న గది కర్టెన్ తీసుకొని గుండు గీయించుకున్న ఒక వ్యక్తి దర్శనమిచ్చాడు. కారు నలుపు... భారీ మనిషి... గరగరలాడుతున్న గొంతు...

"ఇన్‌స్పెక్టర్ నేనే వచ్చేశాను... జయంతిని ఇబ్బందీ పెట్టకండి... ఆమె ఎప్పుడూ నన్ను ఇంట్లోకి రానిచ్చేది కాదు. నేనే బలవంతంగా వచ్చి వెళుతున్నాను" అతడు మాట్లాడుతూ వివేక్‌ను సమీపించాడు.

వివేక్ ప్రశ్నించాడు.

"ఎవరు నువ్వు...?"

ఆ వ్యక్తి జయంతి వైపు చూస్తూ అన్నాడు, "ఏం జయంతీ, సమాధానం నువ్వు చెబుతావా.. నన్ను చెప్పమంటావా...?"

"నువ్వే చెప్పు..." జయంతి ముఖం తిప్పుకుంది. అతను పళ్ళంతా కనబడేలా నవ్వి అన్నాడు.

"సార్ నా పేరు పాండురంగ. జయంతి నా భార్యే... ఐదు సంవత్సరాల క్రితం కంచిలో మా పెళ్ళయింది. స్మగ్లింగ్ వ్యవహారాలలో తలమునకలైన నేను ఒక గవర్నమెంట్ ఉద్యోగినని అబద్ధం చెప్పి జయంతిని పెళ్ళిచేసుకున్నాను. పెళ్ళయిన వారానికంతా నా అసలు స్వరూపం బయటపడింది. పోలీసులు నన్ను అరెస్ట్‌చేసి పట్టుకెళ్ళారు. ఆ సాయంత్రమే లాకప్ దగ్గరకు వచ్చిన జయంతి నన్ను నానా తిట్లూ తిట్టి మెళ్ళోని తాళిబొట్టు తీసి నా ముఖంపై విసిరికొట్టి వెళ్ళిపోయింది. కోర్టులో విడాకులు కేసుపెట్టి, ఏడాదికంతా వాటిని సంపాదించి సొంత ఊరు వదిలి ఈ ఊరు వచ్చేసింది. నేను ఆరునెలల క్రితమే జైల్లో నుండి విడుదలయ్యాను. చేసిన తప్పులను క్షమించమని అడగడానికొస్తే ఆమె ఇంకా అదే కోపంలో ఉంది"

కేసు సడెన్‌గా పక్కదారి పట్టడంతో వివేక్, గోకుల్‌నాథ్ నిరాశగా కూర్చుండిపోయారు. వివేక్ తేరుకుని అడిగాడు.

"కోర్టువారిచ్చిన డైవోర్స్ ఆర్డర్ ఉందా మిసెస్ జయంతీ...?"

"ఉంది!"

"నేను దాన్ని చూడవచ్చా?"

"ఒక్క నిమిషం..." అని చెప్పిలోపలికి వెళ్ళింది జయంతి. గుండు వ్యక్తి అసహనంగా అటు ఇటు కదులుతుంటే అతణ్ణి అడిగాడు వివేక్-

"జైల్లో ఎన్ని సంవత్సరాలున్నావు...?"

"నాలుగున్నర సంవత్సరాలు సార్..."

"ఎప్పుడు రిలీజయ్యావ్...?"

"పోయిన నెల రెండో తేదీన సార్... జైల్లో నుండి విడుదల అవుతున్నప్పుడే మారిపోయాను. జయంతితో కలిసి ఒక కొత్త జీవితాన్ని మొదలుపెట్టాలని పరుగెత్తుకొచ్చాను. కానీ తను నన్ను పిచ్చికుక్కను తరిమినట్టు తరిమికొడుతోంది"

డైవోర్స్ ఆర్డర్‌తో బయటికొచ్చిన జయంతి పాండురంగను అసహ్యంగా చూస్తూ- "నిన్ను తరమకుండా ఏం చెయ్యమంటావ్? మంచి ఉద్యోగంలో ఉన్నానని అబద్ధం చెప్పి, తాళి కట్టావ్. నువ్వు కట్టిన ఆ తాళిని ఆరోజే పోలీస్‌స్టేషన్‌లో విసిరికొట్టానుగా. డైవోర్స్ తర్వాత నన్ను కలవడానికి ముఖం ఎలా చెల్లింది?"

వివేక్ ఆమె చేతిలోని ఆర్డర్‌ను అందుకొని చదివి గోకుల్‌నాథ్‌కు ఇచ్చాడు.

"మిసెస్ జయంతీ..."

"ఊc..."

"మీతో మాట్లాడాలి. ఇలా వస్తారా?"

పక్కగదిలోకి దారి తీశాడు వివేక్. జయంతి అతని వెనకే వెళ్లింది. వివేక్ ఆమె వచ్చాక లోగొంతుకతో అడిగాడు:

"మీరు కైలాష్ సన్నిహితంగా ఉంటున్న విషయం మీ భర్తకు తెలుసా...?"

"తెలియదు..."

"కైలాష్ అతనికి తెలుసా?"

"చూశాడు..."

"ఎన్నిసార్లు చూసి ఉంటాడు...?"

"నాలుగైదు సార్లు..."

"కైలాష్ గురించి ఏమీ అడగలేదా...?"

"అడిగాడు!"

"మీరేం చెప్పారు...?"

"అతను డ్రామాట్రూపు నడుపుతున్నాడనీ, అతని నాటకాలలో నటిస్తున్నానని చెప్పాను. దాంతో ఇంకేమీ అడగలేదు."

"పాండురంగ మీ భర్త అని కైలాష్‌కు తెలుసా?"

"తెలియదు. చెప్పాలనీ అనుకోలేదు..."

"పాండురంగను కైలాష్‌కు ఏమని పరిచయం చేశారు...?"

"మా బంధువనీ... మిరపకాయల వ్యాపారం చేస్తాడనీ... గుంటూరు నుండి వారానికి ఓసారి వస్తాడనీ... చెప్పాను"

వివేక్ నవ్వాడు.

"డ్రామాలో మీరు నటిస్తుండగా నేనింత వరకూ చూళ్లేదు. కానీ నిజజీవితంలో బాగానే నటిస్తున్నారు"

"సార్, నాకో సాయం చెయ్యగలరా?"

"ఏంటదీ...?"

"అతను నాకు తాళికట్టిన భర్త మాత్రమే! చట్టప్రకారం విడాకులు తీసుకున్నాను. ఇప్పుడే మీరు కోర్టు ఆర్డర్‌నూ చూశారు. కోర్టు తీర్పును గౌరవించకుండా అతను 'తనతో సంసారం చెయ్యమని' బలవంతం చేస్తున్నాడు. పోలీసులు కల్పించుకుని చేయడానికి ఏమీ లేదా...?"

**కొత్తగాలి...**

**నాది హ్యాపీ హోం!**
**తల్లిదండ్రులది మాత్రం**
**ఓల్డేజ్ హోం!!**

– జి.గోపాలకృష్ణ, అరసవిల్లి

"ఎందుకు లేదూ... రండి, అతనితో నేను మాట్లాడతాను..." అంటూ గది బయటకు దారితీశాడు వివేక్.

పాండురంగ గుండు తడుముకుంటూ గోడకు ఆనుకుని నిలబడి ఉన్నాడు. నోట్లో పాన్‌పరాగ్ నములుతున్నాడు.

"పాండురంగా..."

"సార్..."

"నీతో సంసారం చెయ్యడానికి జయంతికి ఇష్టం లేదు. డైవోర్స్ కూడా తీసుకుంది. కోర్టు ఆర్డర్స్ ప్రకారం జయంతితో కలిసి జీవించడానికి నీకు హక్కులేదు. సంసారానికి రమ్మని బలవంతం చెయ్యకూడదు. అలా చేస్తే నేరం. జయంతి పక్కనున్న పోలీస్‌స్టేషన్‌లో కంప్లయింట్ ఇస్తే మళ్లీ ఏడాదో రెండేళ్లో జైలుకెళ్లాల్సి వస్తుంది... ఏమంటావ్...?"

పాండురంగ ముఖం నల్లబడింది.

"నేను ఇక ఇక్కడికి రాను సార్..."

"ఈ నిముషమే బయటకు నడువ్. మరోసారి మేము వచ్చినపుడు నువ్విక్కడున్నావో... పట్టుకెళ్లిపోతాం, జాగ్రత్త!!..."

పాండురంగ గుండును తడుముకుంటూ వెనక్కు తిరిగి తిరిగి చూస్తూ తలుపు తీసుకుని బయటికి నడిచాడు.

"థ్యాంక్యూ సార్...!" జయంతి కృతజ్ఞతగా అంది. వివేక్ నవ్వి గోకుల్‌నాథ్ వైపుకు చూస్తూ అన్నాడు:

"బయలుదేరదామా గోకుల్‌నాథ్! మధ్యాహ్నం నుండి బాగా అలసిపోయా.

ఇంటికెళ్లి అలాగే పడిపోవాలనుంది..."

జయంతి వద్ద సెలవు పుచ్చుకొని ఇద్దరూ బయటికొచ్చారు. రెండిళ్ల తర్వాత ఆపి ఉన్న యమహా వైపుకు దారితీశారు.

వీళ్లబూట్ల శబ్దం వీధిలోని నిశ్శబ్దాన్ని ఛేదిస్తోంది. ఇద్దరూ బైక్ దగ్గరకు వెళ్లిన ఆ క్షణంలోనే వివేక్ ఠక్కున ఆగిపోయాడు.

"ఏంటి వివేక్...?"

"గోకుల్‌నాథ్... నేను చెప్పిన వెంటనే అటుకేసి చూడకండి. వీధి కార్నర్‌లో ఉన్న చెత్తకుండి వెనకాల ఎవరో కూర్చొని తొంగి తొంగి చూస్తున్నారు..."

గోకుల్‌నాథ్ యాంత్రికంగా అటుకేసి చూసినట్టు చూసి తల తిప్పి - "ఔను వివేక్... యూ ఆర్ కరెక్ట్..." అన్నాడు.

వివేక్ తన చేతిలోని బైక్ తాళాలు గోకుల్‌నాథ్ చేతికి ఇచ్చాడు.

"బైక్ తీసుకొని నా వెనుకే రండి... నేను వెళ్లి అతణ్ణి ట్రాప్ చేస్తాను..." అంటూ వివేక్ వెనక్కు తిరిగిన క్షణంలో చెత్తకుండీ చాటున ఉన్న శాల్తీ ఠక్కున లేచి పరుగెత్తడం ప్రారంభించాడు.

వివేక్ వెంబడించాడు.

## 12

వివేక్ వీధి చివరికి వెళ్లేసరికి- అతను కుడివైపు పరుగెత్తుతూ కనిపించాడు.

వివేక్ స్పీడ్ పెంచాడు.

ఎవరతను? కచ్చితంగా పాండురంగ కా వడానికి వీల్లేదు. ఆ పర్సనాలిటీ ఈ శాల్తీకి లేదు.

వివేక్ ఆలోచిస్తూ పరుగెత్తుతున్నాడు. గోకుల్‌నాథ్ బైక్ మీద వస్తున్నాడు.

వివేక్ వీధి మలుపు దగ్గరికొచ్చి చప్పున ఆగిపోయాడు. ముందు పరుగెత్తుతున్న శాల్తీ ఎటో మాయమైపోయాడు.

'ఎటు వెళ్లాడు...? ఎలా మాయమయ్యాడు...?' ఆలోచిస్తూ నిలబడ్డ వివేక్ దగ్గరకు బైక్ వచ్చి ఆగింది.

"వెనక కూర్చోండి వివేక్ రెండు నిమిషాల్లో అతణ్ని పట్టుకోవచ్చు" గోకుల్‌నాథ్ అనగానే వివేక్ వెనక కూర్చున్నాడు.

బైక్‌ను స్పీడ్‌గా ముందుకు పోనిచ్చాడు గోకుల్‌నాథ్.

"అతనెవరో గుర్తు పట్టారా...?"

"చీకట్లో కనిపెట్టలేకపోయాను..."

"ముందుకే కదూ పరుగెత్తాడు...?"

"ఔను..."

బైక్ స్పీడ్ పెరిగింది. సడెన్‌గా ఆ రోడ్ మూడు వీధులుగా చీలింది. గోకుల్‌నాథ్ కన్‌ఫ్యూజనైపోయి బైక్‌ను ఆపేశాడు.

"శాల్తీ తప్పించుకున్నాడు..."

"గోకుల్‌నాథ్..."



"ఏమిటి వివేక్...?"
"బైక్‌ను కైలాష్ ఇంటికి పోనివ్వు..."
"కైలాష్‌ను అనుమానిస్తున్నారా...?"
"ఎందుకో నాకు అలా అనిపిస్తోంది... ఆ ఎత్తూ... ఆ రూపమూ కైలాష్‌కు సరి పోతోంది. అతనింటికి బైక్‌ను పోనివ్వు.





ఇంట్లో ఉన్నాడో, లేడో చూసొద్దాం..."

గోకుల్‌నాథ్ బండిని వెనక్కు తిప్పాడు.

ఐదు నిమిషాల తర్వాత కైలాష్ ఉంటున్న వైకుంఠపురం కాలనీలోకి బైక్ ఎంటరైంది. కైలాష్ ఇంటిముందు బైక్ ఆగింది. వివేక్ క్రిందికి దిగి ముఖద్వారం దగ్గరకు నడిచాక ఆశ్చర్యపోయాడు. వెనక్కు తిరిగి గోకుల్‌నాథ్‌ను చూశాడు.

"ఏమిటి వివేక్...?"

"ఇల్లు తాళం వేసుంది"




మరుసటి దినం ఉదయం పదిగంటలు! పోలీస్‌స్టేషన్‌లో ఉన్న వివేక్ ఫోన్ అందుకొని ఫోరెన్సిక్ డిపార్టుమెంట్‌కు డయల్ చెయ్యసాగాడు. ఎదురుగా కుర్చీలో కూర్చొని ఉన్న గోకుల్‌నాథ్ కేస్ ఫైల్‌ను పరిశీలిస్తూ తన దగ్గరున్న డైరీలో ఏదో నోట్ చేసుకుంటున్నాడు. ఇంతలో స్టేషన్ బయట ఆగిన ఆటోలో నుండి కైలాష్ దిగి వేగంగా లోపలికి వచ్చాడు. అతణ్ణి చూసిన గోకుల్‌నాథ్ కూర్చోమని సైగచేశాడు. వివేక్ ఫోన్ చేసే ప్రయత్నాన్ని మాని అతడి వైపు చూశాడు.

"వాట్ మిస్టర్ కైలాష్...?"

"మీరు నిన్నరాత్రి పదకొండు గంటలకు పైన మా ఇంటికి వచ్చారా సార్.?"

"మీ కెవరు చెప్పారు...?"

"ఎదురింటి మీనాక్షి ఆంటీ బైక్ శబ్దం విని కిటికీ తలుపుతీసి చూసిందట. మీరూ, ఇన్‌స్పెక్టరూ తాళంవేసిన ఇంటిని చూసి వెళ్ళిపోయారట..."

"మీరు రాత్రి ఎక్కడికి వెళ్ళారు...?"

"రంగమణి గదికి..."

"అంత రాత్రిలోనా...?"

"ఔను సార్! దేవి చనిపోయిన ఇంటిలో రాత్రిపూట పడుకోవటానికి నాకెలాగో ఉంటోంది. అందుకే రంగమణి గదికి వెళ్ళిపోయాను. రాత్రి పడుకొని ఉదయాన్నే వచ్చాను. రాగానే మీనాక్షి ఆంటీ మీరు రాత్రి వచ్చి వెళ్ళినట్టు చెప్పింది..."

"రంగమణి గదికి ఎన్ని గంటలకు వెళ్ళారు...?"

"పది గంటలకు...?"

"పది గంటలకు వెళ్ళిన మీరు, మళ్ళీ అక్కడ నుండి బయటికే రాలేదా...?"

"లేదు సార్..."

వివేక్ టాపిక్ మార్చాడు:

"సరే దేవి బ్లడ్ గ్రూప్ తెలిసిందా?"

"డాక్టరమ్మను అడిగాను సార్. 'ఎ. పాజిటివ్' అని చెప్పింది..."

వివేక్ తన డైరీలో నోట్ చేసుకున్నాడు.

"తరువాత మిస్టర్ కైలాష్... 'స్వస్తికా' పేరుతో ఎవరైనా మీకు తెలుసా...?"

కైలాష్ ఆలోచించి చెప్పాడు:

"స్వస్తికా, దేవి స్నేహితురాలు సార్"

"మీరామెను చూశారా...?"

"ఒకే ఒకసారి చూశాను... ఆ రోజు ఆఫీసుకు బయలుదేరుతున్న సమయంలో ఆ స్వస్తికా ఎయిర్ బ్యాగూ, సూట్‌కేస్‌తో ఆటోలో నుండి దిగింది... దేవి పరిచయం చేసింది. నేను 'హలో' అని విష్ చేసి ఆఫీసుకెళ్ళిపోయాను. సాయంత్రం తిరిగి ఇంటికొచ్చేసరికి ఆమె ఇంట్లో లేదు. 'ఎక్కడికి వెళ్ళిందీ' అని దేవిని అడిగాను. పీలేరులో ఉంటున్న ఆమె భర్త దగ్గరకు వెళ్ళినట్టుగా చెప్పింది దేవి..."

"ఆమె వివాహితురాలా...?"
"ఔను సార్!"
"ఆమె హజ్‌బెండ్ ఏం చేస్తారు...?"
"నాకు తెలియదు సార్..."
"స్వస్తికాను మీరెప్పుడు చూశారు...?"
"రెండు నెలలు పైనే అవుతోంది సార్. తర్వాత మళ్ళీ ఆమెను చూళ్ళేదు..."
"ఇప్పుడు ఎక్కడికి బయలుదేరారు ?"
"ఆఫీసుకు..."
"సాయంత్రం జయంతి ఇంటికి వెళుతున్నారా...?"
"వెళదామనుకుంటున్నాను..."
"ఇంకో పదిరోజుల వరకూ మీరు జయంతిని కలవడానికి వీల్లేదు..."
"ఎందుకు సార్...?"
"కారణం ఉంది..."
మౌనంగా తల ఊపాడు కైలాష్.

★ ★ ★

"గుడ్‌మార్నింగ్ మురళీమోహన్..."
"వెల్‌కమ్ మిస్టర్ వివేక్.. కూర్చోండి" కుర్చీని చూపించి సాదరంగా ఆహ్వానించాడు ఫోరెన్సిక్ లేబొరేటరీ అసిస్టెంట్ మురళీమోహన్.
కూర్చున్నాక వివేక్ అడిగాడు:
"నేను ఇచ్చిన ఆ డ్రైబ్లడ్ పార్టికల్స్ ఏం చెబుతోంది...?"
"అది మనిషి రక్తమే..."
"బ్లడ్ గ్రూప్ కనిపెట్టారా...?"
"ఓ యస్... మీరు తీసుకొచ్చి ఇచ్చిన బ్లడ్, బి-నెగటివ్"
వివేక్ అదిరిపడ్డాడు.
"బి-నెగటివా...?"
"యస్...!"
"హతురాలు దేవి గ్రూప్ ఎ-పాజిటివ్"
మురళీమోహన్ నవ్వాడు- "హత్యాస్థలంలో హతుడి రక్తపు మరకలే ఉండాలని లేదు వివేక్. హంతకుడి రక్తపు మరకలూ ఉండొచ్చు.. హత్యా ప్రయత్నంలో- ఆ పెనుగులాటలో హంతకుడూ గాయపడి

**కొత్తగాలి...**

**చీమల్లో ఉన్న ఐక్యత**
**కుక్కకున్న విశ్వాసం**
**మనుషుల కబ్బితే**
**ఎంతో బాగుండు!**

– పెరుకరాజు, నర్సింగాపూర్, కరీంనగర్

ఉండొచ్చు. సో... ఈ కేసులో ఈ బ్లడ్ గ్రూప్ సాక్ష్యం, మీకు ఒక ప్లస్ పాయింట్ అవుతుంది..."
తలూపాడు వివేక్.
"పది నిమిషాలు ఉండండి. టైపింగ్ సెక్షన్‌కు వెళ్ళి రిపోర్ట్‌ను పట్టుకొస్తాను..." మురళీమోహన్ లేచి లోపలికి వెళ్ళాడు.
వివేక్ గోకుల్‌నాథ్ వైపు చూశాడు.
"ఈ బ్లడ్ గ్రూప్ విషయాన్ని మనం ఎక్స్‌పెక్ట్ చెయ్యలేదు గోకుల్‌నాథ్. గాయపడ్డ హంతకుడు ఇంటి వెనకవైపు నుండి పారిపోతుండగా తలుపును గుద్దుకొని ఉండాలి. ఈ ఆధారంతో హంతకుణ్ణి తొందరగానే పట్టుకోవచ్చు. మన అనుమానస్తుల పట్టికలో ఎవరెవరున్నారో వాళ్ళందరి రక్తాన్నీ పరీక్ష చేస్తే సరిపోతుంది.."
"పట్టికలో ఎవరెవరున్నారు వివేక్?"
"కైలాష్, మోహన్, జయంతి, పాండురంగ, కైలాష్ ఫ్రెండ్ రంగమణి- మొత్తం అయిదుగురు. వీళ్ళ బ్లడ్‌ను టెస్ట్‌చేసి సరి చూడాల్సిన బాధ్యత మీది గోకుల్‌నాథ్"
"కైలాష్ ఫ్రెండ్ రంగమణిని కూడా అనుమానిస్తున్నారా వివేక్...?"
"కచ్చితంగా...! ఆ రంగమణి వద్ద ఒక మాస్టర్ కీ బంచ్ ఉంది. దాని సాయంతో అతను దేవి ఇంటికి వెళ్ళుండొచ్చు కదా?"
మురళీమోహన్ బ్లడ్‌రిపోర్టుతో అక్కడికి వచ్చేసరికి ఇద్దరూ మాటలు ఆపేసారు.

## కొత్తగాలి... 

**లంకంత మనసుతో**
**వాడు సిక్సర్లు!**
**వీడు బుల్లెట్లు!**
**అక్కడ ఇంకెందుకు క్రికెట్లు?**

– మరో భారతీయుడు

"విష్ యు ఆల్ ద బెస్ట్ మిస్టర్ వివేక్... ఈ ఫోరెన్సిక్ రిపోర్ట్ సాయం తోనే మీరు దేవి హత్యను వెలుగులోకి తీసుకురాబోతున్నారు"

"థ్యాంక్యూ సార్ ఈ క్రైమ్ బ్రాంచ్‌లో చేరి ఏడెనిమిదేళ్లు కావస్తోంది. ఈ కేసు ఇబ్బంది పెట్టినట్టు మరేదీ పెట్టలేదు. హంతకుడు వెనుకే వస్తున్నట్టు అనిపిస్తుంది. వెనక్కు తిరిగి చూస్తే మాయమై పోతున్నాడు. ఎవర్ని చూసినా అనుమానం.. ఈ కేసులో ఎన్నో సంఘటనలు .. అయితే వేర్వేరుగా ముక్కలు ముక్కలుగా ఉన్నాయి. బెంగుళూరులో ఒక ఆడా, మగా జంట గదిని అద్దెకు తీసుకొని దేవి పేరుతో ఆమె తండ్రికి టెలిగ్రామ్ ఇచ్చారు. ఇది ఓ సంఘటన! దేవి డెడ్‌బాడీని పెట్టెలో పెట్టి దాన్ని పార్శిల్ లారీ ఆఫీసులో బుక్ చేశాడు మరొకడు. ఇదొక సంఘటన! దేవి వాళ్ల ఇంటి బీరువాలో కైలాష్‌కు తెలియకుండా కండోమ్స్ ప్యాకెట్ పెట్టడం, ఇంటి వెనుక భాగాన ఎవరో నడుస్తున్న శబ్దం, మిలట్రీ నాయుడి హత్య... ఇలా వేర్వేరు సంఘటనలు జరుగుతున్నాయి."

"డోంట్‌వర్రీ మిస్టర్ వివేక్! లింక్ దొరుకుతుంది. మీరు చేపట్టిన ఏ కేసూ ఇంత వరకూ ఫెయిల్ కాలేదు"

నవ్వుతూ వివేక్ రిపోర్ట్ అందుకొని ఆత్మవిశ్వాసంతో బయటకు దారితీశాడు. గోకుల్‌నాథ్ అతణ్ని అనుసరించాడు.

★ ★ ★

"కుప్పం నుండి మళ్లీ మీరు ఎప్పుడు బయలుదేరుతారు?" వివేక్ భార్య రూప-సూట్‌కేసులో బట్టలు సర్దుతూ అడిగింది. అప్పుడు సమయం సాయంత్రం ఏడుగంటలు. చైర్లో కూర్చుని ఆలోచిస్తున్న వివేక్ పరధ్యానం నుండి బయటపడి అన్నాడు.

"ఒకరోజు ఉండి తిరిగొచ్చేస్తాను..."

"ఆ బ్లడ్‌గ్రూప్ టెస్టింగ్ ఏం చేశారు?"

"గోకుల్‌నాథ్ చూసుకుంటాడు ఆ విషయాన్ని... నేను కుప్పం వెళ్లి తిరిగి వచ్చే సరికి ఆయన రిజల్ట్‌తో ఉంటాడు..."

"మీరు కుప్పం వెళ్లి ఆ స్వస్తికాను విచారించడం క్రిమినల్ టైం వేస్ట్ అని తోస్తుంది" రూప అంది.

"ఎందుకు అలా అనుకుంటున్నావు..?"

"ఆ స్వస్తికా కొత్తగా ఏం చెప్పబోతుందట...?" మీరు దేవి చనిపోయిన విషయం చెప్పగానే కన్నీళ్లు పెట్టుకొని కాసేపు ఏడుస్తుంది... నేను ఆమె కాలేజీ రోజుల్లో ప్రాణానికి ప్రాణంగా మెలిగామని' చెప్పి కుమిలిపోతుంది.. మీరు దాన్ని విని వెనక్కు తిరిగి వచ్చేస్తారు..."

"నో రూపా.. నీ ఆలోచన తప్పు! నాకేమో కుప్పం వెళ్లి ఆ స్వస్తికాను కలిస్తే, కేసులో ఏదైనా మంచి పట్టు దొరుకుతుందనిపిస్తోంది. ప్రాణస్నేహితురాలు కనుక దేవి ఆమెకు ఏమైనా చెప్పి ఉండొచ్చు"

రూప ఏదో చెప్పబోయింది.. ఇంతలో టీపాయ్ మీదున్న ఫోన్ మ్రోగింది. వివేక్ రిసీవర్ అందుకొని "హలో" అన్నాడు.

"మిస్టర్ వివేక్ ఉన్నారా?" అటునుండి ఒక యువతి గొంతు వినిపించింది.

"యస్ హోల్డింగ్..."

"ఓహ్ మీరేనా?" ఆడగొంతు నవ్వింది.

"ఎవరు మీరు? ఏమిటి విషయం?"

"నా పేరు అనవసరం. చెప్పబోయేది మాత్రం కాస్త జాగ్రత్తగా వినండి"

"ఏం చెప్పబోతున్నారు...? "

"దేవి హత్యకేసులో హంతకుడి కోసం పోలీసుకుక్కల్లా మీరు కష్టపడ్డం చూస్తుంటే నాకే చాలా బాధగా ఉంది.."

వివేక్ కోపంగా రిసీవర్‌ను చూసి 'ఎవరీమె' అని ఆలోచనలో పడ్డాడు.

"ఏమిటి వివేక్- 'ఎవరీమె' అంటూ ఆలోచిస్తున్నారా...? బుర్ర పాడుచేసుకోకండి! దేవిని చంపింది ఎవరో చెప్పనా? "

"చెప్పు..."

ఆమె చెప్పగానే అదిరిపడ్డాడు వివేక్.




వివేక్ దాదాపు అరిచినట్టు అడిగాడు:

"ఏమిటి నువ్వంటున్నది...? "

"నేను చెబుతున్నది నూరుపాళ్లు నిజం మిస్టర్ వివేక్" అని నవ్వింది ఆ యువతి.

"దేవి హంతకులు ఆమె తండ్రి శివశంకరయ్య, అతని చెల్లెలి కొడుకు నాగరాజూ"

"ఏమిటి వాగుతున్నావు? కన్నకూతుర్నే తండ్రి హత్య చేస్తాడా? ఏమిటి మోటివ్...? వారే హత్య చేశారని ఎలా అనుకుంటున్నావు? నువ్వు చూశావా...? "

వివేక్ అలా గబగబ అడగ్గానే అటువైపు నుండి ఆ యువతి మళ్లీ నవ్వింది.

"ఒక్కో ప్రశ్నగా అడగండి మిస్టర్ వివేక్? మీ మొదటి ప్రశ్న ఏమిటీ కన్న కూతుర్నే తండ్రి హత్య చేయగలడా అని కదూ! నిస్సందేహంగా! ఉదయం నిద్రలేవగానే పేపర్ తిరగేయండి, ఎన్ని రకాల హత్యావార్తలు ఉంటాయో? 'నిద్రపోతున్న మొగుడి తలపై రోకలిబండతో కొట్టి హత్య! పెళ్లాం ఖైదు!! కన్నతండ్రిని వెంటాడి హత్య చేసిన కొడుకు... అల్లుడ్ని కొడవలితో గొంతుకోసిన మామగారు.." ఆ యువతి అటునుండి అలా మాట్లాడుతూ ఉండగానే, రిసీవర్ మౌత్‌పీస్‌ను గట్టిగా మూసి ఉంచి వివేక్ సమీపంలో ఉన్న భార్య రూపను సైగలతో దగ్గరకు రమ్మని పిలిచాడు. దగ్గరకు వచ్చాక, బల్లపైనున్న పెన్ అందుకొని వారపత్రిక కొనలో ఇలా రాశాడు. 'ఎదురింటి టెలిఫోన్ ద్వారా ఎక్స్ఛేంజ్‌కు ఫోన్‌చేసి నాతో మాట్లాడుతున్న వ్యక్తి టెలిఫోన్‌ను ట్రేస్ అవుట్ చెయ్'

రూప ఎదురింటికేసి పరుగెత్తింది.

ఫోన్‌లో ఆ యువతి మాటలు కొనసాగిస్తోంది, "సో మిస్టర్ వివేక్ మానవత్వం కొద్దికొద్దిగా చచ్చిపోతూ వస్తున్న ఈ శతాబ్దంలో ప్రేమానుబంధాలను లెక్క చెయ్యక ఎవరైనా ఏ నిమిషంలోనైనా హంతకుడిగా మారవచ్చు. మీ తర్వాత ప్రశ్నకి వద్దాం. ఏమిటి మోటివ్ అనేగా మీ డౌట్? మోటివ్- దేవి క్యారెక్టర్! దేవి పతివ్రతో, పతితో నాకు తెలీదు. కానీ శివశంకరయ్యకు తన కూతురి క్యారెక్టర్‌పై మంచి అభిప్రాయం లేదు. ఆ అభిప్రాయాన్ని కల్పించింది ఆయన చెల్లెలి కొడుకు నాగరాజు. నాగరాజుకు దేవిని పెళ్లి చేసుకోవాలన్న ఆశ వున్నట్టు, ఆ ఆశపై దేవి తల్లి రుక్మిణమ్మ నీళ్లు చల్లడం పాత కథ. అతనికి దక్కని దేవి మరొకరితో సుఖసంతోషాలతో బ్రతకకూడదన్న ఆలోచనలతో నాగరాజు పగబట్టగా శివశంకరయ్య అతని మాటలు నమ్మి సంఘటన జరిగిన ఆ సోమవారం రాత్రి కూతురికి బుద్ధి చెప్పడానికి పదిగంటలకు నాగరాజుతో



కలిసి చిత్తూరు నుండి ఇక్కడికి వచ్చారు. కూతురితో ఘాటుగా మాట్లాడ్డం దేవి దాన్ని లెక్క చెయ్యకపోవడం పర్యవసానం? శివశంకరయ్యలో అవధులు దాటిన ఆవేశం, దేవి శవంగా మారాక కానీ తగ్గలేదు. వెంటనే వాళ్లకు పోలీసుల భయం పట్టుకుంది. విషయం బయటకు పొక్కకుండా ఉండేందుకు దేవి శవాన్ని పెట్టెలో ప్యాక్ చేసి, నాగరాజు ద్వారా లారీ ఆఫీసులో బుక్ చేయించాడు..."

వివేక్ అడ్డుపడి అన్నాడు. "దీన్నంతా మీరు చూశారా...?"

"సగం చూశాను... సగం ఊహించాను..." ఆమె అలా అంటూ ఉండగానే రిసీవర్‌లో ఏదో సైరన్ శబ్దం వినిపించింది. వెంటనే రిసీవర్ పెట్టేసిన శబ్దం వినిపించింది.

"హలో... హలో..." అరిచాడు వివేక్.

ఎదురింటి నుండి రూప పరిగెత్తుకొచ్చింది. వివేక్ రిసీవర్‌ను క్రెడిల్ చేస్తూ అన్నాడు. "ఏమైంది రూపా...? ఎక్స్ఛేంజ్‌ను కాంటాక్ట్ చేశావా...?"

"చేశాను. వాళ్లు లైన్‌ను ట్రేస్‌అవుట్ చేసేంతలోనే రిసీవర్‌ను పెట్టేశారట..."

వివేక్ తన ముఖంపై చెమటను కర్చీఫ్‌తో అద్దుకుంటూ అన్నాడు:

"బహుశా టెలిఫోన్ బూతై ఉంటుంది రూపా అదీ ఓ మిల్లుకు పక్కన"

"ఎలా చెబుతున్నారు...?"

"ఆమె చివరి మాటలు అంటున్నప్పుడు సైరన్ శబ్దం వినిపించింది. ఆ శబ్దాన్ని వినగానే ఆమె అలర్ట్ అయి రిసీవర్‌ను పెట్టేసింది.

సో... ఆమె మాట్లాడ్డానికి ఉపయోగించిన టెలిఫోన్‌బూత్, ఏదో ఓ మిల్లు లేక ఫ్యాక్టరీకి పక్కన ఉండే బూత్..."

"దాన్ని ఎలా కనిపెట్టబోతున్నారు...?"

"సరిగ్గా ఏడు గంటలకు రిసీవర్‌తో ఆ సైరన్ శబ్దాన్ని విన్నాను. తిరుపతి పరిసర ప్రాంతాలలో సరిగ్గా ఏడు గంటలకు సైరన్ మోగే మిల్లుకానీ ఫ్యాక్టరీకానీ ఏదో ఎంక్వయిరీ చెయ్యాలి..." అంటూ వివేక్ రిసీవర్ అందుకొని ఎక్స్ఛేంజ్‌కు ఫోన్ చేశాడు.

"హలో, ఇన్ఫర్‌మేషన్...!"

"యస్..."

"మేడమ్, మేము పోలీసులం. పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లకు సంబంధించిన ఒక ఇన్ఫర్‌మేషన్ కావాలి"

"చెప్పండి సార్..."

"తిరుపతిలో మిల్లు లేక ఫ్యాక్టరీ పక్కన ఏదన్నా టెలిఫోన్ బూత్ ఉందా?"

"ఒక్క నిమిషం సార్" అర నిమిషం కాకమునుపే మళ్ళీ ఆ గొంతు వినిపించింది. "రేణిగుంటరోడ్‌లో వసుధ మిల్స్‌కు పక్క ఒక బూత్ ఉంది సార్"

"మిల్లుకు పక్కనే ఉన్న బూత్ అది ఒక్కటే కదూ?!"

"ఔను సార్..."

"థాంక్యూ..." వివేక్ రిసీవర్‌ను క్రెడిల్ చేసి బల్లపైనున్న హెల్మెట్ అందుకుని తలకు తగిలించుకున్నాడు.

"ఎక్కడికి బయలుదేరుతున్నారు? కుప్పం వెళ్ళరా...?"

"అరగంటలో వచ్చేస్తా. గోకుల్‌నాథ్ వస్తే ఇక్కడే ఉండమని చెప్పు" అంటూ వివేక్ గబగబ బయటకు నడిచాడు.

★ ★ ★

వసుధ మిల్స్ కాంపౌండ్‌వాల్‌కు ఆనుకొని ఆ టెలిఫోన్ బూత్ కనిపించింది. కొద్దిగా పాతబడ్డ బూత్ అది. దానిముందు భాగాన అద్దం ఉంది. బూత్‌కు కుడిపక్క ఇరవై అడుగుల దూరంలో టీ అంగడి ఉంది. ఎడమవైపు కొబ్బరి బోండాలు అమ్ముతోంది ఒకామె. వివేక్ యమహాను ఆపి క్రిందకు దిగాడు.

హెల్మెట్ బండిమీద ఉంచి బూత్ లోప లకి తొంగిచూశాడు. తరువాత టీ అంగడి కేసి నడిచాడు.

తెర్లుతున్న పాలలో నీళ్ళను పోస్తున్న ఆ బానకడుపు శాల్తీ, అర్థాంతరంగా పని ఆపి - "ఏం సార్, టీనా..?" అని అడిగాడు.

"వద్దు" అంటూ తలాడించి అతణ్ణి సమీ పించి చిన్నగా అడిగాడు.

"నువ్వేనా ఈ అంగడి యజమానివి?"

"ఔను సార్..."

"ఈ మిల్లులో రోజుకు ఎన్నిసార్లు సైరన్ మోగిస్తారు...?"

"ఎందుకు సార్, అడుగుతున్నారు...?"

"నేను పోలీస్ డిపార్టుమెంటు వ్యక్తిని... అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పు"

పోలీస్ అనగానే ఆ శాల్తీ పైకి మడిచి కట్టుకున్న లుంగీని కిందికి జారవిడిచాడు. వినయంతో చెప్పాడు.

"ఉదయం 7 గంటలకు ఒక దఫా, తర్వాత మధ్యాహ్నం 12 గంటలకు, సాయంత్రం 4 గంటలకు, మళ్ళీ రాత్రి 7 గంటలకు సైరన్ మోగిస్తారు సార్..."

"ఇందాక సరిగ్గా 7 గంటలకు ఆ టెలి ఫోన్ బూత్‌లో ఒక యువతి మాట్లా డింది. ఆమెను నువ్వు చూశావా?"

అతడు ఆలోచించి చెప్పాడు.

"అవును సార్... చూశాను. అద్దాల గది నుండి నాకు ఆ అమ్మాయి వీపు మాత్రమే కనిపించింది"

"ముఖాన్ని చూళ్ళేదా-?"

"లేదు సార్, అంతలో ఎవరో టీ అడగ టంలో అటువైపు చూళ్ళేకపోయాను..."

"యువతి బూత్‌లో మాట్లాడుతున్న ప్పుడు బయట ఎవరైనా ఉన్నారా...?"

"గమనించలేదు సార్... ఒకవేళ ఆ కొబ్బరిబోండాలు అమ్మే పిల్ల చూసి ఉండొచ్చు వెళ్ళి కనుక్కురానా సార్"?

"వద్దు, నేనే వెళ్ళి కనుక్కుంటాను..." వివేక్ ఆ పడతివైపుకు దారి తీశాడు.

## కొత్తగాలి...

**ఆశల్ని నింగికి**
**పంపడంకాదు**
**ధరల్ని నేలకు**
**దించాలి**

– బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

తానొక పోలీస్ ఆఫీసరునన్న విషయాన్ని చెప్పి ఇలా అడిగాడు. "ఆ అమ్మాయిని నువ్వు చూశావా...?"

"సరిగ్గా చూళ్ళేదండి."

"చూసినంతవరకూ చెప్పు..."

"ఆకుపచ్చ చీరకట్టి, తలనిండుగా మల్లె పూలు తురుముకుంది. గబగబ నడుచు కుంటూ వచ్చినందువల్ల ఆమె ముఖం సరిగ్గా నేను గమనించలేదు సార్.."

"ఆ యువతి పొడవా, పొట్టిగా ఉంటుందా?"

"బాగా పొడవేనండి?"

"ఆ యువతిని చూడగానే చప్పున గుర్తు పట్టేలా ఏవైనా ఆనవాలు చెప్పగలవా?"

కళ్ళద్దాలున్నట్టు జ్ఞాపకమండి..."

"బూత్ నుండి బయటికొచ్చాక నడుచు కుంటూ వెళ్ళిపోయిందా? ఆటో, కారు దేనిలోనైనా వెళ్ళిందా...?"

"నడుచుకుంటూ వెళ్ళింది..."

"ఎటు...?"

రోడ్డుకు ఎడమవైపుకు చేతిని చూపిం చింది ఆ పడతి.

వివేక్ యమహా దగ్గరికొచ్చాడు. అతడి బుర్రలో తొలుస్తున్నది ఒక్కటే ప్రశ్న- కళ్ళ ద్దాలు పెట్టుకుని, ఆకుపచ్చ చీర కట్టిన ఆ యువతి ఎవరు...?

★ ★ ★

రూప ఇచ్చిన టీని చప్పరిస్తూ సోఫాలో కూర్చున్న గోకుల్‌నాథ్- ఇంట్లోకి వస్తున్న



వివేక్‌ను చూసి ఆతృతగా అడిగాడు, "ఆ టెలిఫోన్ యువతి గురించి ఏమైనా సమాచారం దొరికిందా?"

"ఊహూ౦..."

లోపలి నుండి రూప బయటికొస్తూ అంది, "ఆ అమ్మాయి గట్టిపిండంలాగే ఉంది. సైరన్ శబ్దం విన్న వెంటనే అలర్ట్ అయి వెంటనే రిసీవర్ పెట్టేసి అక్కణ్ణించి పారిపోయింది. 'దేవిని చంపింది ఆమె నాన్నే' అని అతికినట్టు ఒక అబద్ధాన్ని కూడా చెప్పేసింది"

వివేక్ కుడిచేత్తో తల గోక్కుంటూ గోకుల్‌నాథ్‌తో అన్నాడు, "నేను ఆ స్వస్తికాను కలవడానికి కుప్పం వెళుతున్నా. నేను తిరిగి వచ్చేసరికి దేవివాళ్ళ నాన్నను, ఆ నాగరాజును కాస్త కదిపి చూడండి"

గోకుల్‌నాథ్ తల ఊపాడు.

వివేక్ సూట్‌కేస్ అందుకొని లేచాడు.

"నన్ను బస్‌స్టాండ్‌లో డ్రాప్ చెయ్యండి గోకుల్‌నాథ్..."

రూపాదేవి నుండి సెలవు తీసుకొని ఇద్దరూ బయటికి దారితీశారు.

★ ★ ★

ఐదు నిమిషాలలో వాళ్ళిద్దరూ బస్ స్టాండులో ఉన్నారు.

"ఆ ఫోన్‌కాల్ గురించి మీరేమనుకుంటున్నారు వివేక్?" నడుస్తూ ప్రశ్నించాడు గోకుల్‌నాథ్.

"నాకూ ఏమీ తోచడం లేదు గోకుల్‌నాథ్! కుప్పంవెళ్ళి ఆ స్వస్తికాను కలిస్తేనే ఏదైనా పట్టు దొరికేలా ఉంది. దేవి జీవితంలో చాలామంది అడ్డుపడి ఉన్నారు. ఎవర్నైనా మనం సులభంగా సందేహించవచ్చు. సందేహపడేలా సంఘటనలూ జరిగాయి. దేవీ, స్వస్తికా ఇద్దరూ మంచి స్నేహితులని వనజ చెప్పిన విషయమే ఇప్పుడీ కేసుకు బలాన్ని చేకూర్చింది. ఈ కేసుకు సంబంధించి ఏకైక ముఖ్యమైన వ్యక్తి స్వస్తికా..." వివేక్ అలా అంటూ ఉండగానే కుప్పం బస్సు వచ్చి ఆగింది.

వివేక్ గోకుల్‌నాథ్‌కు షేక్ హ్యాండిచ్చి సెలవు తీసుకున్నాడు. బస్సు లోపలికెళ్ళి కూర్చున్నాడు. కొంతసేపటికి బస్సు బస్‌స్టాండు వదిలి బయటికొచ్చింది. కిటికీ అద్దాన్ని లాగటానికి వెనక్కు తిరిగిన వివేక్ చూపులు రోడ్డు పక్కనున్న వ్యక్తిమీదపడి కనుబొమ్మలు పైకి లేచాయి. బంకు ముందు నిలబడి సిగరెట్ తాగుతూ నిలబడ్డ ఓ గుండు కొట్టుకున్న శాల్తీతో కైలాష్ మాట్లాడుతూ నిలబడి ఉన్నాడు. అతడి చూపుల్లో కపటత్వం కనిపించింది.




కుప్పం.

హోటల్ సామ్రాట్‌లో రూమ్ తీసుకొని ప్రయాణ బడలికను తీర్చుకొని ఫ్రెషప్ అయి బయటపడ్డాడు వివేక్.

రిక్షా మాట్లాడుకుని సెయింట్ జోసెఫ్ స్కూల్‌ముందు దిగినప్పుడు సమయం ఉదయం తొమ్మిది గంటలు. ఆకాశంలో సూర్యుడు ప్రకాశంగా వెలుగుతున్నాడు.

వేవేల గులాబీలు ఒకేసారి విరిసినట్టు యూనిఫామ్‌తో చిన్నారులు మైదానం నిండుగా కనిపించారు. క్రీస్తు సేవకే అంకితమైన ఉపాధ్యాయునిలుగా ఉన్న ఒకరి

ద్దరు నన్‌లు వరండాలో కనిపించారు. తరగతులు ఇంకా ప్రారంభం కాలేదు. 'ఆఫీస్' అన్న బోర్డు తగిలించి ఉన్న గదివైపుకు దారితీశాడు వివేక్. టైప్ మిషన్‌ను గుడ్డతో తుడుస్తున్న తెల్లదుస్తుల్లోని అటెండర్ వివేక్‌ను చూసి బయటికొచ్చి- "ఎవరు కావాలి సార్?" అని ప్రశ్నించాడు.

"మిస్ స్వస్తికాను కలవాలి!"

"మిస్ స్వస్తికానా? ఆమెకేమవుతారు?"

"ఫ్రెండ్"

"చాలా బెస్ట్ ఫ్రెండా సార్?"

"ఔను!"

"మీరు బెస్ట్ ఫ్రెండ్ అయి ఉంటే మిసెస్ స్వస్తికాను మిస్ స్వస్తికా అని పిలిచేవారు కారు" అని వ్యంగ్యంగా నవ్వాడు.

"సారీ! మిసెస్ అనబోయి మిస్ అన్నాను. ఆమెను నేను కలవాలి!!"

"ఆమె లీవులో ఉన్నారు సార్..?"

"లీవా? ఎన్ని రోజులు పెట్టారు?!"

"పోయిన సోమవారం లీవు పెట్టి వెళ్లారు. ఇంకా స్కూలుకు రాలేదు. నేను కూడా హాస్టల్ కెళ్ళి రెండుమూడు సార్లు చూసి వచ్చాను"

"ఎందుకోసం లీవు పెట్టారో తెలుసా?"

"తెలియదు సార్!"

"ఆమె ఉంటున్న హాస్టల్ ఎక్కడుంది?"

"ఆర్కేనగర్‌లో.. నెహ్రూ బాల మందిర్‌కు పక్కన. లైట్ చందనం డిస్టెంపర్ కొట్టిన భవనంలోని ఏ-బ్లాక్‌లో 5వ నంబర్ గది"

వివేక్ ఆ అటెండర్‌కు థ్యాంక్స్ చెప్పి బయటికి వచ్చాడు. మనస్సులో ఆశ్చర్యం చోటు చేసుకుంది.

స్వస్తికా వివాహితురాలు. స్వస్తికాకు పెళ్ళైన విషయం వనజకు తెలియదు'

# కొత్తగాలి...

**అకలి యజ్ఞంలో**
**సమిధకు సిద్ధమైన**
**గింజధైర్యం..**
**తినే నీకు ఆదర్శం..**

– కె.ఆర్.వి.వి. రత్నకుమారి, హైదరాబాద్

మళ్ళీ రిక్షా మాట్లాడుకొని ఆర్కేనగర్ లోని ఆ హాస్టల్ ముందు దిగి లోపలికి వెళ్లాడు. 'వే టు ఎ-బ్లాక్' అని రాసిన బోర్డు సూచించిన దిశగా నడిచాడు. కిటికీ తిన్నెపై ఉంచిన ట్రాన్సిస్టర్ నుండి వస్తున్న సినీ గీతాలను వింటున్నారు కొంతమంది యువతులు. చెట్లకింద కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు మరికొందరు. ఇలా అందరినీ గమనిస్తూ వెళుతున్న వివేక్‌కు కళ్ళద్దాలు ధరించిన ఒక మధ్య వయస్కు రాలు ఎదురుపడింది. 'హాస్టల్ వార్డెన్ అయి ఉండొచ్చు' అనుకున్నాడు వివేక్. ఇంతలో ఆవిడే ప్రశ్నించింది, "ఎవరు కావాలి మీకు?"

"మిసెస్ స్వస్తికా"

ఆమె ముఖంలో మార్పు స్పష్టంగా కనిపించింది.

"ఆ అమ్మాయికి మీరేం కావాలి?"

"ఏమీ కాను మేడమ్.. నేను క్రైమ్ బ్రాంచ్ పోలీస్ ఆఫీసర్‌ను" అని ఐడెంటిటీ కార్డు తీసి చూపించాడు.

వార్డెన్ ముఖంలో లీలగా కలవరపాటు కనిపించింది.

"పోలీసులా? ఆ అమ్మాయిని ఎందుకు వెదుక్కుంటూ వచ్చారు?"

"ఓ హత్యకేసుకు సంబంధించి విచారణ చెయ్యాలి.."

"హత్యా? చనిపోయిందెవరు?" కంగారుగా అడిగింది వార్డెన్.

"స్వస్తికా స్నేహితురాలు.. దేవి!"

"స్వస్తికా ఇప్పుడు హాస్టల్లో లేదే! ఊరెళ్ళి వారం రోజులైంది. గత సోమవారం ఉదయం ఇక్కణ్ణించి బయలుదేరి వెళ్ళింది..."

"ఏ ఊరికి?"

"పీలేరు"

"పీలేరా? స్వస్తికా వాళ్ళ సొంత ఊరు మదనపల్లి కదా?"

"పీలేరులోనే ఆమెభర్త ఉంటున్నది?"

"అతని పేరు తెలుసా మేడమ్?"

"తెలుసు! అతని పేరు మాధవ్!! పీలేరులో ఓ ప్రైవేట్ కంపెనీలో మేనేజర్‌గా పనిచేస్తున్నారు. నెలకోసారి కుప్పం వస్తాడు. స్కూలు సెలవున్నప్పుడు స్వస్తికా పీలేరు వెళ్ళొస్తుంటుంది. గత సోమవారం ఉన్నపళంగా సూట్‌కేస్ సర్దుకొని నా ముందు నిలబడింది. 'ఊరువెళ్ళి నాలుగైదు రోజులలో తిరిగి వచ్చేస్తానని' చెప్పింది. కానీ ఇంతవరకూ రాలేదు.."

"ఆమె ఉంటున్న గదిని నేను చూడాలనుకుంటున్నాను అనుమతిస్తారా?"

"నాతో రండి" అంటూ 5వ నెంబరు గదికి తీసుకొచ్చింది. గదిలో మంచంపై పడుకొని వారపత్రికను చదువుతున్న ఓ యువతి వార్డెన్‌నూ, వివేక్‌నూ చూసి చప్పున లేచి కూర్చొంది. సల్వార్ కమీజ్‌లో సినీతారలా కనిపించిందా అమ్మాయి. గోడవారగా జరిగి నిల్చుంది.

"ఇదే స్వస్తికా గది. ఓ గదిలో ఇద్దరుండే పద్ధతి ఈ హాస్టల్‌లో ఉంది. ఈమె అలేఖ్య. స్వస్తికా రూమ్మేట్"

వివేక్ గదిలోకి నడిచాడు. ఒకరు మాత్రమే ఉండదగిన గది అది. అల్మారా తలుపు రెక్కలపై అంటించి ఉన్న సినీతారల పోస్టర్‌ను చూసి చిన్నగా నవ్వాడు.

"మిస్ అలేఖ్యా..?"

ఆ అమ్మాయి చిటికెన వేలి గోరును మునిపంటితో కొరుకుతూ వివేక్‌వైపు చూసింది.

"స్వస్తికా కోసం తిరుపతి నుండి దేవి అన్న యువతి ఇక్కడికి ఎప్పుడైనా వచ్చిందా? " అడిగాడు వివేక్.

"దేవా? "

"ఎస్.."

"ఆమె ఎప్పుడూ ఇక్కడికి రాలేదుసార్! అయితే ఆ పేరుతో ఉత్తరాలొచ్చేవి"

"స్వస్తికా ఆ ఉత్తరాలను చూపించేదా? "

"ఊహూఁ.. చూపించేది కాదు"

"స్వస్తికా ఉన్నట్టుండి ఎందుకోసం పీలేరు వెళ్ళిందో తెలుసా మీకు? !"

"తెలియదు"

"మీతో చెప్పలేదా? "

"పీలేరు వెళుతున్నాను.. తిరిగి రావటానికి నాలుగైదు రోజులు పడుతుందని చెప్పిందికానీ, కారణమేమిటో చెప్పలేదు"

"స్వస్తికా అల్మైరా ఏది.. ఇదేనా? " అంటూ అక్కడున్న దాన్ని చూపించాడు.

అలేఖ్య అవునన్నట్టు తలూపింది.

వివేక్ అల్మారా తలుపులను బార్లా తెరిచాడు. లోపలినుండి నేప్తలిన్ బాల్స్ సువాసన ముక్కుపుటాలకు సోకింది. మొదటి అరలో. ఆగిపోయిన ఒక అలారం టైమ్‌పీస్, ఎండిపోయిన మాలతో వేంకటేశ్వర స్వామి ఫోటో, అగరువత్తుల స్టాండ్, కర్పూరం ప్యాకెట్ ఉన్నాయి.

రెండవ అరలో- కొన్ని వారపత్రికలు, సన్నటి ఇనుపతీగకు గుచ్చిన ఇన్‌ల్యాండ్ లెటర్లు, 'నోట్స్ ఆఫ్ లెసన్' అని రాసున్న నోటు పుస్తకం కనిపించాయి. వివేక్ ఆ ఉత్తరాలను అందుకొని ఒక్కొక్కటిగా తీసి చూడసాగాడు. భర్త మాధవ్ రాసిన కొన్ని ఉత్తరాలు.. స్నేహితుల ఉత్తరాలు.. వాటి మధ్యలో దేవి రాసిన ఉత్తరం కనిపించింది. దాన్ని విప్పాడు.

ప్రియమైన స్వస్తికా..

నీ ఉత్తరం అందుకున్నాను. చాలా సంతోషించాను. వేటిమీదా ఆసక్తిలేక జీవితాన్ని కొనసాగిస్తున్న నాకు నువ్వొస్తున్నావన్న వార్త ఎంతో ఆనందాన్ని కలిగిస్తోంది. నా భర్త కూడా ఊళ్ళో లేరు. ఏదో 'సినిమా' విషయమై హైదరాబాద్ వెళ్ళారు. నీతో కొన్ని విషయాలు మనసు విప్పి మాట్లాడాలి. గతవారం వనజకు ఒక ఉత్తరం రాశాను. ఆమె కూడా వెంటనే బదులిచ్చింది. నిన్నూ, ఆమెనూ కలిసి తనివితీరా మాట్లాడాలని ఉంది. నువ్వు కుప్పం నుండి తిరుపతికి ట్రాన్స్‌ఫర్ చేసుకొని రాలేవా? ప్రయత్నించవూ? !

నువ్వు చివరిగా రాసిన ఉత్తరం ప్రకారం సోమవారం రాత్రి పదిగంటలకు ఇంటికి వస్తావని అనుకుంటున్నాను. నువ్వు వచ్చేంతవరకూ నీకోసం తలుపు దగ్గరే కాచుక్కూర్చుని ఉంటాను. నన్ను మోసం చెయ్యకు.. తప్పకుండా రా..

ఇట్లు

నీ ప్రియమైన దేవి

ఉత్తరాన్ని పూర్తిగా చదివిన వివేక్ దాన్ని మడిచి షర్టుజేబులో పెట్టుకున్నాడు. మిగతా ఉత్తరాలను అటు ఇటు చూసి మూడోఅరలోకి దృష్టి సారించాడు.

అందులో ఉన్న చిన్నఫైల్‌పై వివేక్ దృష్టిపడింది.

దాన్ని చేతిలోకి తీసుకున్నాడు. ఫైల్ తెరిచాడు.

'శక్తి క్లినిక్' లెటర్‌ప్యాడ్ కాగితంపై స్వస్తికా పేరు రాసి, కింద అర్థంకాని వైద్య భాషలో ఏవో రాసున్నారు. రెండు ఎక్స్-రేలు.. 'రే విజయ్ లేబొరేటరీ'లో చేసిన రక్తపరీక్షల రిపోర్టులు.. ఏవేవో మందులు రాసిన ప్రిస్క్రిప్షన్ కాగితాలు..

వార్డెన్ వైపుకు తిరిగాడు వివేక్.

"మేడం.. ఆరునెలల క్రితం స్వస్తికా



ఆరోగ్యానికి ఏమైందో చెప్పగలరా? "

"కుడికాలుకు చిన్న ఫ్రాక్చరైంది"

"ఫ్రాక్చరా, ఎలా జరిగింది? "

"బస్సు ఎక్కటానికి పరుగెత్తినపుడు కాలు జారి క్రిందపడి మోకాలు జాయింట్ ఫ్రాక్చరై నెలరోజులపాటు బెడ్‌లో ఉంది. దానికి సంబంధించిన ఫైలే అది"

వివేక్ ఆ ఫైల్‌లోని ఒక్కో కాగితాన్నీ పరిశీలించి అన్నాడు, "మేడమ్.. ఈ ఫైల్ మాకు కావాలి. విచారణ ముగిశాక స్వస్తి కాకు తిరిగి ఇచ్చేస్తాం"

మౌనంగా తల ఊపింది వార్డెన్.

వివేక్ అలేఖ్య వైపుకు తిరిగాడు:

"మిస్ అలేఖ్యా.. స్వస్తికాతో కలిసి ఈ గదిలో ఎన్నాళ్ళుగా ఉంటున్నారు? "

"ఒక యేడాదిగా"

"స్వస్తికా స్వభావం ఎలాంటిది..? "

"కాస్త మూడీటైప్ సార్"

"మూడీ టైప్ అంటే..? "

"బాగా నవ్వుతూనే మాట్లాడుతూ ఉంటుంది. ఉన్నట్టుండి అప్‌సెట్ అయినట్టు కూర్చుండిపోతుంది. ఏంటని అడిగితే సరిగ్గా సమాధానం చెప్పదు."

"కారణమేమైవుంటుందో కనిపెట్టారా? "

"లేదు"

"స్వస్తికా భర్తను మీరు చూశారా? "

"చూశాను.."

"వాళ్ల మధ్యా అన్యోన్యత ఉంది కదూ? "

"నాకు తెలియదు సార్"

"గత సోమవారం ఉదయం పీలేరుకు బయలుదేరుతున్నప్పుడు స్వస్తికా ఎలాంటి మూడ్‌లో ఉందో చెప్పగలరా? "

"సంతోషంగానే కనిపించింది"

"ఈ హాస్టల్లో ఇంకెవరైనా స్వస్తికాతో సన్నిహితంగా ఉండేవాళ్ళున్నారా? "

"ఎవరూ లేరు"

"బయటినుండి ఫ్రెండ్స్ వచ్చేవారా? "

"ఎవరూ వచ్చేవారు కారు!"

"మేడమ్.. మీకేమైనా తెలుసా? " వార్డెన్‌ను ఉద్దేశించి అడిగాడు వివేక్.

"నెలకోసారి ఆమెభర్త వచ్చేవాడు. ఇంకెవరూ వచ్చేవారు కారు" ఆమె అలా అంటూ ఉండగానే, గది బయట ఒక యువతి వచ్చి నిలబడింది.

"మేడమ్, మీకు ఫోన్"

"నాకా? "

"ఎస్ మేడమ్.."

వార్డెన్ వివేక్‌తో అంది, "ఎక్స్‌క్యూజ్ మీ, ఇప్పుడే వస్తాను" అంటూ వెళ్ళింది.

మరో గదిలోకి వెళ్ళి రిసీవర్ అందుకొని, "హలో" అంది.

"హలో.. గుడ్‌మార్నింగ్ మేడమ్! నేను మాధవ్‌ను, స్వస్తికా భర్తను. పీలేరు నుండి మాట్లాడుతున్నాను."

"ఓ మీరా! చెప్పండి, ఏమిటీ విషయం? "

"మేడమ్, స్వస్తికాను కాస్త పిలుస్తారా! ఆమె స్కూలుకు వెళ్ళిపోయుంటే నేనిప్పుడు చెప్పబోయే విషయాన్ని సాయంత్రం ఆమె వచ్చాక చెప్పండి! అందుకోసమే ఫోన్ చేశాను. గదిలో ఉందా? "

వార్డెన్ అదిరిపడి, రిసీవర్‌ను విడవబోయి గట్టిగా బిగించి పట్టుకుంది.

★ ★ ★

వార్డెన్ చప్పున సర్దుకొని కీచుకొంతుతో అంది, "మిస్టర్ మాధవ్. మీరేమంటున్నారో నాకర్థంకావటంలేదు. మిమ్మల్ని కలవడానికే స్వస్తికా పీలేరుకు బయలుదేరి వచ్చింది. ఇంకా హాస్టల్‌కు రాలేదు".

ఇప్పుడు అదిరిపడ్డం మాధవ్ వంతైంది.

"మేడమ్.. ఏమిటి మీరంటున్నది? నన్ను కలవడానికే స్వస్తికా ఇక్కడికి బయలుదేరి వచ్చిందా? ఎప్పుడు..? "

"గత సోమవారం.."

"సోమవారమా? పీలేరుకు రాలేదే? "

"పీలేరుకు రాలేదా? అక్కడికే వెళుతున్నట్టు చెప్పిందే. ఒకవేళ మదనపల్లిలో







వాళ్ళ అమ్మగారింటికి వెళ్లిందేమో? "
"లేదు మేడమ్. అక్కడికి వెళ్ళుండదు."
"ఎలా చెప్పగలరు? "
"ఒక సమస్య కారణంగా ఆమెను అక్కడకు వెళ్ళకూడదని చెప్పాను. సో.. ఆమె కచ్చితంగా అక్కడికి వెళ్ళుండదు.."
"మిస్టర్ మాధవ్.."
"ఎస్ మేడమ్.."
"మీరు నాకు ఫోన్ చెయ్యకముందు తిరుపతి నుండి క్రైమ్ బ్రాంచ్ ఆఫీసర్ ఒకతను వచ్చాడు. దేవి అన్న యువతి హత్యకు సంబంధించి స్వస్తికాను విచారణ చెయ్యడానికి వచ్చాడు. ఇంకా అతడు స్వస్తికా గదిలోనే ఉన్నాడు"
"ఏమిటీ దేవిని హత్య చేశారా? "
"దేవి మీకు తెలుసా? "
"నేను ఆమెను చూశాను. స్వస్తికా ఆమె గురించి చాలా విషయాలు చెప్పేది"
"మీరు లైన్‌లో ఉండండి మాధవ్. ఆ ఆఫీసర్‌ను మీతో మాట్లాడమని చెబుతాను" అని స్వస్తికా గదిలోని ఆఫీసర్‌ను వెంటనే పిలుచుకురమ్మని ఒక అమ్మాయికి చెప్పి పంపింది.
ఆ అమ్మాయి పరుగెత్తుకొని వెళ్ళి వివేక్‌ను వెంటబెట్టుకుని వచ్చింది. వార్డెన్ విషయాన్ని రెండు ముక్కల్లో చెప్పి రిసీవర్‌ను అందించింది.
"హలో.. అయామ్ వివేక్! క్రైమ్ బ్రాంచ్.."
"సార్! నేను మాధవ్.. స్వస్తికా హజ్‌బెండ్‌ను.."
"మిస్టర్ మాధవ్.. గత సోమవారం ఇక్కడ నుంచి పీలేరుకు బయలుదేరిన మీ భార్య మీ ఇంటికి రాని పక్షంలో ఇంకెక్కడికి వెళ్ళుండొచ్చని భావిస్తున్నారు? "
"నాకేమీ తోచడంలేదు సార్.."
"స్వస్తికా పీలేరుకు వస్తున్నట్టు మీకు ఉత్తరం రాయలేదా? "
"లేదు సార్!"
"అయితే దేవికి ఉత్తరం రాసింది! దేవి అందుకు రిప్లయి కూడా ఇచ్చింది. స్వస్తికా గత సోమవారం దేవివాళ్ళ ఊరికి వెళ్ళి ఉంటుందని అనుకుంటున్నాను. ఆరాత్రే దేవి హత్యకు గురయింది. ఆ హత్యకూ స్వస్తికాకు సంబంధం ఉండాలి? "
"సార్.."
"ఆ విషయాలన్నీ ఫోన్‌లో మాట్లాడ్డం బావుండదు. మీరు రేపు ఉదయం తిరుపతి క్రైమ్ బ్రాంచ్ ఆఫీసుకు రండి. నేను కుప్పం నుండి ఈరోజే బయలుదేరుతాను. మీరు వస్తున్నప్పుడు మీ భార్య ఫొటో ఒకటి పట్టుకురండి!! కేసు దర్యాప్తుకు ఉపయోగపడొచ్చు."
"పట్టుకొస్తాను సార్.."
రిసీవర్‌ను క్రిందపెట్టాడు వివేక్.

★ ★ ★

మరుసటిరోజు ఉదయం పదిగంటలు.
తిరుపతి క్రైమ్ బ్రాంచ్ ఆఫీసుగదిలో వివేక్, గోకుల్‌నాథ్ ఏదో చర్చించుకుంటున్నారు. వాళ్ళకు సమీపంలో మాధవ్ చాలా దిగాలుగా కూర్చొని ఉన్నాడు. అతడి వయసు ముప్ఫైలోపే ఉంటుంది.
"మిస్టర్ మాధవ్.. స్వస్తికా మదనపల్లెకు వెళ్ళలేదని కన్‌ఫర్మ్ చేసుకున్నారా? "
నిన్ననే కన్‌ఫర్మ్ చేసుకున్నాను సార్! స్వస్తికా తన పుట్టింటికి వెళ్ళలేదు. సోమవారం తిరుపతికి వచ్చిన ఆమె కచ్చితంగా దేవి ఇంటికే వెళ్ళి ఉండాలి"
"అయితే, దేవి ఇంటికి వెళ్ళిన స్వస్తికా ఏమైనట్టు...? " మధ్యలో కల్పించుకున్న గోకుల్‌నాథ్ ఒక్క క్షణమాగి మళ్ళీ అన్నాడు, "దేవి హత్య కేసులో కచ్చితంగా ఒక స్త్రీకి సంబంధం ఉన్నట్టు మొదటి నుండీ పోలీసులకు అనుమానం ఉంది. ఆ స్త్రీ స్వస్తికా ఎందుకు కాకూడదు..? "
మాధవ్ చలించిపోయాడా మాటలకు.

"ఇన్‌స్పెక్టర్, స్వస్తికా దేవిని హత్యచేసి ఉంటుందని అనుమానిస్తున్నారా?"

"కేసు ఆ దిశగా ముందుకెళుతోంది మాధవ్. దేవికి, స్వస్తికాకు మధ్య ఏదో పగ ఉన్నట్టుంది. స్వస్తికా పీలేరుకు వస్తున్నట్టయితే మీకు ఉత్తరం రాసే వస్తుందని చెప్పారు. అయితే ఈ దఫా అలాంటి ఉత్తరమేదీ స్వస్తికా నుండి మీకు అందలేదు. తానుగా ఉన్నట్టుండి బయలుదేరి వచ్చినట్టుంది. ఆమె దేవి ఇంటికి వచ్చి ఉండాలనడానికి ఒకే ఒక సాక్ష్యం, దేవి స్వస్తికాకు రాసిన ఈ ఉత్తరమే!" బల్లపైనున్న ఉత్తరాన్ని చూపించాడు గోకుల్‌నాథ్.

"సార్.. దేవీ, నా భార్యా ఇద్దరూ మంచి స్నేహితురాళ్లు. మా ప్రేమ వివాహాన్ని జరిపించింది దేవే సార్.."

అంతవరకూ మౌనంగా వాళ్ళ మాటల్ని వింటూ కూర్చొని ఉన్న వివేక్- మాధవ్ చెప్పిన ఆ చివరి వాక్యం విని చప్పున ముందుకు వంగాడు.

"మాధవ్.. మీది ప్రేమ వివాహమా?"

"ఔను! ఎన్నో అడ్డంకుల మధ్య దేవి సాయంతో మా వివాహం జరిగింది"

"అడ్డంకులంటే ఎలాంటివి? మీ వైపు నుండా, లేక స్వస్తికా వైపు నుండా?"

"ఇరువైపులనుండీ వచ్చాయి. అయితే ఆ అడ్డంకులన్నీ రెండు మూడు నెలలవరకూ ఉన్నాయంతే!! ఆ తర్వాత మా వివాహాన్ని పెద్దలు అంగీకరించారు. రెండు కుటుంబాల వాళ్ళూ రాకపోకలు ప్రారంభించారు. మా ఇంట్లో వాళ్ళందరికీ స్వస్తికా అంటే మంచి అభిప్రాయమేర్పడింది"

"నిన్న ఉదయం మీరు స్వస్తికాతో మాట్లాడాలని కుప్పంకు ఫోన్ చేశారు. ఎందుకు చేశారో నేను తెలుసుకోవచ్చా?"

"స్వస్తికా చాలారోజుల నుండి తనకు నెక్లెస్ కావాలని అడుగుతుండేది. నా ఫ్రెండ్ ఒకతను తన వద్దనున్న నగల్ని అమ్మబోతున్నాడని తెలిసింది. అతని దగ్గరనుండి ఒక నెక్లెస్ కొందామని స్వస్తికాకు చెబుదామని ఫోన్ చేశాను"

వివేక్ ఉన్నట్టుండి ప్రశ్నను మార్చాడు.

"మాధవ్ మీకు వనజ తెలుసా?"

"వనజా?"

"ఔను! ఆమె శ్రీకాళహస్తిలో ఉంటున్నారు. ఆ వనజ కూడా మీ భార్య క్లాస్‌మేట్! ఆమెను కలిసినప్పుడే స్వస్తికా గురించి మాకు తెలిసింది. వనజ గురించి మీ భార్య మీకెప్పుడూ చెప్పలేదా?"

"చెప్పలేదే"

"మీ ప్రేమ వ్యవహారం దేవికి తెలుసు! కానీ వనజకు తెలియకపోవటం ఆశ్చర్యంగా ఉందే?!"

"ఆ వనజకూ నా భార్యకూ టర్మ్స్ సరిగ్గా లేకపోయి ఉండొచ్చు. అదీగాక మా పెళ్ళికి మేమెవరినీ పిలవలేదు"

"స్వస్తికాకు ఈ తిరుపతిలో దేవి తప్ప ఇంకెవరైనా తెలిసినవాళ్ళున్నారా?"

"కచ్చితంగా లేరు."

"అంటే.. గత సోమవారం రాత్రి స్వస్తికా తప్పకుండా దేవి ఇంటికే వచ్చి ఉండాలి" వివేక్ అలా అంటుండగానే మాధవ్ అడ్డుపడ్డాడు.

"సార్! స్వస్తికాను ఈ హత్యకేసులో దయచేసి ఇరికించకండి! ఆమె వేరే ఎక్కడికైనా వెళ్ళుండొచ్చు."

వివేక్ నవ్వాడు.

## కొత్తగాలి...

**అవినీతి అక్రమాలతో**
**క్షీణిస్తున్న దేశ ఆరోగ్యం**
**ప్రజలే చెయ్యాలి వైద్యం**

**- పరుచూరి శ్రీనివాసరావు,**
**కోలవెన్ను, కృష్ణా జిల్లా**



"లుక్ మాధవ్.. దేవి హత్యచేయబడి నేటికి వారం కావస్తోంది! దేవి ఇంటికి స్వస్తికా వెళ్ళలేదంటే మరెక్కడికి వెళ్ళి నట్టు? ఆమెలో ఏ తప్పూ లేనప్పుడు ఇలా కనుమరుగై ఉండాల్సిన అవసరం లేదు. దేవి ఇంటికి మీ భార్య వెళ్ళిందనటానికి మరో బలమైన సాక్ష్యం కూడా ఉంది"

వివేక్ అలా అనగానే ఇన్‌స్పెక్టర్ గోకు ల్‌నాథ్, మాధవ్ లిద్దరూ అదిరిపడ్డారు. మాధవ్ వెంటనే అడిగాడు:

"సాక్ష్యమా.. ఏంటది? "

వివేక్ టేబుల్ సొరుగులోంచి ఓ ఫైల్‌ను తీసి పైన వేశాడు.

"ఇది ఏం ఫైలో మీకు తెలుసా మాధవ్? "

మాధవ్ దాన్ని ఓమారు చూసి చెప్పాడు, "ఇది నా భార్య మెడికల్ ఫైల్! కాలు ఫ్రాక్చర్ అయి, ట్రీట్ మెంట్ తీసు కుంటున్నప్పుడు.. ఇచ్చిన ఫైల్ ఇది"

"కరెక్ట్!" వివేక్ ఆ ఫైల్‌ను తెరిచి అందులోనుండి 'రే విజయ్ లేబొరేటరీ' వాళ్ళ రిపోర్టును చూపిస్తూ అన్నాడు-

"ఈ రిపోర్టు ప్రకారం స్వస్తికా బ్లడ్ గ్రూప్ ఏమిటో చెప్పగలరా మాధవ్? "

మాధవ్ చదివి చెప్పాడు,

"బి-నెగిటివ్!!"

"దేవి ఇంట్లో తలుపు గెడియపై నున్న రక్తపు మరకలు కూడా బి-నెగిటివ్ అని ఫోరెన్సిక్ రిపోర్టు చెబుతోంది. బ్లడ్‌గ్రూప్ బి-నెగెటివ్ అన్నదాన్ని బట్టి.."

"అది దేవి రక్తమై ఉండొచ్చు కదు సార్? !"

"దేవి బ్లడ్‌గ్రూప్ ఏ-పాజిటివ్. సో అది హతురాలైన దేవి రక్తం కాదు!! దేవిని హత్యచేసే ప్రయత్నంలో హంతకురాలి చేతికి గాయమై ఉండాలి. రక్తం కారు తున్న చేతులతో తలుపు గెడియ తీసుకొని హంతకురాలు పారిపోయి ఉండాలి.. ఇదీ పోలీసుల అనుమానం.."

"స్వస్తికా, దేవిని ఎందుకు హత్యచేస్తుంది సార్? "

"ఆ కారణాన్ని ఇకపైనే కనిపెట్టాలి! మీరు మాకు సహకరిస్తే సులభంగా కని పెట్టవచ్చు!"

మాధవ్ ముఖంలో భయాందోళనలు స్పష్టంగా కనిపించాయి.

"మాధవ్.. ఈ ప్రపంచంలో ఎవరూ ఎవరికీ శాశ్వతంగా మిత్రులు కారు, శత్రు వులూ కారు! పరిస్థితులే ఒకరిని మిత్రుని గానూ, మరొకరిని శత్రువుగానూ మారు స్తాయి. దేవీ, స్వస్తికా ఓ వారం ముందు ఫ్రెండ్సై ఉండొచ్చు. కానీ ఆ హత్య జరి గిన రాత్రి స్వస్తికా ఏ కారణం చేతనో శత్రువుగా మారి ఉండొచ్చు కదా? !"

"అలా ఎప్పటికీ జరగదు సార్.."

గోకుల్‌నాథ్ అడ్డుపడి అన్నాడు, "ఇది సాధ్యమే మాధవ్. కేసు ఇప్పుడు స్పష్టంగా అర్థమవుతోంది. దేవి మరణంలో స్వస్తికా ఒక ప్రధాన ముద్దాయి. పీలేరుకు వెళతా నని చెప్పి ఆమె ఏదో ఒక పథకంతో దేవి ఇంటికి వచ్చి ఉండాలి. ఆ పథకం అమ లుకు ఎవరో ఒక మగాడు సస్వికాకు సాయం చేసినట్టుంది. ఆ మగాడికీ స్వస్తి కాకు ఏదో తప్పుడు సంబంధం ఉండాలి"

"నో ఇన్‌స్పెక్టర్. మీరు చాలా ఓవర్‌గా ఊహిస్తున్నారు. నా స్వస్తికా గురించి నాకు బాగా తెలుసు. రక్తాన్ని చూస్తేనే కళ్ళు తిరిగి పడిపోయే రకం!!"

"ఉండొచ్చు! బలహీనుడికి కూడా కొన్ని సందర్భాల్లో కొండంత బలం వస్తుంది"

మాధవ్ ఏడుపు గొంతుతో అన్నాడు, "సార్, మా ప్రేమ వివాహం కోసం చాలా కష్టపడ్డ దేవిని స్వస్తికా హత్యచేసి ఉంటుం దని మీరు నమ్ముతున్నారా? "

వివేక్ అడ్డుపడ్డాడు:

"ఇదిగో చూడండి మాధవ్, పోలీసుల

దృష్టి ఎప్పుడూ ఇలాగే ఉంటుంది. మేము మాట్లాడుతున్నదంతా ఒక అనుమానం మాత్రమే.. ఆc అన్నట్టు మీ భార్య ఫొటో పట్టుకొచ్చారా? "

"తెచ్చాను సార్!"

మాధవ్ తన సంచీలోంచి నాలుగైదు ఫొటోలు తీసి వివేక్‌కు ఇచ్చాడు. వివేక్ ఫొటోని తదేకంగా చూశాడు.

స్వస్తికా అందగత్తె అనే చెప్పాలి. పెద్ద పెద్ద కళ్లు... చిన్ని పెదాలు.. పెదాలని అంటిపెట్టుకున్న ఆ నవ్వు... నున్నటి బుగ్గలు...

"స్వస్తికా వయస్సు చెప్పగలరా? "

"ఇరవైమూడు.."

ఒక్కో ఫొటోను చూస్తూ వస్తున్న వివేక్.. క్యాబినెట్ సైజ్‌లోని ఫొటోను చూస్తున్నకొద్దీ అతడి ముఖంలో రంగులు మారసాగాయి. కళ్లు చికిలించి మరీ మరీ చూశాడు. అతడిలో క్రమంగా ఆశ్చర్యం చోటుచేసుకోసాగింది.

ఆ ఫొటోను చేతబట్టుకొని లేచి నిలబడ్డాడు వివేక్.




"ఏంటి వివేక్? "

వివేక్ ముఖంలో వస్తున్న మార్పులను గమనిస్తున్న గోకుల్‌నాథ్ గాబరాగా అడిగాడు. వివేక్ ఇంకా అలాగే స్వస్తికా ఫొటోనే తదేకంగా చూస్తున్నాడు. బల్లపై నున్న స్వస్తికా ఫొటోలను గోకుల్‌నాథ్‌కు ఇచ్చాడు.

"గోకుల్‌నాథ్! ఈ ఫొటోలను బాగా చూడండి.. ఇందులో ఉన్న ఒక సాక్ష్యం మీ దృష్టికి ఆనుతుందో లేదో చూద్దాం.."

నిమిషం పాటు ఆ ఫొటోలను చూసి తల అడ్డంగా ఊపాడు గోకుల్‌నాథ్, "నాకు ఏమీ ఆనడంలేదే వివేక్.."

"సరే.. ఈ ఫొటోను చూడండి.. ఇందులోనే అసలు సాక్ష్యం ఉంది.."

గోకుల్‌నాథ్ మళ్ళీ తన చూపులతో జాగ్రత్తగా ఫొటోను గమనించాడు.

"సారీ వివేక్.." అతడు ఆ వాక్యాన్ని పూర్తిచేయకమునుపే..

"ఎస్.. అదే అదే.. మన సాక్ష్యం.." చప్పున కల్పించుకొని ఆతృతగా అన్నాడు వివేక్.

"ఏంటీ సారీనా? " అర్థంగాక అన్నాడు గోకుల్‌నాథ్.

"సారీ కాదు, శారీ! ఫొటోలో స్వస్తికా కట్టుకున్న శారీని గమనించారా? "

గోకుల్‌నాథ్ పరిశీలనగా చూశాడు.

"ఈ శారీలో ఏముంది వివేక్? "

"స్వస్తికా కట్టుకున్న వంగపువ్వు రంగులోని తెల్లని వృత్తాలు కలిగిన చీరను ఇంకెక్కడైనా చూసిన గుర్తుందా మీకు? " వివేక్ అలా ప్రశ్నించగానే చప్పున గోకుల్‌నాథ్‌కు ఫ్లాష్‌లా ఏదో స్ఫురించింది.

"ఎస్, వివేక్! ఇప్పుడు స్ఫురిస్తోంది"

"ఎక్కడ చూశారు..? "

"పార్శిల్ పెట్టెలో శవంగా కనిపించిన దేవి కూడా ఇలాంటి చీరే కట్టుకుంది.." గోకుల్‌నాథ్ అలా అంటూ ఉండగానే స్వస్తికా భర్త మాధవ్ అడ్డుపడి చెప్పాడు, "సార్.. ఇందులో ఆశ్చర్యపడాల్సిన విషయం ఏమీ లేదు! స్వస్తికా, దేవీ ఒకేలాంటి చెప్పులు.. ఒకే మాదిరిగా ఉన్న గొడుగులు.. ఇలా ఏది కొన్నా, ఒకే



రంగులోవే కొంటారు.. ఇలా కొన్ని విషయాన్ని నాకు స్వస్తికా చాలా సందర్భాల్లో చెప్పేది."

వివేక్ అతని మాటల్ని పట్టించుకోకుండా అన్నాడు, "గోకుల్‌నాథ్.. కుప్పంకు నేను చెప్పే టెలిఫోన్ నెంబర్‌కు డయల్ చేయండి"

'ఏం? ఎందుకు?' అని అడక్కుండా గోకుల్‌నాథ్ రిసీవర్ అందుకొని వివేక్ చెప్పిన నెంబర్‌కు డయల్ చేశాడు. లైన్ దొరికాక ఫోన్ వివేక్‌కు అందించాడు.

"హలో, కస్తూరిబా లేడీస్ హాస్టలేనా?"

"ఔను.."

"మీ వార్డెన్‌ను కాస్త పిలుస్తారా?"

"హోల్డింగ్"

"మేడమ్, నేను వివేక్‌ను.. తిరుపతి క్రైమ్‌బ్రాంచ్ నుండి మాట్లాడుతున్నాను"

"చెప్పండి సార్.."

"స్వస్తికా రూమ్మేట్ అలేఖ్యతో కాస్త మాట్లాడాలి"

"లైన్‌లో ఉండండి.."

కాసేపటికి అలేఖ్య లైన్‌లోకి వచ్చింది. పరుగెత్తుకొచ్చినందువల్ల ఆయాసంతో వగరుస్తోంది.

"మిస్ అలేఖ్యా.."

"ఎస్.. నేనే మాట్లాడుతున్నాను.."

"చూడు మిస్ అలేఖ్యా.. నేను ఇప్పుడు అడగబోయే ప్రశ్నకు బాగా ఆలోచించి జవాబు చెప్పండి."

"అడగండి సార్"

"స్వస్తికా ఊరికి వెళ్లేటప్పుడు ఏ రంగు చీర కట్టుకుందో చెప్పగలరా?"

అలేఖ్య ఆలోచించి చెప్పింది.

"వంగపువ్వు రంగులో.. తెల్లని వృత్తాలు కలిగిన సిల్క్ శారీ కట్టుకుంది సార్"

"కచ్చితంగా అదే శారీని కట్టుకున్నట్టు గుర్తుందా?"

"ఎస్ సార్!"

"థాంక్యూ వెరీ మచ్" రిసీవర్‌ను క్రెడిల్ చేసి గోకుల్‌నాథ్ వైపుకు తిరిగాడు.

"గోకుల్‌నాథ్.. మీకు కైలాష్ ఆఫీసు ఫోన్ నెంబర్ తెలుసా?"

"తెలుసు.."

"ఫోన్ చేసి వెంటనే అతణ్ణి ఇక్కడికి రమ్మని చెప్పండి"

"గోకుల్‌నాథ్ అలాగే చెప్పి, రిసీవర్‌ను పెట్టి వివేక్‌ను అడిగాడు,

"కైలాష్‌ను ఎందుకు రమ్మన్నావు?"

"కేసులో ఒక కొత్త కన్‌ఫ్యూజన్ మొదలైంది గోకుల్‌నాథ్"

"కొత్త కన్‌ఫ్యూజనా?"

"ఔను! నిజంగా హత్య చేయబడింది దేవా.. లేక స్వస్తికానా? అర్థం కావటం లేదు. ఆ రోజు బాడీని చూసినపుడు కనిపించకుండా పోయిన దేవిని దృష్టిలో పెట్టుకొని మీరూ నేనూ.. ఇంకా అందరం చూశాం.. బాడీ డీకంపోజ్ అయినందువల్ల ఆ శవం దేవిదేనని నిర్ణయించేశాం! కానీ ఆ శవం స్వస్తికాది ఎందుకు కాకూడదు?"

గోకుల్‌నాథ్ నిర్ఘాంతపోయి వివేక్‌ను చూశాడు.

మాధవ్ 'నో..' అంటూ గట్టిగా అరిచి, కుర్చీని వెనక్కు తోసి లేచి నిలబడ్డాడు.

అతడి ముఖం పాలిపోయి ఉంది.

★ ★ ★

గంట పర్మిషన్ పెట్టి విసుగ్గా ఆఫీసు నుండి బయటపడ్డాడు కైలాష్.

"ఈ దేవి వ్యవహారం ఎప్పుడు ముగుస్తుందో, ఏమిటో? తలచుకున్నప్పుడల్లా స్టేషన్‌కు రమ్మంటున్నారు.." గొణుక్కుంటూ ఖాళీగా వెళుతున్న ఆటోను ఆపి ఎక్కి కూర్చున్నాడు కైలాష్.

పదిహేను నిమిషాల తర్వాత కైలాష్ క్రైమ్‌బ్రాంచ్ కార్యాలయంలోకి అడుగుపెట్టాడు.

"రండి కైలాష్.." వివేక్ అతణ్ణి లోనికి ఆహ్వానించి, అక్కడున్న కుర్చీ చూపించాడు. కైలాష్ కూర్చుంటూ మాధవ్‌ను వింతగా చూశాడు.

గోకుల్‌నాథ్ కైలాష్‌తో అన్నాడు, "కైలాష్.. ఇతను మిస్టర్ మాధవ్.. స్వస్తికా హజ్బెండ్.. మీ కేసులో ఇప్పుడు ఒక కొత్త కన్‌ఫ్యూజన్ మొదలైంది. అందుకే మిమ్మల్ని పిలిపించాం.."

"ఏంటి ఇన్‌స్పెక్టర్"

వివేక్ అడ్డుపడి చెప్పాడు, "కైలాష్... ఆ రోజు పార్శిల్ పెట్టెలో బాడీని చూశాం.. అది దేవిదే కదూ? "

"ఔను సార్!"

"మీరు బాగా చూశారా? "

"ఎందుకలా అడుగుతున్నారు సార్? "

"చంపబడింది దేవా.. లేక స్వస్తికానా అని ఇప్పుడు కన్‌ఫ్యూజన్ బయలుదేరింది. దేవిని గురించి మీకు బాగానే తెలుసు. సో, దీనికి మీరే సమాధానం చెప్పగలరు"

"అది దేవే సార్. అనుమానం లేదు!"

"ఎలా అంటున్నారు? పార్శిల్ పెట్టెలోని శవం తాలూకు ముఖం డెబ్బైశాతం డీ-కంపోజ్ అయినందువల్ల స్పష్టంగా కనపించటం లేదుగా. అయినా మీరు అది దేవి అనే చెప్పారు.. ఎలా చెప్పారు? ఏ ఆధారంతో చెప్పారు? "

"దేవి ఎత్తు.. ఆమె కట్టుకున్న చీర.. చేతికి ఉన్న 'సూళ్ళూరుపేట చెంగాళమ్మ' రాగికడియం..వీటిని గుర్తుపట్టే చెప్పాను"

"స్వస్తికా ఫొటోను మీరింతకు మునుపే చూశారుగా.. స్వస్తికా ఎంత ఎత్తు ఉండవచ్చు అనుకుంటున్నారు? "

"దేవి ఎత్తే ఉండొచ్చు."

"ఈ ఫోటోను చూడండి కైలాష్.. మీ భార్య చనిపోయినపుడు ఎలాంటి చీర కట్టుకుందో అదెలాంటి చీరో ఈ ఫోటోలో ఉన్న స్వస్తికా కూడా కట్టుకుంది. సూళ్ళూరుపేట చెంగాళమ్మ గుడికి వెళ్ళినపుడు-

# కొత్తగాలి...

ఊసరవెల్లి
ఉలిక్కిపడ్డది
తనలాగే రంగులు మార్చే
నాయకుణ్ణి చూసి!

–సి.కామేశ్వరరావు, కాశీబుగ్గ

దేవి రెండు రాగి కడియాలు కొన్నట్టు చెప్పారు. ఆ రెండు కడియాలలో ఒకటి స్వస్తికాకు ఇచ్చి ఉండొచ్చుగా? "

"అంటే హత్య చేయబడింది స్వస్తికా అని అనుమానిస్తున్నారా? " కైలాష్ గుటకలు మింగుతూ అలా ప్రశ్నించేసరికి వివేక్ చిరునవ్వు నవ్వాడు.

"నిస్సందేహంగా!"

"ఏ ఆధారంతో అలా అనుకుంటున్నారు? "

"సోమవారం ఉదయం కుప్పం నుండి బయలుదేరిన స్వస్తికా రాత్రి పది గంటలకు మీ ఇంటికి వచ్చింది.... ఆ రాత్రి మీ ఇంట్లో స్వస్తికాకు ఏమో జరిగింది! ఇది మా అనుమానం మాత్రమే!! ఇక చనిపోయింది దేవా లేక స్వస్తికానా అని తీర్మానించడానికి ఒకే ఒక మార్గం ఉంది. అదేమిటంటే.. పూడ్చిన శవాన్ని మళ్ళీ బయటకు తీయడమే.."

"శవాన్ని బయటకు తీస్తే మాత్రం ఎలా కనిపెట్టగలం సార్? ఇప్పటికే ఆ శవాన్ని మట్టి తినేసుంటుంది? !!"

"మట్టి తినేసినా బాధలేదు కైలాష్.. ఆ శవాన్ని బయటికి తీస్తే అది ఎవరిదో సులభంగా కనిపెట్టడానికి నా దగ్గరో క్లూ ఉంది"

★ ★ ★

శవాలకు దహన సంస్కారాలను చేసే



ప్రదేశం- శ్మశానం!

మధ్యాహ్నం మూడు గంటలు కావస్తోంది.. పైన ఎండ మండిపోతోంది.. చింతచెట్టు నీడలో మూడు కుర్చీలు ఉన్నాయి. అందులో డీఎస్పీ, మెజిస్ట్రేట్, వివేక్ ఆశీనులై ఉన్నారు. గవర్నమెంట్ డాక్టరొకరు జీపులో కూర్చొని ఉన్నాడు. ఫార్మలిన్‌వంటి తదితర సామగ్రి అతడి దగ్గర ఉంది.

కొంచెం దూరంలో- ఒంటిపై చొక్కాలేని ఒకవ్యక్తి, దేవి శవాన్ని పూడ్చిపెట్టినచోట మళ్ళీ గుంతను తవ్వుతూ మట్టిని పక్కన గుట్టగా పోస్తున్నాడు. గోకుల్‌నాథ్, మరో ఇద్దరు కానిస్టేబుళ్ళు అక్కడి తతంగాన్ని సీరియస్‌గా చూస్తున్నారు. వాళ్లకు దగ్గరగా కైలాష్, మాధవ్‌లిద్దరూ చెమటపట్టిన ముఖాలతో కనిపించారు. వాళ్ళ మధ్య నిశ్శబ్దం అలుముకొని ఉంది.

ముక్కును పదేపదే రాసుకుంటూ శ్రమపడుతూ కూర్చొని ఉన్న డీఎస్పీ వివేక్‌తో అన్నాడు, "ఈ కేసులో మీరు హంతకుడికి ఎంత దగ్గరగా వెళ్ళారు? "

"సారీ సార్.. ఇంతవరకూ అటువంటిదేమీ జరగలేదు. హతురాలు దేవా లేక స్వస్తికానా అన్నది తేలాకే ఈ కేసు దర్యాప్తు ముందుకెళ్ళడానికి సాధ్యపడుతుంది!!"

"కైలాష్‌ను గురించి ఏ నిర్ణయానికి వచ్చారు? "

"ఏ నిర్ణయానికీ రాలేకపోతున్నాం సార్? "

"స్వస్తికాభర్త మాధవ్ ఎలాంటివాడు? "

"అతడి గురించి తెలుసుకోవడానికి పీలేరుకు ఒక కానిస్టేబుల్‌ను పంపాను సార్! ఈ కేసుకు సంబంధించినంతవరకూ ఇందులో ఎంటరైన ప్రతి ఒక్కరినీ అనుమానిస్తున్నాం సార్!!"

వివేక్ అలా అంటూ ఉండగానే గోకుల్‌నాథ్ వారిని సమీపించాడు,

"శవాన్ని బయటికి తీశాం సార్!"

అందరూ లేచి శవం వద్దకు నడిచారు. దాని సమీపానికి వెళ్లేకొద్దీ తవ్వాబడ్డ మట్టిపై ఓ ఎముకల గూడు దర్శనమిచ్చింది.

గాలిలో ఒక వింత దుర్వాసన అక్కడ అలుముకుంది.

వివేక్ కర్చీఫ్‌తో ముక్కు మూసుకొని ఆ స్కెలిటన్‌ను సమీపించాడు. దాని ప్రక్కన కూర్చొని తన పోలీస్ కళ్ళతో క్షుణ్ణంగా పరిశీలించాక తల పైకెత్తి డీఎస్పీని చూశాడు.

"వాట్ మిస్టర్ వివేక్? "

"ఇది స్వస్తికా శవం సార్!"




వివేక్ మాటలతో నిర్ఘాంతపోయాడు డీఎస్పీ.

"బాడీని పరీక్ష చేయకముందే ఇది స్వస్తికా అని ఎలా చెబుతున్నారు వివేక్? "

వివేక్ తన సమీపంలో నిల్చొని ఉన్న ఇద్దరు కానిస్టేబుల్స్‌లో ఒకతనివైపు చూసి కళ్ళతో సైగ చేశాడు. అతడు జీపు వద్దకు వెళ్ళి ఓ ఫైల్‌ను పట్టుకొచ్చాడు. వివేక్ దాన్ని అందుకొని పేజీలను తిప్పుతూ "సార్, ఇది స్వస్తికా మెడికల్ ఫైల్! ఆరు నెలల క్రితం స్వస్తికాకు ఒక ప్రమాదం

జరిగి కుడికాలు ఫ్రాక్చరై శక్తి క్లినిక్‌లో ట్రీట్‌మెంట్ తీసుకున్నప్పుడు వాళ్ళు కుడి కాలు విరిగిన ప్రాంతంలో ఒక చిన్న స్టీల్ రాడ్‌ను జాయింట్ చేశారు. ఈ శవం కుడి కాలులో ఆ రాడ్ ఉంది. అందుకని ఇది కచ్చితంగా స్వస్తికానే అన్నది రూఢీ అయింది.."

డీఎస్పీ, గోకుల్‌నాథ్‌లిద్దరూ ఆశ్చర్యపోయారు.

"యూ ఆర్ కరెక్ట్ వివేక్"

వివేక్ కొనసాగించాడు, "హత్య చేయబడ్డది స్వస్తికానే అనడానికి మరో క్లూ కూడా ఉంది సార్!"

"ఏంటది? "

"బ్లడ్ గ్రూప్! దేవి బ్లడ్‌గ్రూప్ ఎ-పాజిటివ్! అయితే స్వస్తికా బ్లడ్‌గ్రూప్ బి-నెగెటివ్ అని 'రే-విజయ్ లాబొరేటరీ' రిపోర్టు చెబుతోంది. దేవి ఇంట్లోని పెరడు తలుపు గెడియవద్ద సేకరించిన రక్తం ఏ గ్రూపుదో కెమికల్ లేబొరేటరీ రిపోర్ట్ వచ్చింది. దాన్నిబట్టి చూస్తే స్వస్తికా రక్తమే దేవి ఇంట్లో చిందింది."

వివేక్ అలా అంటూ ఉండగానే వివేక్ పక్కన నిలబడున్న మాధవ్ దుఃఖం ఆపుకోలేక మోకాలిపై కూలబడి బోరుమని ఏడవసాగాడు.

"నో.. అలా ఎన్నటికీ జరగదు.. నా స్వస్తికా చావలేదు.. ఇందులో ఎక్కడో.. ఏదో పొరబాటు జరిగింది."

వివేక్ అతడి భుజంపై చెయ్యి వేశాడు, "చూడండి మిస్టర్ మాధవ్, ఈ కేసులో మనం ఇప్పుడే ఒక సరైన నిర్ణయానికి వచ్చాం. నేను చూసిన ఎన్నో హత్యకేసుల్లో ఇది ఓ ప్రత్యేకమైన కేసు. హతురాలు దేవి అనుకొని ఇప్పటిదాకా తప్పుదోవలో వెళ్లాం! కానీ అది స్వస్తికా అని ఇప్పుడు నిరూపణ అయింది. ఇకమీదటే ఈ కేసును ఒక కొత్త కోణం నుండి డీల్ చేయవలసి ఉంది. ఇందులో మీ తోడ్పాటు, సహకారం మాకు కావాలి.."

కళ్లల్లోంచి నీరు కారుతుంటే. మట్టి తినేసి ఒట్టి ఎముకల గూడులా మిగిలిన స్వస్తికాను చూసి కుమిలి కుమిలి ఏడవసాగాడు.

## యోగ్యత



ఓసారి రవీంద్రనాథ ఠాగూర్ నాయకుల ఖరీదైన దుస్తులు, ఆహారపుటలవాట్లను చూశారు. తర్వాత నొచ్చుకుంటూ, 'ఇంత మంచివి మనకు అవసరమా? మన తోటి ప్రజలంతా ఎలాంటి స్థితిలో ఉన్నారో చూడండి' అన్నారు తన మానవతావాద ధోరణితో.

వెంటనే శరత్, 'గురూజీ, కేవలం బాధపడటం వల్ల లాభం లేదు. ఉన్నతమైనదాన్ని అందుకునేందుకు మిగతా ప్రజలను సిద్ధం చేయాలి. అలా చేయడంలోనే వారిపై మన ప్రేమ వ్యక్తమవుతుంది. అయాచితంగా దేనినీ ఎవరికీ ఇవ్వకూడదు' అన్నారు.

"రండి మాధవ్.. అలా చెట్టు క్రిందికి వెళదాం! డాక్టర్ మిగిలిన వ్యవహారాన్ని పూర్తి చేస్తారు.."

మాధవ్ వెనక్కు తిరిగి చూస్తూ ముందుకు నడిచాడు.

"నాకు నమ్మబుద్ధి కావటం లేదు సార్.. నా స్వస్తికా చనిపోలేదు.."

"అది స్వస్తికా కాదని మిమ్మల్ని మీరే మోసం చేసుకోలేరు మాధవ్! అది స్వస్తికానే.. స్వస్తికాకు పట్టిన ఈ దుర్గతికి కార

## కొత్తగాలి...



రాజులకాలంలో
సంస్థానాలు
ప్రజాస్వామ్యంలో
ప్రత్యేక ఆర్థిక మండళ్లు

– పానుగోటి నరసింహారావు,
దుబ్బాక, నల్లగొండ జిల్లా

కులెవరో ఇకమీదటే మనం కనిపెట్టాలి."

వాళ్ల వెనుకే వస్తున్న కైలాష్ దిగులు పడ్డ గొంతుతో అన్నాడు, "సార్.. అయితే దేవి ఏమైనట్టు? "

"దేవి, ఆమెతోపాటు ఇంకో వ్యక్తి ఈ హత్యలో భాగస్వాములుగా ఉన్నారు! ఏ కారణంవల్లో స్వస్తికాను హత్య చేసిన దేవి అతనితో కలిసి కనుమరుగై ఉండాలి."

కైలాష్ అన్నాడు, "దేవి ఎందుకు స్వస్తికాను హత్య చేస్తుంది సార్? ఇద్దరూ ప్రాణస్నేహితులు! నిజంగా వాళ్ల మధ్య ఏదైనా పగ ఉంటే కుప్పంనుండి బయలుదేరిన స్వస్తికా తానుగా తిరుపతిలో దిగి దేవి ఇంటికి వెళ్లదు కదా? "

"ఎస్.. ఇట్స్ ఎ పాయింట్.." తల ఊపుతూ అన్నాడు వివేక్.

★ ★ ★

పోలీసు అధికారులు అర్ధచంద్రాకారంగా అమర్చిన కుర్చీలలో ఆశీనులై ఉన్నారు. వాళ్లకెదురుగా వివేక్, గోకుల్‌నాథ్‌లు కేసుకు సంబంధించిన ఫైలు పట్టుకొని కూర్చున్నారు. ఇద్దరి ముఖాల్లోనూ ఏదో తెలియని అసంతృప్తి గోచరిస్తోంది.

డీఎస్పీ నోరు తెరిచాడు, "హతురాలు స్వస్తికానే అని డాక్టర్లు ఇచ్చిన రిపోర్టు కూడా స్పష్టం చేస్తోంది.. ఇకపై ఈ కేసును ఎలా డీల్ చేయాలనుకుంటున్నారు వివేక్? "

"స్వస్తికా వైపునుండి ఈ కేసును ప్రారంభించాలి సార్! దేవికి ఈ హత్యతో సంబంధం ఉంది. ఆమె సహాయం లేకుండా స్వస్తికా మరణించి ఉండదు... సో! దేవికి సంబంధించి గత రెండు నెలల జీవితాన్ని దర్యాప్తు చేయవలసి ఉంది"

"నేనేం ఊహించానో చెప్పమంటారా మిస్టర్ వివేక్?!" సర్కిల్ ఇన్‌స్పెక్టర్ గురుమూర్తి గొంతు విప్పాడు.

"చెప్పండి సార్.."

"కుప్పం నుండి సోమవారం ఉదయం బయలుదేరిన స్వస్తికా రాత్రి పదిగంటలకు పైన దేవి ఇంటికి వచ్చి ఉండాలి. దేవికి ఎవరితోనో అక్రమ సంబంధం ఉండి, స్వస్తికా వచ్చిన సమయంలో వాళ్లిద్దరూ నగ్నంగా ఉండటాన్ని చూసి ఉండాలి! దాంతో కోపం తెచ్చుకుని.. అసహ్యంతో దేవిని నానా మాటలూ అని ఉండాలి. మాటా మాటా పెరిగి దేవితో ఉన్న వ్యక్తి స్వస్తికాను హత్య చేసుండాలి. అటు తర్వాత వాళ్లిద్దరూ ఆలోచించి ఇలాంటి ఒక నిర్ణయానికి వచ్చి ఉండాలి! అంటే చూడ్డానికి ఒడ్డుపొడుగులోనూ.. ఆకృతిలోనూ.. కట్టుకున్న చీరల విషయంలోనూ దేవిలాగానే ఉన్న స్వస్తికాను- శరీరం డీకంపోజ్ అయ్యాక దేవిలాగా నమ్మించడం సులభం! ఆమెను దేవిగా నమ్మించి, వాళ్లిద్దరూ కనుమరుగై ఉండాలి. కేసు ప్రారంభం నుండి ఒక మగాడు, ఒక స్త్రీ ఇందులో ఇన్‌వాల్వ్ అయి ఉన్నారు.."

వివేక్ కల్పించుకొని అన్నాడు, "స్వస్తికా చనిపోయినట్టు తెలియకూడదనే వాళ్లిద్దరూ మసలుకొంటున్నారు! అంతే కదూసార్? "

"ఎస్! హత్య చేయబడింది దేవి అని పోలీసులను నమ్మించగలిగితే, దేవికి ఉన్న అక్రమ సంబంధం.. ఆమె చెడు ప్రవర్తన ఎవరికీ తెలియకుండా పోతుంది. దేవి ఒక దుర్మార్గురాలు అనడానికి మనకు దొరికిన

ఒకే ఒక సాక్ష్యం, ఆమె తన భర్తకు తెలియకుండా బీరువాలో దాచిన ఆ కండోమ్స్ ప్యాకెట్ ఒక్కటే! ఇంటి నుండి పారిపోయే తొందరలో దాన్ని మరిచిపోయి అలాగే వదిలి వెళ్లిపోయారు..”

డీఎస్పీ తన నున్నటి గడ్డాన్ని సవరించుకుంటూ అన్నాడు, “మిస్టర్ గురుమూర్తి చెప్పినట్టు కూడా జరిగి ఉండొచ్చుగా మిస్టర్ వివేక్! తన భర్త కైలాష్ అప్పుడప్పుడూ నాటకాలు, సినిమాలని బయటి ఊళ్లకు తిరిగే వ్యక్తి. పైగా కైలాష్ ఇచ్చిన స్టేట్‌మెంట్ ప్రకారం... అతనికీ దేవికీ మధ్య అనుకూలమైన దాంపత్యం అస్సలు లేదని తెలుస్తోంది..”

“దేవి ప్రవర్తన చెడ్డదైతే ఇరుగుపొరుగు వాళ్లకూ తెలిసి ఉండాలి కదు సార్...”

“నో మిస్టర్ వివేక్... దేవి చాలా తెలివైన యువతి. ఆమె తన అక్రమ సంబంధం ఎవరికీ తెలియకుండా జాగ్రత్త పడింది. స్వస్తికాను హత్యచేసి కేసును తికమక పెట్టడానికి ఇద్దరూ బెంగుళూరు వెళ్లి అక్కడ నుండి చిత్తూరుకు దేవి పేరుతో ఒక టెలిగ్రామ్ ఇచ్చారు...”

వివేక్ అడ్డుపడి అన్నాడు, “సార్! ఇలా ఊహించటం నాకు సమంజసంగా అనిపించటం లేదు. నాకు కొత్తగా ఒక వ్యక్తిపైన అనుమానం కలుగుతోంది...”

“ఎవరిపైన? ”

“స్వస్తికా హజ్బెండ్ మాధవ్‌పైన!!”

“ఏ ఆధారంతో అనుమానిస్తున్నారు? ”

“అతని దుఃఖంలో అదో విధమైన కృత్రిమత్వం నాకు కనిపించింది. పోలీసుల ముందు మాత్రం ఏడుస్తాడు.. ఆ వ్యక్తి తీరు అనుమానాస్పదం..”

“అతణ్ని అరెస్ట్‌చేసి లాకప్‌లో పడేస్తే సరి!!”

“నో సర్! అతడిపై మనకెలాంటి సందేహం లేనట్టు నమ్మించి.. అతణ్ణి ఊరుకెళ్లమని చెప్పి పంపేశాం. ఇవ్వాళ మధ్యాహ్నం నేనూ, గోకుల్‌నాథ్ పీలేరుకు వెళ్లి సడెన్‌గా అతడి ముందు ప్రత్యక్షం కాబోతున్నాం..”

“ఒకే!” అన్నాడు డీ ఎస్పీ.

★ ★ ★

వివేక్, గోకుల్‌నాథ్ పీలేరులో దిగినప్పుడు సాయంత్రం నాలుగ్గంటలైంది. ఓ ఆటోను మాట్లాడుకొని మాధవ్ ఇంటి ముందు దిగారు.

అరుగుమీద పేపరు చదువుకుంటున్న ఓ పెద్దాయన వీళ్లిద్దర్నీ చూసి లేచి నిలబడ్డాడు.

“ఎవరు కావాలండీ? ”

“మాధవ్‌గారున్నారా? ...”

“వాడు ఆఫీస్‌కెళ్లాడే! మీరెవరు? ”

“పోలీసు డిపార్ట్‌మెంట్ నుండి వస్తున్నాం.”

పోలీసులు అన్న మాట వినగానే ఆ పెద్దాయన కాస్త కంగారుపడ్డాడు.

“పోలీస్ డిపార్ట్‌మెంట్ నుండా? !”

“ఎస్! మాధవ్‌కు మీరేమవుతారు? !”

“ఫాదర్‌ను!!”

“ఇంట్లో మీరుకాక ఇంకెవరున్నారు? ”

“ఇంకెవరూ లేరు!.. నేను మాత్రమే ఉన్నాను...”

“మీ అబ్బాయి స్వస్తికా హత్య గురించి మీకు చెప్పాడా? ”

“చెప్పాడు! కానీ నమ్మలేకపోతున్నాను!!”

“ఈ ఇంట్లో మాధవ్ గది ఎక్కడుంది? ”

“అదిగో! ఆ కుడి పక్కనున్న గదే...”

“అతడి గదిని మేము చూడాలి!”

“వాడు వచ్చాక చూడొచ్చు కదా? !”

“అతడు వచ్చేంతవరకూ ఆగేంత టైమ్ లేదు!!” అంటూ వివేక్ ఆ గదిలోకి దారి తీశాడు. గోకుల్‌నాథ్ వెంబడించాడు.

చిన్నగదే! దాన్ని సగానికి ఆక్రమించు



కున్న మంచం. కుడిపక్కగా ఒక గోద్రెజ్ బీరువా. గోడకు - మాధవ్, స్వస్తికాలు పెళ్లి బట్టల్లో ఉన్న ఫోటో, తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురించిన వేంకటేశ్వర స్వామి క్యాలెండర్ వేలాడుతున్నాయి.

గోడకున్న అల్మారా వద్దకు వెళ్లాడు వివేక్. తలుపు తీశాడు. అల్మారా నిండుగా పుస్తకాలు కనిపించాయి. అన్నీ ఇంగ్లీషు నవలలే!! హాడ్లీ... చేజ్... వాల్స్... హెరాల్డ్ రాబిన్స్... వరుసగా ఉన్నారు. అల్మైరా క్రింది అరలో తెలుగు క్రైమ్ నవలలు దర్శనమిచ్చాయి.

వాటిని పరిశీలిస్తుండగా మాధవ్ నాన్నగారు గది లోపలికి వచ్చాడు.

"మావాడ్ని సందేహిస్తున్నారా సార్?"

"నో నో ఇది ఒక ఫార్మాలిటీ మాత్రమే! బీరువా తాళాలు కావాలి, ఇస్తారా?"

ఆయన గోడకు తగిలించి ఉన్న తాళాల గుత్తిని చూపించాడు. వివేక్ దాన్ని అందుకొని బీరువాను తెరిచాడు. నేఫ్తలిన్ బాల్స్ వాసన ముక్కు పుటాలకు సోకింది. లోపల బట్టలు... నగలూ ఉన్నాయి. వివేక్ బట్టలు నలగకుండా తీసి పక్కన పెడుతూ క్షుణ్ణంగా పరిశీలించాడు. క్రింది అరను గమనిస్తున్నప్పుడు అతడి దృష్టి మూలగా ఉండ చుట్టి ఉన్న ఓ చొక్కాపైన పడింది. పసుపు రంగు చొక్కా అది! బయటకు తీశాడు దాన్ని. అది కొత్త చొక్కాలా అనిపిస్తోంది. దాన్ని తీసి విదిలించాడు. చొక్కా మధ్యలో... రంగులో... వ్యత్యాసం స్పష్టంగా కనిపించింది. చొక్కా ఛాతీ భాగాన పూర్తిగా మట్టి రంగు పులుముకుంది. చొక్కాను ఉతికాక కూడా అసలు రంగు వచ్చినట్టు లేదు.

వివేక్ గోకుల్‌నాథ్‌తో అన్నాడు.

"గోకుల్‌నాథ్, దీన్ని చూశారా?"

"చూశాను.. రక్తంలా ఉంది! ఎంతగా వాష్ చెయ్యొచ్చో అంతగా ప్రయత్నించినట్టుంది వివేక్! కానీ అసలు రంగు రాలేదు."

గోకుల్‌నాథ్ నవ్వుతూ అలా అంటూ ఉండగానే ఇంటి ముందు బైక్ ఆగిన శబ్దం వినిపించింది.

వివేక్ గదిలోని కిటికీ గుండా బయటికి చూశాడు.

మాధవ్ బైక్ స్టాండ్ వేస్తూ కనిపించాడు. అతడి ముఖంలో ఏదో అలజడి గోచరించింది.




ఇంట్లోపలికి అడుగు పెట్టిన మాధవ్‌కు - నవ్వుతూ ఎదురెళ్ళాడు వివేక్.

"రండి మిస్టర్ మాధవ్! మా రాకను మీరు ఊహించి ఉండరనుకుంటాను. పోలీసులు ఎప్పుడూ ఇంతే! వాళ్ళు అనుకున్నప్పుడు వస్తారు. వెళతారు... దాన్ని మీరు మనసులో ఏమీ పెట్టుకోకండి. అవునూ ఆఫీసునుండి ఇప్పుడే వస్తున్నారా?"

సునిశితమైన చూపులతో వివేక్‌ను కాల్చేస్తున్నట్టు చూస్తూ మాధవ్ తల ఊపాడు. తల ఊపుతూనే తెరచి ఉన్న బీరువాను... కింద పెట్టి ఉన్న బట్టలను... చూశాడు. వివేక్ నవ్వుతూ అన్నాడు: "అటు చూడకండి మాధవ్... ఇక్కడ, నా చేతిలోని ఈ చొక్కాను చూడండి..."

వివేక్ చేతిలోని చొక్కాను చూసి గతు

క్కుమన్నాడు మాధవ్.

"ఇది మీ చొక్కానే కదూ? !"

"ఔను!"

"చొక్కా మధ్యలో ఇలా ఉందేంటీ? ... ఈ మరకలు ఏమిటో కాస్త చెబుతారా? "

"రక్తం" మాధవ్ గొంతు జీరబోయింది.

"ఎవరి రక్తం? "

"నా రక్తమే సార్!"

"మీ రక్తమా? "

"ఔను సార్! మేడే సందర్భంగా మా ఫ్యాక్టరీ కార్మికులు ఉత్సవాన్ని జరుపుకుంటున్నప్పుడు... ఇరు వర్గాల మధ్య ఒక చిన్నపాటి ఘర్షణ చోటు చేసుకుంది. నేను సర్ది చెబుతుండగా ఒకడు రెచ్చిపోయి నా ముక్కుపై గుద్దడంతో... ముక్కు నుండి రక్తం కారి నేను వేసుకున్న కొత్త చొక్కా అంతా పాడైపోయింది. ఎన్నిసార్లు ఉతికినా... ఆ రక్తపు మరకలు పోకపోయేసరికి... చొక్కాను అలాగే ఉండచుట్టి బీరువా మూలకు నెట్టేశాను..." అతడి మాటలతో ఇద్దరి పరిస్థితీ గాలి తీసేసిన బెలూన్‌లా అయిపోయింది. కేసు పట్టు జారిపోతోందే..

"ఈ సంఘటన ఎక్కడ జరిగింది? "







"మా ఫ్యాక్టరీలో!"

"ఇక్కడ పోలీస్ స్టేషన్‌లో కేసు నమోదైందా?"

"నమోదైంది సార్.."

"ముక్కుకు దెబ్బ తగిలి రక్తం కారినట్టు చెప్పారే... ఏ డాక్టర్ దగ్గర ట్రీట్‌మెంట్ చేయించుకున్నారు?"

"మా ఫ్యాక్టరీ డాక్టర్ రవిచంద్ర దగ్గర..." అని చెప్పి మాధవ్ వెంటనే, గొంతు తగ్గించి వివేక్‌ని అడిగాడు, "నన్ను అనుమానిస్తున్నారా సార్?"

మాధవ్ ఆలోచించి చెప్పాడు:

"నాలుగు సవర్ల గొలుసు ఒకటి... రెండు నీలం రాళ్ల గాజులు... ఓ పచ్చ రాయి ఉంగరం... ఈ మూడింటిని స్వస్తికా ఎప్పుడూ వేసుకుంటుంది..."

"అయితే... నేను స్వస్తికా శవాన్ని చూసినప్పుడు ఒంటిపై ఎలాంటి నగలూ లేవే? ... స్వస్తికా ఉంగరపు వేలు కట్ అయి ఉంది..."

"స్వస్తికాను నగల కోసమే చంపారని భావిస్తున్నారా సార్?"

"అలానూ ఉండొచ్చు.. స్వస్తికా పోస్టుమార్టమ్ రిపోర్టు ప్రకారం ఆమె మానభంగం చేయబడ లేదు. కారణం! చంపింది ఒక స్త్రీ కాబట్టి... ఆ స్త్రీతో బాటు ఒక మగాడూ జత కలిశాడు..

ఆ స్త్రీ దేవి కావచ్చని పోలీసుల అనుమానం. అయితే ఆ మగాడు ఎవర న్నదే తెలియటం లేదు! దేవి హజ్బెండ్ కైలాషా? ఆ చిత్తూరు మోహనా? తాళాల గుత్తి రంగమణినా? డ్రామా ఆర్టిస్ట్ జయంతి భర్త పాండురంగా? ఇందులో ఎవరన్నది కచ్చితంగా నిర్ణయించలేకపోతున్నాం..." అని తల పట్టుకొని సమీపంలో ఉన్న కుర్చీలో దబ్బున కూర్చున్నాడు వివేక్. అతడి సమీపంలో నిలబడి ఉన్న గోకుల్‌నాథ్ కూడా భారంగా నడిచి వెళ్లి మరో కుర్చీలో కూర్చుంటూ "ఈ కేసు ఎప్పుడు ముగుస్తుందో..." అని గొణిగాడు.

## ఘాటు స్పందన

శరత్ రాసిన భారతి నవల ఆ నాడు బెంగాల్ విప్లవకారులకు బైబిల్‌లా ఉండేది. బ్రిటిష్ ప్రభుత్వం దాన్ని నిషేధించింది. దీంతో వైస్‌రాయ్‌తో పరిచయంగల ఠాగూర్‌కు శరత్ లేఖ రాస్తూ, 'మీరు ఆయనతో మాట్లాడి ఆ పుస్తకంపై నిషేధం ఎత్తేసేలా చూడండి' అని కోరారు. దానికి ఠాగూర్, 'అంత భయపడేవాడివి అలాంటి పుస్తకం ఎందుకు రాశావు?' అని జవాబిచ్చారు. శరత్ 'గురూజీ! నేనేదో భయపడి, రక్షించమని మీకు ఆ లేఖ రాయలేదు. పుస్తకంపై నిషేధం ఎత్తేస్తే ఉద్యమానికి మేలు జరుగుతుందని వైస్రాయ్‌తో మాట్లాడమన్నాను' అని ఘాటుగా స్పందించారు.



వివేక్ చిర్నవ్వు చిందించాడు.

"మిస్టర్ మాధవ్.. పోలీసుల చూపు ఎప్పుడూ ఒకేలా ఉంటుంది. హత్య కేసు విషయంలో ఎవరిని చూసినా, వారిని నిర్మొహమాటంగా సందేహిస్తాం! బైదబై... ఈ ఇంట్లో స్వస్తికాకు ప్రత్యేకమైన గది అంటూ ఏదైనా ఉందా?"

"లేదు..."

"స్వస్తికా ఎప్పుడూ... ఎలాంటి నగలు వేసుకునేదో కాస్త చెప్పగలరా మాధవ్?"

★ ★ ★

వివేక్ తన ఇంట్లోకి అడుగు పెట్టినప్పుడు రాత్రి పదిన్నర గంటలైంది. తన కోసం

మేలుకొని కూర్చున్న రూపాదేవి భర్తను చూసి ఆతృతగా అడిగింది. "వెళ్ళిన పని ఏమైంది? "

"ఈ కేసులో ఎవరిని అనుమానించినా అది కాసేపటికంతా బలహీనపడిపోతోంది... మాధవ్‌ను మా అనుమానస్థుల పట్టిక నుండి తొలగించేశాం..."

"స్వస్తికాను దేవే హత్య చేసిందనే నిర్ణయానికి వచ్చేశారా, లేక అదీ పక్కన పెట్టేశారా? ..."

రూపాదేవి అడిగిన ప్రశ్నకు వివేక్ సమాధానం చెప్పేటంతలో ఇంటిబయట ఆటో ఆగిన శబ్దం వినిపించింది. ఇద్దరూ ఆతృతగా అటు చూశారు. ఆటోలో నుండి కైలాష్ గబగబ దిగి లోపలికి వచ్చాడు. నడకలో వేగం... ముఖంలో ఆతృత గోచరిస్తోంది...

"రండి కైలాష్.. ఏంటి ఇంత రాత్రిపూట.."

"సార్... మీతో కొంచెం మాట్లాడాలి.."

"మాట్లాడండి..." ఇద్దరూ మరో గది లోని సోఫా-కమ్ బెడ్‌పై కూర్చున్నారు.

కైలాష్ ముఖంలో ఆందోళన కారణంగా చెమట అలుముకుని ఉంది.

"చెప్పండి కైలాష్... ఏంటి విషయం? ..."

"సార్, స్వస్తికాను హత్య చేసింది ఎవరో నేను కనిపెట్టేశాను..."

"ఈజిట్? ... ఎవరు? !"

"జయంతి..."

"జయంతా? "

"ఔను సార్!"

"ఎలా చెబుతున్నారు? "

"సార్.. జయంతి ఎంత పెద్ద జాణో నేను ఇప్పుడే తెలుసుకున్నాను. ఆమెకు ఇదివరకే పెళ్ళైంది సార్.. ఆ నిజాన్ని దాచిపెట్టి ఇన్నాళ్ళూ నాతో మసలుకొంది.. భర్తకు విడాకులిచ్చి నాతో సంబంధం పెట్టుకున్న ఆడది మంచిగా ఎలా ఉంటుంది సార్? రెండు నెలల క్రితం ఓ రోజు రాత్రి, నేను లైట్‌గా తాగినమైకంలో ఉన్నప్పుడు, ఆ జయంతి నన్ను అడిగిన విషయం నాకిప్పటికీ బాగా జ్ఞాపకం ఉంది సార్!"

"ఏం అడిగింది? !"

"దేవి అనుమతి పత్రం తీసుకొని... మనం సంప్రదాయం ప్రకారం పెళ్ళి చేసుకుందామా? అని అడిగింది సార్...? "

"మీరుదానికేం సమాధానం చెప్పారు? "

"దేవి అందుకు ఒప్పుకోదని చెప్పాను.. అందుకు ఆమె- 'దేవిని మీరు ఎలాగైనా ఒప్పించాలి. లేదంటే దానికథ ముగించేయండి. మీరు ఒప్పించలేకపోతే చెప్పండి, దాని కథ ముగించేస్తానని చెప్పింది"

వివేక్ చిరునవ్వు చిందించాడు.

"ఆమె అలా చెప్పినా.. ఆ స్టేట్‌మెంట్ పనికిరాదు కైలాష్.. హత్య చేయబడింది దేవి కాదు, స్వస్తికా! జయంతి స్వస్తికాను ఎందుకు హత్య చేస్తుంది? "

"ఇలా ఆలోచించి చూడండి సార్? "

"ఎలా? "

"జయంతీ.. ఆమె భర్తా, దేవిని చంపాలని... సంఘటన జరిగిన ఆ రాత్రి మా ఇంటికి వచ్చుండాలి... దేవిని బాగా కొట్టి ఆమెను పీకపిసికి చంపే సమయంలో... కుప్పం నుండి స్వస్తికా మా ఇంటికి వచ్చుండాలి... దేవిని చంపడానికి ఈమె అడ్డుగా ఉందన్న కోపంతో ఇద్దరూ స్వస్తికాను చంపి ఉండాలి...? "

"మరి, దేవి ఏమైనట్టు? ..."

"అదే నాకు కన్‌ఫ్యూజన్‌గా ఉంది సార్.."

"కైలాష్.. రెండు రోజులక్రితం... బస్టాండ్ దగ్గరున్న ఓ బంకు ముందు మీరు.. ఓ గుండు కొట్టుకున్న వ్యక్తి... మాట్లాడుతున్నారే... అతనెవరో కాస్త



చెబుతారా?"

కొన్ని సెకన్లు ఆలోచించిన మీదట కైలాష్ చెప్పాడు. "అతను జగన్నాథం సార్! మా ఆఫీస్ అకౌంటెంట్! ఆ రోజు రాత్రి 'మయూర'లో భోజనంచేసి సిగరెట్ తాగడం కోసం ఆ బంకు దగ్గరకు వచ్చాం! మీరెప్పుడు చూశారు సార్?"

వివేక్ బదులిచ్చేలోపే... వారి సమీపం లోని టెలిఫోన్ గణగణమంటూ మోగింది.

వివేక్ రిసీవర్ అందుకున్నాడు.

"హల్లో..."

"మిస్టర్ వివేక్ ఉన్నారా?" అటునుంచి ఒక మగగొంతు వినిపించింది.

"హోల్డింగ్..."

"సార్... నేను మోహన్‌ను మాట్లాడు తున్నాను..."

"ఏ మోహన్?..."

"చిత్తూరు మోహన్‌ను సార్...?"

"ఓ... మీరా... ఏంటి విషయం?"

"సార్... నేనిప్పుడు హైదరాబాద్ నుండి ఎస్‌టిడి ద్వారా మాట్లాడుతు న్నాను... ఒక ముఖ్యమైన విషయం మీతో చెప్పాలి సార్...."

"చెప్పండి..."

"నేను దేవిని చూశాను సార్..."

★ ★ ★

వివేక్ చేతిలోని రిసీవర్ జారిపడబో యింది. దాన్ని గట్టిగా పట్టుకొని గబగబ అడిగాడు.

"దేవిని చూశారా? ఎక్కడ చూశారు?..."

"రెండు గంటలక్రితం టివిలో చూశాను..."

"టివిలోనా?"

"ఔను సార్... నేనిక్కడ హోటల్ గోల్కొండలో దిగాను. హోటల్ రిసెప్షన్ హాల్లో రెండుగంటల క్రితం టివి చూస్తూ కూర్చున్నాను. 'దే ఆర్ ఇన్ హోమ్' అన్న టైటిల్‌తో అనాథ మహిళల గురించి ఓ కార్యక్రమాన్ని హైదరాబాద్ దూరదర్శన్ ప్రసారం చేసింది... భర్తలు వదిలేసిన స్త్రీలు... జీవితంలో మోసగింపబడ్డ మహి ళలు... వేశ్యావృత్తిలోకి నెట్టబడ్డ వని తలు... ఇలాంటి వాళ్ళ గురించిన కార్యక్ర మంలో దేవిని చూశాను..."

"బాగా చూశారా మోహన్, ఆమె దేవే కదూ?"

"ఆమె దేవే సార్! పదిసెకన్లు దేవిని క్లోజప్‌లో బాగానే చూపించారు. ఆమె హండ్రెడ్ పర్సెంట్ దేవే! అనుమానం లేదు!!"

ఆ కార్యక్రమం అయిపోయాక వెంటనే ఆటోను మాట్లాడుకొని టివి స్టేషన్‌కు వెళ్లాను. ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్‌ను కలిసి దేవిని గురించి వివరాలు అడిగాను. పోలీసు కేసు అని చెప్పగానే ఆయన జంకి నట్టు ఉన్నాడు. ఆపైన నాతో మాట్లాడ్డా నికి ఆయన ఇష్టపడలేదు. ఎ.ఎస్.డి. లేక ఎస్.డి.ని కలవమని చెప్పాడు. నాకు వాళ్ళను కలవడానికి వీలు కాలేదు సార్! పోలీసు అధికారిగా మీరు వస్తే పని పూర్తి కావచ్చు.."

"మీరు అక్కడ ఏ హోటల్లో దిగారని చెప్పారు.."

"హోటల్ గోల్కొండ..."

"నేను రేపు మధ్యాహ్నానికల్లా మిమ్మల్ని హైదరాబాద్‌లో కలుస్తాను. ఈలోపు మీరు టివి వాళ్ళను మీ ప్రశ్నలతో తిక మకపెట్టకండి"

"అలాగే సార్!"

వివేక్ రిసీవర్‌ను క్రెడిల్ చేశాడు.

ఎదురుగా కూర్చుని ఉన్న కైలాష్ కుతూ హలంగా అన్నాడు.

"ఏంటీ... దేవి దొరికిందా...?!"

వివేక్ అతడికేమీ సమాధానం

చెప్పకుండా రూపాదేవితో అన్నాడు.

"సూట్ కేస్ సర్దు రూపా! అలాగే గోకుల్ నాథ్‌కు ఫోన్ చేసి వెంటనే ఇక్కడికి రమ్మను..."

రూపాదేవి ప్రక్కగదిలోని ఫోన్ వద్దకు దారితీసింది.

కైలాష్ గబగబ అన్నాడు: "సార్... దేవిని కలవడానికి నేనూ హైదరాబాద్ రావచ్చా?"

"నో.. ఇది పూర్తిగా పోలీస్ ఇన్వెస్టిగేషన్.. దేవిని కనిపెట్టి ప్రాథమిక విచారణ జరిపాకే మీరు దేవిని కలవచ్చు. దేవి దొరికిందంటే మరుసటిరోజే ఇక్కడికొచ్చేస్తాం.. బాధపడకండి!!"

మరుసటిరోజు ఉదయం పదకొండు గంటలు!!

కాచిగూడ రైల్వేస్టేషన్‌లో ట్రైన్ దిగిన వివేక్ ప్లాట్‌ఫామ్‌కేసి చూసి ఆశ్చర్యపోయాడు. చిన్నగా చిరునవ్వు నవ్వాడు.

గోళ్ళు కొరుకుతూ ఎదురుగా మోహన్ కనిపించాడు.

"ఏంటి మోహన్.. ఏకంగా రైల్వేస్టేషన్‌కే వచ్చేశారు.."

"ఒకటే టెన్షన్‌గా ఉంది సార్! మీ కోసం ఎదురుచూస్తూ హోటల్‌లోనే ఉండలేకపోయాను.."

ఇద్దరూ స్టేషన్ బయటికొచ్చారు. అక్కడున్న ట్యాక్సీలోకి ఎక్కి కూర్చున్నారు.

"ఎక్కడికెళదాం సార్?... హోటల్‌కా... టీవీ స్టేషన్‌కా?"

"ముందు టీవి స్టేషన్‌కెళదాం..."

"వాళ్ళు నాకు సరిగ్గా సమాధానం చెప్పలేదు సార్.."

ఇప్పుడు వెళ్ళి కలుద్దాం... ఆయన పేరేమిటో కనుక్కున్నారా మోహన్?"

"కనుక్కున్నాను సార్! ఆయన పేరు దివాకర్ రెడ్డి"

టాక్సీ పదిహేను నిమిషాలు ప్రయాణించాక.. టీవి స్టేషన్ ముందు ఆగింది.

## కొత్తగాలి...

**వరాల వాగ్దానాలు**
**ఓటింగయ్యాక**
**పాసిపోయిన పదార్థాలు**

**-ఆర్.ఎస్ హైమవతి, చెన్నై**

మీటర్ చూసి ఛార్జ్ ఎంతైందో చెల్లించి, స్టేషన్ లోపలికి దారితీశారు. అర్ధవృత్తాకారంగా ఉన్న రిసెప్షన్ కౌంటర్‌లో కూర్చుని ఇంకో వ్యక్తితో హస్క్ కొడుతున్న రిసెప్షనిస్టు సమీపానికి వెళ్ళారు. వీళ్ళిద్దర్నీ చూసి 'ఎస్' అంటూ లేచి నిలబడ్డాడతను. వివేక్ నవ్వుతూ ఇంగ్లీష్‌లో అడిగాడు:

"స్టేషన్ డైరెక్టర్‌ను కలుసుకోవచ్చా?"

"ఎందుకు? అఫీషియలా? లేక పర్సనలా?" అతనూ ఇంగ్లీష్‌లోనే ప్రశ్నించాడు.

"అఫీషియలే..."

"మొదటి అంతస్తులో రెండవ గది... మీ పేరు నేను తెలుసుకోవచ్చా?"

"వివేక్..."

"ఎక్కణ్ణించి వస్తున్నారు?"

"క్రైమ్ బ్రాంచ్.. తిరుపతి.." గుర్తింపు కార్డు చూపించాడు వివేక్!

చాలా మర్యాదగా అతడు విజిటర్స్ నోట్‌బుక్‌లో పేరు రాశాక, వివేక్, మోహన్‌లిద్దరూ మొదటి అంతస్తుకేసి దారితీశారు.

"స్టేషన్ డైరెక్టర్" అని ఇంగ్లీష్‌లోనూ, తెలుగులోనూ రాసి ఉన్న గది ముందుకు వచ్చి నిలబడ్డారిద్దరూ. ఫ్లష్ డోర్‌పై శబ్దం చెయ్యగానే 'కమిన్' అన్న పిలుపు లోపలి నుండి వినిపించింది.



ఇద్దరూ లోపలికెళ్లారు.

"గుడ్ ఆఫ్టర్‌నూన్ సార్!" వివేక్ విష్ చేశాడు. రిసెప్షనిస్టు ద్వారా వివేక్‌ను గురించి తెలుసుకున్న స్టేషన్ డైరెక్టర్ లేచి నిలబడి ఇద్దరికీ షేక్‌హ్యాండిచ్చి కూర్చోమని కుర్చీలు చూపించాడు. మృదువుగా ఇంగ్లీష్‌లో అడిగాడు-

"మీకేం సహాయం కావాలో చెబుతారా?"

వివేక్ రెండు నిమిషాల్లో తాము వచ్చిన విషయమేంటో చెప్పాడు. విషయం విన్నాక అతడు చాలా ఆశ్చర్యపోయాడు. కళ్ళద్దాలు తీసి బల్లపై పెట్టాడు. తన సమీపంలోని ఇంటర్‌కమ్‌లో చెప్పాడు.

"దివాకర్‌రెడ్డిగారూ... వెంటనే నా గదికి రాగలరా?"

క్షణం తర్వాత దివాకర్‌రెడ్డి లోపలికి వచ్చాడు. అతనితో ఒక ఐదు నిమిషాలు సంభాషించాక, దివాకర్‌రెడ్డి వివేక్‌వైపు తిరిగి అన్నాడు, "మీకేం సహాయం కావాలో అడగండి..."

"ఆ క్యాసెట్‌ను ఇక్కడున్న వీడియో డెక్‌లో వేసి చూసే ఏర్పాటు చెయ్యగలరా?"

"తప్పకుండా!!" అని చెప్పి వాళ్ళను తన వెంట తీసుకెళ్లాడు.

★ ★ ★

టి.వి. తెరపై మళ్ళీ ప్రత్యక్షమైంది దేవి. ఆమె క్లోజప్ ముఖాన్ని తెరపై అలాగే ఫ్రీజ్ చెయ్యగా... వివేక్ తన చేతిలోని దేవి ఫొటోతో దాన్ని పోల్చి చూసుకున్నాడు. అనుమానం లేదు... అది దేవే!!

నున్నగా దువ్విన తల... నేత చీర... చూసేవాళ్లను కాస్త తికమకపెట్టినా ఆ కళ్ళూ.. గడ్డమూ ఆమెను ఇట్టే పోల్చుకునేలా చేశాయి. ఆమె దేవే...

"మోహన్!"

"సార్..."

"దేవితో మీరు ఒక ఫ్రెండ్‌గా చాలా సన్నిహితంగా మెలిగారు కదా? !"

"ఔను సార్..."

"దేవి ఎప్పుడైనా... ఏ సందర్భంలోనైనా హైదరాబాద్ వచ్చిందా?"

"నాకు తెలిసినంతవరకూ లేదు సార్"

"ఇక్కడి వాళ్ళతో మాట్లాడిన సందర్భాలున్నాయా?"

"లేదు!"

"దేవి ఇక్కడ అనాథాశ్రమంలో ఉండటం చాలా ఆశ్చర్యంగా ఉంది...! ఏ కారణంచేత ఇంత దూరం వచ్చి అనాథాశ్రమంలో చేరింది? చేసిన హత్య నుండి తప్పించుకోవటానికా? లేక ఎవరికైనా భయపడా? ... ఆశ్రమంలోని దేవి ముఖంలో ఆ భయం తాలూకు ఛాయలు అలాగే కనిపిస్తున్నాయి... గమనించారా మోహన్...?"

"ఔను సార్... ఆ చూపుల్లో ఏదో భీతి కనిపిస్తోంది..."

★ ★ ★

దిల్‌సుక్‌నగర్‌లోని ఆ అనాథాశ్రమంలోకి వివేక్, మోహన్‌లిద్దరూ అడుగుపెట్టే సమయానికి మధ్యాహ్న భోజన సమయం కావటంతో ఆ ఆశ్రమం ఒక ఒక సత్రంలా కనిపిస్తోంది.

పచ్చరంగు నేత చీరా... తెల్ల జాకెట్టూ ధరించిన మహిళలు ఆశ్రమం వరండాలో... పళ్ళేలు పట్టుకొని వరుసలో నిలబడ్డారు. అల్యూమినియం పాత్రల్లోని పులిహోర... పెరుగన్నం వాసనలు గాలిలో తేలుతూ వచ్చి ముక్కుపుటాలకు సోకాయి. ఆశ్రమంలోని వేపచెట్లపై కాచు కూర్చున్న కాకులు వాళ్ళు తిని పడేసిన మెతుకుల కోసం ఎదురుచూడసాగాయి.

"ఎవరు కావాలి మీకు? ..." దాంతో వెనక్కు తిరిగి చూశారు వివేక్, మోహన్ లిద్దరూ.

సన్నగా... పొడవుగా ఉన్న ఒక యువతి నిలబడి ఉంది.

"ఈ ఆశ్రమానికి ఇన్‌ఛార్జి ఎవరండీ? ..."

యాభైఅడుగుల దూరంలో కన్పిస్తున్న ఒక ఆజ్‌బెస్టాస్ షెల్టర్‌ను చూపిస్తూ "మా అమ్మగారు అక్కడున్నారు..." అంది.

వివేక్, మోహన్‌లిద్దరూ అటు దారీ తీశారు. ఆ అనాథాశ్రమం ఇన్‌ఛార్జిగా ఉన్న ఆ అరవై ఐదు సంవత్సరాల చెన్నమ్మ... గది ముందే కనిపించింది. తన దగ్గరున్న గుర్తింపు కార్డును చూపించి, ఆమెను కాస్త భయపెట్టి... తర్వాత దేవి ఫొటోను చూపించి అన్నాడు.

"ఈ యువతి మీ ఆశ్రమంలోనే ఉంది కదూ? !"

చెన్నమ్మ ఆ ఫోటోను బాగా పరిశీలనగా చూసి "ఔను" అంది.

"మేం ఆ యువతిని చూడాలి... ఒక హత్య కేసు విషయంగా ఆమెను విచారణ జరపాలి... ఆమెను ఇక్కడికి పిలిపిస్తారా? "

"అలా కూర్చోండి... పిలిపిస్తాను!"

వాళ్ళిద్దరికీ కుర్చీలు చూపించి... ఒక యువతిని పిలిచి ఏదో చెప్పి పంపింది. వివేక్ పరిసరాలను గమనిస్తూ కూర్చున్నాడు.

ఐదు నిమిషాలు గడిచాక- గది బయట ఎవరిదో నీడ కనిపించింది. వివేక్, మోహన్‌లిద్దరూ వెనక్కు తిరిగి చూశారు.

తలుపు దగ్గర దేవి కనిపించింది. వివేక్ చప్పున లేచి వేగంగా ఆమెను సమీపించాడు.

వివేక్ దేవిని సమీపించగా... దేవి తన పెద్ద పెద్ద కళ్ళతో అతణ్ణి భయం భయంగా చూసింది...

"మిసెస్ దేవీ..."

ఆమె ముఖంలో ఎలాంటి స్పందనా కనిపించలేదు. కానీ వేగంగా జరిగే శ్వాస క్రియవల్ల ఆమె ఛాతీ ఎగసెగసి పడుతోంది.

"మిసెస్ దేవీ.." వివేక్ మళ్ళీ పిలిచాడు. ఆశ్రమం ఇన్‌ఛార్జి చెన్నమ్మ కల్పించుకుని అంది-

"ఈ అమ్మాయి ఏమీ మాట్లాడ్డం లేదు... నేనూ ఎన్నోసార్లు మాట్లాడించి చూశాను. ఏమడిగినా అవే చూపులు!!... అన్నం పెడితే తింటుంది. పడకవేసి పడుకోబెడితే నిద్రపోతుంది. ఎప్పుడూ ఆ భయానక చూపులే... అన్ని భాషల్లోనూ మాట్లాడించి చూశాను... ఊహుఁ... లాభం లేకపోయింది!"

"ఈ అమ్మాయిని ఎవరు ఇక్కడకు తీసుకొచ్చి చేర్పించారు? "

"పోలీసులు!"

"పోలీసులా? "

"ఔను!!"

"ఎప్పుడు తీసుకొచ్చి చేర్పించారు? "

"రెండు వారాలు అయింది. ఇన్‌స్పెక్టర్ యాదగిరి ఈ అమ్మాయిని జీప్‌లో తీసుకొచ్చి నా దగ్గర అప్పగించి, "చెన్నమ్మా ఈ అమ్మాయిని ఏ ప్రశ్న అడిగినా... జవాబు చెప్పనంటోంది. మీరు మంచిగా మెలగి... మాటలు కలిపి చూడండి, నేనొచ్చి తీసుకెళతాను" అని చెప్పి వెళ్ళాడు. ఆయన ఇక్కడ వదిలి వెళ్ళిన రోజునుండి, ఇప్పటి దాకా ఒక్క మాట కూడా మాట్లాడలేదు."

**కొత్తగాలి...**

**రాత్రీపగలూ నిర్విరామంగా తిరిగేది**
**సన్నముల్లు**
**అందరిలో విలువ పొందేది**
**లావు ముల్లు**
**అందుకే గడియారం**
**వర్తమానానికి ప్రతిబింబం**

– వధాయి, హైదరాబాద్



"ఇన్‌స్పెక్టర్ యాదగిరి ఏ స్టేషన్‌లో ఉంటారో కాస్త చెబుతారా? నేను ఆయనను కలిసి మాట్లాడాలి..."

చెన్నమ్మ బదులిచ్చింది.

వివేక్ మోహన్‌తో అన్నాడు- "మోహన్.. దేవికి మీరు బాగా పరిచయస్తులు... ఆమెతో మాటలు కలిపి ఆమెను మాట్లాడేలా చేయండి... పాత జ్ఞాపకాలను గుర్తుకు తెచ్చి ఆమెను కాస్త మన మనిషిని చేయండి... నేను ఇన్‌స్పెక్టర్ యాదగిరిని కలిసి వస్తాను..."

★ ★ ★

"మిస్టర్ యాదగిరీ... దేవి కేసు హిస్టరీ అంతా మీకు చెప్పాను... నాకు కావలసిన సమాచారం... తిరుపతిలో ఉన్న దేవి మీ చేతులకు ఎలా దొరికిందీ అని? !"

యాదగిరి తన మీసాలను ఓ మారు సవరించుకొని, పదీ పదిహేను సెకన్లు ఆలోచించి మెల్లగా గొంతు విప్పాడు.

"రెండు వారాల క్రితం... ఆ రోజు మంగళవారం అనుకుంటాను! రాత్రి సమయం!! గంట పదిపైనే ఉండొచ్చు... దొంగ బంగారం రవాణా చేస్తున్న కారును పట్టుకోవడం కోసం... నేను, కస్టమ్స్ ఆఫీసర్స్ రోడ్డుపై బీటు వేశాం. ఆ దారి వెంట వెళ్ళే ప్రతి కారూ, వ్యానూ... అన్నింటినీ ఆపి చెక్‌చేసి పంపుతున్నాము. అప్పుడు ఒక టెంపో వచ్చింది... వేగంగా దూసుకొచ్చిన ఆ టెంపోను ఆపి లోపలికి తొంగి చూశాను. డ్రైవరూ, మరో శాల్తీ కనిపించారు... వెనక సీట్లో ఈ అమ్మాయి పడుకుని ఉండటం కనిపించింది! డ్రైవర్‌తో 'ఎక్కడికెళుతున్నారు?' అని అడిగాను. అతడు 'బెంగుళూరు' అని అంటూ ఉండగానే, పక్కనున్న శాల్తీ 'విజయవాడ' అని చెప్పాడు. ఏ ప్రశ్న అడిగినా ఇద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటున్నారు. ఇద్దర్నీ విడివిడిగా పక్కకు తీసుకెళ్ళి 'లోపల పడుకున్న అమ్మాయి ఎవరు?' అని ప్రశ్నించాను. ఒకడేమో 'తెలిసిన అమ్మాయి' అన్నాడు. మరొకడు 'లిఫ్ట్ అడిగిన అమ్మాయి' అని బదులిచ్చాడు. టెంపో దగ్గరికెళ్ళి ఆ అమ్మాయినే లేపి అడిగాను... నేను అడిగిన ఏ ప్రశ్నకూ ఆ అమ్మాయి బదులివ్వకుండా అందరినీ భయం భయంగా చూసింది. ఆమె కుడి చేతిపై ఎండిన రక్తపు మరకలు కనిపించాయి. అనుమానంతో టెంపోను సీజ్ చేసి స్టేషన్‌కు తీసుకువచ్చాం. కేసు నమోదు చేసి ఆ ఇద్దర్నీ విచారణ చేస్తుండగా, అధికార పార్టీకి చెందిన నాయకుడొకడు... కల్పించుకొని వాళ్ళిద్దర్నీ జామీన్‌పై విడిపించుకొని వెళ్ళిపోయాడు. ఈ అమ్మాయిని విచారిద్దామంటే ఏమీ మాట్లాడనంటోంది... ఇలాంటి కేసులను చెన్నమ్మ అనాథాశ్రమంలో చేర్పిస్తే... చెన్నమ్మ ఓ నెలలో అన్నీ సరిచేసి పంపుతుందని ఆలోచించి, ఆమెను అక్కడికి తీసుకెళ్ళి చేర్పించాను..."

"టెంపోలోని వాళ్ళు ఎలా ఉంటారో చెప్పగలరా? "

"ఇద్దరూ యువకులే... ముప్ఫైలోపే ఉండొచ్చు వయస్సు"

"వాళ్ళ పేర్లూ..."

"ఒకడి పేరు జయంత్... మరొకడి పేరు థామస్! నిన్నటివరకూ ఇది ఓ కిడ్నాపింగ్ కేసై ఉండొచ్చని ఊహించాను. ఎందుకంటే ఈ జయంత్, థామస్‌లిద్దరూ అమ్మాయిలను వ్యభిచార గృహాలకు అమ్మే ఘనులు... అయితే మీ మూలంగా ఇది ఒక హత్యకేసు అని తెలిశాక కేసుకు బలం చేకూరినట్లైంది! దీనికి సంబంధించి వాళ్ళిద్దర్నీ మళ్ళీ విచారణ చేయాలనుకుంటున్నారా వివేక్? "

"ఔను!"

యాదగిరి బయట నిల్చుని ఉన్న ఒక



కానిస్టేబుల్‌ను పిలిచి ఏదో ఆర్డర్ వేయగా... ఒక అరగంటలో ఆ ఇద్దర్నీ తీసుకురావటం జరిగింది. ఇద్దరి ముఖా ల్లోనూ కరకుతనం కనిపిస్తోంది.

"మీలో జయంత్ ఎవరు?" అడిగాడు వివేక్.

"నేనే సార్" అంటూ ముందుకొచ్చాడు ఒకడు.

"టెంపోను డ్రైవ్ చేసింది నువ్వేనా?"

"నేను సార్!" అన్నాడు మరొకడు. థామస్ మెడలో క్రీస్తు శిలువ వ్రేలాడు తోంది... వివేక్ కుర్చీని వెనక్కుతోసి లేచి నిలబడ్డాడు.

"జయంత్, థామస్... మీరిద్దరూ ఒక నిజాన్ని తప్పక చెప్పి తీరాలి... స్వస్తికాను ఎందుకు హత్య చేశారు?"

ఇద్దరూ ఒకరి మొహాలు ఒకరు చూసు కున్నారు.

"ఏంటి సార్ చెబుతున్నారు మీరు? ... హత్యా? ... ఎవరా స్వస్తికా? ..."

"స్వస్తికా ఎవరో మీకు తెలియదా?"

"తెలియదు సార్!"

"సరే... దేవి ఎలా మీ టెంపోలోకి వచ్చింది? !"

"ఆ అమ్మాయిపేరు దేవినా సార్?"

"ఏం, అది కూడా మీకు తెలియదా? !"

"తెలియదు సార్!"

"సరే.. దేవి ఎలా మీ టెంపోలోకి వచ్చింది?" మళ్ళీ అడిగాడు వివేక్.

"రోడ్డులో నిలబడి లిఫ్ట్ అడిగింది సార్! రాత్రివేళ... ఒంటరిగా ఉంది... పోనీ పాపమని టెంపోలోకి ఎక్కమన్నాం!!"

వివేక్ చిర్నవ్వు చిందించాడు.

"దేవికి తనను గురించిన స్పృహే లేదు... గత పదిరోజులుగా ఒక్కమాట కూడా మాట్లాడలేదని అనాథాశ్రమం ఇన్ ఛార్జ్ చెన్నమ్మ అంటోంది... అలాంట ప్పుడు, దేవి మిమ్మల్ని ఎలా లిఫ్ట్ అడిగి ఉంటుంది? చూడండీ... నిజమేమిటో నన్ను చెప్పమంటారా? మీకూ... స్వస్తి కాకు ఎందుకో విరోధం! అందుకని ఆ అమ్మాయి కథను ముగించేశారు... ఆ హత్యను దేవి చూసుండాలి... అందుకే ఆమెను కొట్టి స్పృహ లేకుండా చేసి... టెంపోలో పడుకోబెట్టి... వ్యభిచార గృహా నికి అమ్మేయటం కోసం ఇక్కడికి తీసుకొ చ్చారు... అంతేకదూ? !..."

"కాదు సార్... ఇదంతా అబద్ధం..."

"అయితే జరిగిందేమిటీ?"

"సార్... మేం నిజం చెప్పేస్తాం..."

"అందుకోసమేగా మేం ఎదురుచూ స్తున్నాం... ఊఁ... చెప్పండి..."

జయంత్ నోరు విప్పాడు, "సార్ రెండు వారాల క్రితం... ఒక మంగళవారం రోజు రాత్రి... నేనూ థామస్సూ తిరుపతి రేణి గుంట రోడ్లో టెంపోలో వెళ్తున్నాం... సమయం పదకొండున్నర అయి ఉండొచ్చు.. మనుషులెవరూ లేని రోడ్లో ఒక అమ్మాయి వేగంగా పరుగెత్తుకురా వటం కనిపించింది. 'ఎవరీ అమ్మాయి? ఎందుకలా పరుగెత్తుకొస్తోంది' అని నేనూ థామస్సూ ఆలోచిస్తున్నంతలో... రోడ్డు మలుపులో వేగంగా వచ్చిన ఒక కారు... ఆ అమ్మాయిని ఢీ కొనడంతో... ఆ అమ్మాయి రోడ్డు పక్కగా పడిపోయింది. దాంతో ఆ కారు ఆగకుండా వెళ్ళిపో యింది. మేం టెంపోని ఆపి... ఆ అమ్మాయి దగ్గరకు పరుగెత్తుకు వెళ్ళాం... అదృష్టవశాత్తు ఆ అమ్మాయికి పెద్ద గాయాలేమీ తగల్లేదు. గడగడ వణు కుతూ... మమ్మల్ని భయం భయంగా చూడసాగింది... వెంటనే థామస్ నాతో- 'జయంత్, ఫిగర్ చాలా బావుంది! ట్రాప్ చేసి హైదరాబాద్ తీసుకెళ్ళి... మంచి ధరకు అమ్మేద్దాం..' అన్నాడు. నాకూ ఆ ఆలోచన బావుందనిపించి ఆ అమ్మాయిని

ఇక్కడికి తీసుకొచ్చాం. అంతేకానీ... మేం ఏ అమ్మాయినీ హత్య చేయలేదు సార్! మేం అమ్మాయిలను వ్యభిచార గృహాలకు అమ్మేవాళ్ళమే.. కానీ హత్యలు చేసేవాళ్ళం కాము.. నేనిప్పుడు చెప్పినదంతా దేవుని ప్రమాణంగా నిజమే సార్!!"

ఇన్‌స్పెక్టర్ యాదగిరి చిరునవ్వు నవ్వాడు.

"హత్యా వ్యవహారం అని తెలియగానే నిజం తన్నుకొచ్చేసింది వివేక్"

వివేక్ థామస్‌ను అడిగాడు:

"దేవిని ఢీకొన్నది ఎలాంటి కారో చెప్పగలరా? "

"అంబాసిడర్ కారు సార్!"

"నంబర్ నోట్ చేసుకున్నారా? "

"చీకట్లో కనిపించలేదు సార్!"

"దేవి పరుగెత్తుకొస్తున్నప్పుడు... ఆమెను ఎవరైనా వెంబడించి వచ్చారా? "

"ఎవరూ వెంబడించినట్టు అనిపించలేదు సార్... అయితే ఆ అమ్మాయి ఎవరికో భయపడుతున్నట్టు వెనక్కు తిరిగి తిరిగి చూస్తూ పరుగెత్తుకొచ్చింది..."

"ఇప్పుడు నువ్వు చెప్పిన విషయంలో అబద్ధం ఏదీ లేదుగా? "

"సత్య ప్రమాణంగా లేదు సార్!"

"ఓకే! మీరింక వెళ్ళొచ్చు" అని వాళ్ళని పంపేసి యాదగిరి వద్ద సెలవు తీసుకుని, చెన్నమ్మ అనాథాశ్రమానికి తిరిగొచ్చాడు వివేక్.

దేవి మోకాళ్ళపై తల పెట్టుకొని నిశ్చలంగా తన చూపులను సారించి కూర్చొని ఉంది! మోహన్ ఏదో అంటున్నాడు.. వివేక్‌ను చూసి లేచి నిలబడ్డాడు..

"ఏం మోహన్.. దేవి ఏమైనా మాట్లాడిందా? "

"ఒక్కమాట కూడా మాట్లాడ్డం లేదు సార్, మీరు వెళ్ళిన పని ఏమైంది సార్!!"

జయంత్, థామస్ స్టేట్‌మెంట్ల గురించి వివేక్ మోహన్‌కు చెప్పాడు. "కారు ఢీకొన్న షాక్‌నుంచి దేవి ఇంకా తేరుకోనట్టుంది మోహన్.. ఒక మంచి సైకియాట్రిస్ట్ దగ్గర దేవిని చూపించాలి..."

"దేవిని వెంటబెట్టుకొని తిరుపతి వెళ్ళిపోదాం సార్? "

"నేనూ అదే అనుకుంటున్నాను. మనం దేవిని వెంటబెట్టుకొని ఇక్కడి నుండి వెళ్ళే ముందు గోకుల్‌నాథ్‌కు ఫోన్ చేసి ఈ విషయం చెబుదాం... గోకుల్‌నాథ్ వద్ద స్పెషలిస్టుల డాక్టర్ల లిస్టుంది... ఆయన ఓ మంచి సైకియాట్రిస్ట్‌ను సెలెక్ట్ చేసి.. అపాయింట్‌మెంట్ తీసుకుంటారు.. నేను వెళ్ళి మాట్లాడి వస్తాను.." అని బయటకు దారితీశాడు వివేక్.

చెన్నమ్మ అనుమతి తీసుకొని... తిరుపతికి డయల్ చేశాడు వివేక్. గోకుల్‌నాథ్ లైన్‌లోకి వచ్చాడు.

"హల్లో.. నేను వివేక్‌ను మాట్లాడుతున్నాను.. మేం దేవిని కనిపెట్టేశాం.."

"గుడ్.."

"బట్.. దేవికి తన గురించి ఏమీ జ్ఞాపకం లేదు. దేవిని ఒక మనస్తత్వ వైద్యుడి వద్ద చూపించాలి.. అక్కడ ఓ మంచి సైకియాట్రిస్ట్‌ను ఏర్పాటు చేయండి గోకుల్‌నాథ్"

"సైకియాట్రిస్ట్ అగర్వాల్‌ను ఏర్పాటు చేస్తాను"

"ఓకే! అలాగే మీరు రైల్వేస్టేషన్‌కు వస్తున్నప్పుడు కైలాష్‌ను వెంటబెట్టుకుని

**కొత్తగాలి...**

**ప్రచారంలో**
**వాటేసుకుంటూ**
**అయ్యేక**
**'VAT' వేసుకుంటూ**

—బద్దినాగేశ్వరరావు, అనకాపల్లి



రండి! కైలాష్‌ను చూస్తే దేవిలో ఏదైనా రియాక్షన్ కనిపించవచ్చు."

"అలాగే వివేక్.."

★ ★ ★

ఉదయం తొమ్మిది గంటలు.. తిరుపతి రైల్వే స్టేషన్.. ఆగిన రైలు నుండి వివేక్.. దేవి..మోహన్‌లు ముగ్గురూ కిందికి దిగారు. వాళ్ళను గోకుల్‌నాథ్.. కైలాష్ ఆతృతగా సమీపించారు. కైలాష్ ఆనందంగా దేవి చేతులు అందుకున్నాడు.

"దేవి.. దేవి.."

'ఎవర్నువ్వు' అన్నట్టు చూసింది. అలాగే చూస్తూ.. ఉండిపోయింది.

స్పందనలేక బిగుసుకుపోయిన దేవిని చూసి.. కైలాష్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"దే... దేవీ... నన్ను గుర్తుపట్టలేదూ... నేను... నీ"... అతడు అలా అంటూ ఉండగానే... గోకుల్‌నాథ్ వివేక్‌ను కళ్ళతో సైగచేసి పక్కకు తీసుకెళ్ళాడు. వివేక్ అనుసరించాడు.

"ఏంటి గోకుల్‌నాథ్? "

"ఈకేసు రేపటిలోగా ముగింపుకు రావచ్చు."

"ఎలా అంటున్నారు? "

"ఓ గంట ముందు ఒక ముఖ్యమైన సాక్ష్యం దొరికింది..."

"ఏంటా సాక్ష్యం? "

గోకుల్‌నాథ్ షర్ట్ జేబులో నుండి ఒక నలిగిన ఫొటోను బయటకు తీశాడు. దాన్ని చేత్తో సరిచేసి వివేక్ చేతికిచ్చాడు. దాన్ని అందుకొని చూసిన వివేక్ అదిరిపడ్డాడు. అందులో నల్లకళ్లద్దాలు ధరించిన ఒక వ్యక్తి దర్శనమిచ్చాడు.

"ఎవరు గోకుల్‌నాథ్.. ఇతను? "

గోకుల్‌నాథ్ నవ్వాడు. "ఈ ఫొటో నాకు ఎలా దొరికిందన్న విషయంలోనే అసలు రహస్యం దాగుంది.."

"ఎలా దొరికింది? "

"ఒక గంటముందు... కైలాష్‌ను రైల్వే స్టేషన్‌కు వెంటబెట్టుకొద్దామని కైలాష్ ఇంటికి వెళ్ళాను. ఇంటిముందు బైక్‌కు స్టాండ్ వేస్తుండగా చెత్తకుండీ వద్ద ఈ ఫొటో కనిపించింది. దాన్ని తీసి జేబులో పెట్టుకున్నాను"

వివేక్ ఆలోచనలో పడ్డాడు.

"ఏమిటాలోచిస్తున్నావ్ వివేక్? "

"మనం వెదుకుతున్న ఆ నల్లకళ్లద్దాల వ్యక్తి ఫొటో చెత్తకుండీ వద్దకు ఎలా వచ్చింది? ... చెత్తతోబాటు ఆ ఫొటోను ఎవరు తెచ్చి అక్కడ పడేసుంటారు...? "

ఆ మాటలతో గోకుల్‌నాథ్‌లో అమితమైన ఆనందం కలిగింది.

"హంతకుడికి దరిదాపుల్లోకి వచ్చేశాం వివేక్! స్వస్తికాను చంపిన వ్యక్తుల వద్ద ఈ ఫొటో ఉన్నట్టుంది. మనం వెదుకుతున్న కళ్లద్దాల వ్యక్తి ఫొటోను ఒక చెత్త కాగితంలా భావించి దాన్ని చెత్తకుండీలో వేసుండాలి.."

"కైలాష్‌కు ఈఫొటోను చూపించారా? "

"లేదు"

"ఆ చూపించకండి.. ఇది ఒక తిరుగులేని సాక్ష్యం. తానుగా వచ్చి మన చేతికి చిక్కింది... మనం వెంటనే దేవిని డాక్టర్ అగర్వాల్ వద్దకు తీసుకెళ్ళాలి.. అగర్వాల్ దేవిని మాట్లాడించగలిగితే.. అన్ని విషాయలూ వెలుగులోకి వస్తాయి.. దేవి మాట్లాడలేకపోతే, ఈ ఫొటో ఒక్కటే మనకు ఆధారం.."

ఇద్దరూ దేవి సమీపానికి వెళ్ళారు.

దేవి శిలలా నిలబడుంది.. కైలాష్ దేవి ముందు ఇంకా ఏదేదో గొణుగుతున్నాడు.

వివేక్ కైలాష్ భుజంపై చెయ్యి వేశాడు.

"కైలాష్.. దేవి మిమ్మల్ని గుర్తు పట్టలేకపోతే.. దయచేసి తొందరపెట్టకండి.. మనం వెంటనే ఇప్పుడు డాక్టర్ అగర్వాల్‌ను కలుద్దాం. ఆయనెలాగైనా దేవిని

నార్మల్ కండీషన్‌కు తీసుకొస్తాడు.."

దేవిని ఒక బొమ్మలాగా నడిపించుకుంటూ స్టేషన్ బయటికొచ్చి జీపులోకి ఎక్కారు అందరూ...

★ ★ ★

ఆరు అడుగుల ఎత్తులో.. ఎర్రగా.. బట్టతలతోనున్న డాక్టర్ అగర్వాల్ నలభై నిమిషాలు దేవిని పరీక్షించి.. హెడ్ టార్చ్‌ను తల నుండి తీస్తూ గదిలో నుండి బయటికొచ్చాడు.

"డాక్టర్.." అంటూ ఆయనను సమీపించాడు వివేక్.

"తొందరగా నయమవుతుందని నాకు అనిపించడంలేదు. చాలా పెద్ద షాక్ తగిలినట్టుంది.."

"ఎన్ని రోజుల్లో ఈ అమ్మాయి మాట్లాడవచ్చు డాక్టర్.."

"కచ్చితంగా ఇప్పట్లో మాత్రం కాదు... చాలా రకాలుగా ట్రీట్‌మెంట్స్ చేయాల్సి ఉంది. అడ్మిట్ చేసి వెళ్ళండి.. రేపట్నించే ట్రీట్‌మెంట్ ప్రారంభిస్తాను.."

"అలాగే డాక్టర్!"

వివేక్, గోకుల్‌నాథ్‌లిద్దరూ క్లినిక్ నుండి బయటపడ్డారు.

"గోకుల్‌నాథ్... ఈ కేసులో ఇకపై దేవిని నమ్ముకోవటంలో ఏ ప్రయోజనమూ లేదు..."

"మరిప్పుడేం చేద్దాం వివేక్?"

"ఆ మునిసిపాలిటీ చెత్తకుండీలోని చెత్తను క్షుణ్ణంగా పరిశీలించాలి..."

★ ★ ★

టార్చ్‌లైట్ వెలుగులో ఆ మునిసిపాలిటీ చెత్తకుండి బాగా స్పష్టంగా కనిపిస్తోంది. కుండీ నిండుగా చెత్త పేరుకుంది.

పాత న్యూస్ పేపర్లు.. మూతలేని ఒక హార్లిక్స్ బాటిల్.. కమలాపళ్ళ తొక్కలు.. చింపేసిన తపాలా కవర్లు.. పోస్టుకార్డులు.. ఇంకా చెత్తా చెదారమంతా అందులో ఉంది.

## కొత్తగాలి...

**పక్షులు ఆహారం కోసం**
**వలసలు వెళ్లేవి..**
**నాయకులు పదవులకోసం**
**వలసలు వెళ్తున్నారు?**

*– లలితా మానస, మారతహళ్లి, బెంగళూరు*

"గోకుల్‌నాథ్".

"ఏం వివేక్?"

"ఈ టార్చ్‌లైట్‌ను కాస్త పట్టుకోండి..."

అతడు టార్చ్‌లైట్‌ను పట్టుకోగా... వివేక్ కుండీలోని తపాలా కవరు ముక్కల్ని తీసి, వాటిని జతచేసి అందులోని వాక్యాలను చదవసాగాడు.

చదివేకొద్దీ అతడి ముఖంలో ఆనందం తాండవించసాగింది...

"గోకుల్‌నాథ్... ఎలాగైతేనేం చివరకు సాధించాం"

"ఏమంటున్నారు వివేక్?"

"నా ఊహ కరెక్టయితే... అందరికీ ఇదో పెద్ద షాక్‌లాంటిది... మనం కలలో కూడా ఊహించనటువంటి వ్యక్తులు ఇందులో ఇన్‌వాల్వ్ అయి ఉన్నారు..."

"యు మీన్..."

"కాస్త ఆలోచించి చెప్పండి గోకుల్‌నాథ్.. మిలట్రీనాయుడు మన దగ్గర కొన్ని విషయాలు చెప్పాడు... అతడు చెబుతున్నప్పుడు.. మన చుట్టూ ఎవరెవరున్నారు?"

"కైలాష్.. పక్కింటి లాయర్ సీతారామ్, అతడి భార్య సరోజ.. ఎదురింటి మీనాక్షి ఆంటీ, సాంబయ్య అంకుల్... ఆ పక్కింటి చంద్రశేఖర్, అతడి భార్య..."

"ఇంకెవరూ లేరా?"...

"లేరు... ఈ మూడు జంటలే.."

"ఈ మూడు జంటల్లోని ఒక జంటే

"స్వస్తికా హత్యకు కారకులు... చెత్తకుండీలో దొరికిన క్లూ ప్రకారం... ఒక జంటపై నాకు అనుమానం కలుగుతోంది..."

"ఎవరాజంట వివేక్?"

"మీనాక్షి ఆంటీ.. సాంబయ్య అంకుల్.."

"వివేక్.. ఏంటి మీరంటున్నది?" గోకుల్‌నాథ్ ఆశ్చర్యపోతూ అన్నాడు. వివేక్ చిర్నవ్వు నవ్వాడు.

"ఇది నా ఊహ మాత్రమే! చెత్తకుండీలో దొరికిన ఈ ఉత్తరాలు.. మీనాక్షి ఆంటీకి, సాంబయ్య అంకుల్‌కూ వచ్చిన ఉత్తరాలు.. ఈ ఉత్తరాల ముక్కల్ని చెత్తతో పాటు మీనాక్షి ఆంటీనే తీసుకొచ్చి ఇక్కడ పడేసి ఉండాలి.. అందులోంచే ఈ ఫొటో ఒకటి గాలికి ఎగిరివచ్చి ఉండాలి.."

"నేను నమ్మలేకపోతున్నాను వివేక్.."

"రండి.. ఒక చూపు చూద్దాం.." ఇద్దరూ మీనాక్షి ఆంటీ ఇంటివైపుకు దారి తీశారు. మూసి ఉన్న తలుపును సమీపించి వివేక్ వేళ్ళతో తలుపుపై శబ్దం చేశాడు.

"టక్... టక్... టక్..."

లోపల ఎలాంటి అలికిడీ లేదు.

"టక్... టక్... టక్..."

ఈసారి ఎవరో దీర్ఘంగా ఆవలిస్తూ లేచి కూర్చున్న శబ్దం వినిపించింది.

"ఎవరూ?" మీనాక్షి ఆంటీ గొంతు వినిపించింది.

"కాస్త తలుపులు తియ్యండమ్మా..." వివేక్ బదులిచ్చాడు.

"మీరెవరో చెప్పండి?"

"పోలీసులం..."

ఎవరో గుసగుసలాడుతున్న శబ్దం వినిపించింది. ఎవరో బయటి లైట్ వేసి తలుపుతీశారు. తలుపు వెనుక మీనాక్షి ఆంటీ నిల్చుని ఉంది.. ఆమె వెనుక... గోడవారగా వేసున్న మంచంపై సాంబయ్య అంకుల్ పడుకుని ఉన్నాడు.

"ఏం కావాలి?"

"లోపలికి రావచ్చా?"

"ర... రండి..." ఆమె ముఖంలో ఆందోళన కనిపించింది.

వివేక్, గోకుల్‌నాథ్‌లిద్దరూ లోపలికి దారితీశారు.

"అంకుల్ నిద్రపోతున్నారా?"

"అ... అవును! ఇంతసేపూ దగ్గి దగ్గి ఇప్పుడే నిద్రపోయారు.."

"మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నందుకు క్షమించాలి! అంకుల్‌ను లేపకండి.. నిద్రపోనివ్వండి! మిమ్మల్ని ఓ ప్రశ్న అడుగుతాను.. చిన్న ప్రశ్నే.."

"అ.. అడగండి..."

"రాత్రి ఎన్ని గంటలకు చెత్తకుండీలో చెత్తను తీసుకెళ్ళి పడేశారు?"

"ఏ.. ఏం?"

"అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పండి.."

"తొ.. తొమ్మిది ఉండొచ్చు."

"ఇంట్లో ఉన్న చెత్తా చెదారాన్నంతా శుభ్రం చేసి బయటపడేస్తున్నప్పుడు ముఖ్యమైన వస్తువుల్ని దాచుకోవాలి ఆంటీ.."

"మీ.. మీరు ఏం అంటున్నారు?"

"మీ ఒరిజినల్ ముఖంతో ఉన్న ఫొటోను హత్య చేసినప్పుడే చింపిపారేసి ఉండాల్సింది! లేదంటే కాల్చేసి ఉండాలి. ఇలా చెత్తకుండీలో పడేయవచ్చా ఆంటీ?" అంటూ తన దగ్గరున్న ఆ ఫొటోను తీసి ఆమెకు చూపించాడు వివేక్.

ఆంటీ అంకుల్ వద్దకు పరుగెత్తింది. ఆయన భుజం పట్టుకుని కుదుపుతూ-

"ఏమండీ.. ఈ పోలీసోళ్ళను చూడండీ.. నాతో ఏమేమో అంటున్నారు..?"

సాంబయ్య అంకుల్ అటు ఇటు కదిలాడు. అటు తిరిగి పడుకున్న అతను మెల్లగా పైకి లేచాడు. వణుకుతున్న

## మార్చి-09
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **ఆర్.ఉషారాణి** - కేపీహెచ్‌బీ కాలనీ, హైదరాబాద్
2. **భారతలక్ష్మి** - మాధవనగర్, కర్నూలు
3. **వై.యస్.లక్ష్మి** - సూర్యారావుపేట, విజయవాడ
4. **ఎం.రాధ** - క్యాషియర్, ఎస్‌బీహెచ్, తిరుపతి
5. **సపారె లక్ష్మి** - ఆదోని, కర్నూలు జిల్లా



**సరైన జవాబులు**

1. సుధాకరం 2. అరుణ్ 3. జిద్దా 4. అరవింద 5. సునీత 6. తెల్లసొన 7. యాభై రూపాయలు 8. 1966 9. రాహుల్ 10. యర్రమిల్లి విజయలక్ష్మి

గొంతుతో అన్నాడు. "వచ్చింది ఎవరు మీనాక్షీ?"

"పోలీసోళ్ళు..."

"ఏ.. ఏమంటున్నారు? ..."

"ఆ స్వస్తికాను గురించి అడుగుతున్నారు.."

"కరెక్ట్! వాళ్ళు ఎవరిని అడగాలో.. వాళ్ళనే అడుగుతున్నారు.." అంటూ మంచంపై నుండి లేచి ఇటు తిరిగిన సాంబయ్య చేతిలో పిస్టల్ నిగనిగలాడుతూ కనిపించింది.

వివేక్, గోకుల్‌నాథ్‌లిద్దరూ అదిరిపడి వెనక్కు అడుగువేశారు. సాంబయ్య తనపై నున్న దుప్పటిని దూరంగా విసిరికొట్టాడు. ఎడమచేత్తో తలపైనున్న విగ్‌ను తీశాక.. నున్నటి బట్టతల బయటపడింది. అతని ఒంట్లోని నిస్సత్తువ మాయమై.. ఆ స్థానంలో చురుకుదనం.. మొరటుతనం చోటుచేసుకున్నాయి. సాంబయ్య బట్టతలను తడుముకుంటూ వికృతంగా నవ్వాడు. నవ్వులోనే కాదు చూపుల్లో.. గొంతుల్లో.. ప్రతి చర్యలోనూ క్రూరత్వం కనిపించసాగాయి.

"మిస్టర్ వివేక్.. క్రైమ్ బ్రాంచ్ ఆఫీసర్ల లోనే మీరొక మేధావి అని నాకు తెలుసు.. దాన్ని ఇవ్వాళ... ఇంత రాత్రప్పుడు.. నిరూపించారు. ఏవేవో విషయాల్లో వేలు పెట్టి.. ఎక్కడెక్కడో తిరిగి.. చివరకు సరైన చోటికే చేరుకున్నారు. అయితే ఈ నిజం బయటి ప్రపంచానికి తెలియటానికి వీల్లేదు... అందుకే మిమ్మల్నిద్దర్నీ ప్రాణాలతో వదలటంలేదు.."

వివేక్, గోకుల్‌నాథ్‌లు కదలకుండా సాంబయ్య చేతిలోని పిస్టల్‌నే తదేకంగా చూడసాగారు.

"మీనాక్షీ.. ముందు తలుపులు వేసిరా" సాంబయ్య అలా చెప్పగానే మీనాక్షి వెళ్ళి తలుపులు వేసి వచ్చింది.

"వివేక్.. ఈ క్లిష్ట సమయంలో మీకు మరో షాక్ న్యూస్ చెప్పనా? ఇంకో పదిహేను నిమిషాల్లో అగర్వాల్ క్లినిక్‌లో ఉన్న దేవి చావబోతోంది.."

## కొత్తగాలి...

**ఐదేళ్లకోసారొచ్చేది ఈఎన్నికల**
**వసంతం**
**ప్రతిసారి తెచ్చేదీ**
**అవే పళ్లు అవే కాయలు**

–మాధవీ సనారా, అనకాపల్లి

ఇద్దరూ అదిరిపడ్డారు.

"ను.. నువ్వేమంటున్నావ్?"

"నా అసిస్టెంట్లు భాస్కర్, దీప్తి ఈ పాటికే అగర్వాల్ క్లినిక్‌కు చేరుకుని ఉంటారు.. చికిత్స కోసం అడ్మిట్ చేయబడ్డ దేవిని.. పైలోకానికి పంపే ప్రయత్నాలు చేస్తుంటారు.. వాళ్లిద్దరూ ఆ పనిని ముగించుకొని ఇక్కడికొచ్చాక.. మీ పని పడతాం. అంతవరకూ.. మీరిద్దరూ మోకాళ్ళపై కూర్చుంటారా?" .

సాంబయ్య చేతిలోని పిస్టల్.. తన ఒంటికన్నుతో వివేక్‌నూ.. గోకుల్‌నాథ్‌నూ మార్చి మార్చి చూడసాగింది.

"ఊc.. మోకాళ్ళపై కూర్చోండి..."

ఇద్దరూ అతడు చెప్పినట్టు కూర్చున్నారు.

★ ★ ★

అగర్వాల్ క్లినిక్.

క్లినిక్ అంతటా నిశ్శబ్దం ఆవరించి ఉంది.. వరండాలో ఉన్న బెంచ్‌పై మోహన్, కైలాష్‌లిద్దరూ పక్కపక్కనే కూర్చొని ఉన్నారు. దేవికి ఇంజెక్షన్ చేసి పడుకోబెట్టారు.

గడ్డం కింద చెయ్యి పెట్టుకుని ఆలోచిస్తున్న కైలాష్ భుజం తట్టాడు మోహన్.

"దేవి అమ్మా నాన్నలకు... దేవి దొరికిన విషయాన్ని తెలిపారా కైలాష్?"

"ఇంకా లేదు! వాళ్ళ ముఖం చూడాలంటేనే నాకు సిగ్గుగా ఉంది మోహన్!!"

"అలాగని వాళ్ళకు ఈ విషయాన్ని తెలియజేయరా? మీరు దేవికి తోడుగా ఇక్కడే ఉండండి... నేను వెళ్ళి దేవి వాళ్ళ నాన్నకు టెలిగ్రామ్ ఇచ్చి వస్తాను..." కైలాష్ సమాధానం కోసం ఎదురుచూడకుండా మోహన్ లేచి బయటికి దారితీశాడు.

★ ★ ★

సాంబయ్య మంచంపై కూర్చునే పిస్టల్‌ను వాళ్ళవైపే గురిపెట్టి ఉంచాడు. దాన్నే కళ్ళు తిప్పకుండా చూడసాగాడు వివేక్.

మీనాక్షి ఆంటీ.. తాను ధరించిన చీరను మార్చుకొని మేక్సీ నొకదాన్ని వేసుకొని పక్కగదిలోంచి బయటికొచ్చి- సాంబయ్యతో అంది, "సాంబా... ఈ వారంలోగా ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోవాలనుకున్నాం.. నేను చేసిన ఒక తెలివితక్కువ పనివల్ల.. వీళ్ళు మనల్ని కనిపెట్టేశారు.."

సాంబయ్య నవ్వాడు, "ఏంటి వివేక్.. తాళికట్టిన భార్య నన్ను పేరుపెట్టి పిలిచి మాట్లాడుతోందని చూస్తున్నావా? ఆమె నా భార్య కాదు.. బిజినెస్ పార్ట్‌నర్.. నా భార్యలాగా నడుచుకుంటుంది. అంతే! మా బిజినెస్ ఏమిటో తెలుసుకోవాలని మీకు కుతూహలంగా ఉంది కదూ?! చెబుతాను!! మా బిజినెస్ మరీ అంత గొప్ప బిజినెస్సేంకాదు.. ఊరూరా వెళ్ళి.. మగాళ్ళు లేని ఇంట్లో దోపిడీ చేయటమే..

ఒక్కో ఊర్లో ఒక్కో పేరు పెట్టుకుంటాం. ఈ ఊరికి సంబంధించినంతవరకూ నేను సాంబయ్య అంకుల్‌నీ.. ఆమె మీనాక్షీ ఆంటీ.. విజయవాడలో గత సంవత్సరం నేను రాఘవేంద్రనాయుణ్ణీ... ఈమె శకుంతలాదేవీనూ.. అంతకు ముందు.. విశాఖపట్టణంలో నేను రాజగోపాలరెడ్డీ, ఈమె నాగరత్నమ్మ... ఈ వ్యాపారాన్ని ఇద్దరు అసిస్టెంట్లతో, ఐదు సంవత్సరాలుగా విజయవంతంగా నడుపు

కొస్తున్నాం.. అయితే ఈ దేవి విషయం లోనే మేము ఫెయిలయ్యాం.. మా బిజినెస్ లక్ష్యం- ఉన్నదంతా దోచుకోవటమే!! కానీ.. పొరబాటున కూడా ఇంతవరకూ ఎవరినీ హత్య చేయలేదు. అయితే ఇక్కడ హత్య చేశాం! దాని కొనసాగింపుగా రెండవ హత్య చేసింది మిలట్రీనాయుణ్ణే"

మీనాక్షి కోపంతో రుసరుసలాడింది.

"ఏంటి సాంబూ.. కోర్టులో వాంగ్మూలం ఇస్తున్నట్టు మాట్లాడుతున్నావు? ఇకపై ఈ ఊళ్ళో ఉన్న ప్రతి నిమిషమూ మనకు అపాయమే! మనం ఇక బయలుదేరుదాం.."

"సరే, బీరువాలో ఉన్నదంతా సూట్‌కేసుల్లో సర్దేయ్.. బయలుదేరే చివరి నిమిషంలో వీళ్ళను షూట్ చేస్తా.. జనం మేల్కొని వీధిలోకి వచ్చేలోపు మనం ఈ ఊరి సరిహద్దుల్నే దాటేయాలి.."

సాంబయ్య అలా అనగానే మీనాక్షి మంచంపై నుండి లేచి గదిలో ఒక మూలగా ఉన్న బీరువాను సమీపించడానికి ముందుకు కదిలింది.

సాంబయ్య చేతిలోని పిస్టల్‌కు... మీనాక్షి అడ్డుపడ్డ ఆ క్షణాన్ని.. వినియోగించుకున్నాడు వివేక్.

బాణంలా దూసుకెళ్ళి మీనాక్షి వెనక్కు చేరుకున్నాడు.

★ ★ ★

అగర్వాల్ క్లినిక్ ముందు నిలబడి ఏదో ఆలోచించి ముందుకు కదిలారు కిరణ్... దీప్తి. బెంచ్‌పై కూర్చొని... గోడకు తల ఆనించి నిద్రపోతున్న కైలాష్‌ను చూసి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"దీప్తీ..."

"ఊఁ..."

"అంతగా ఎవరూ లేరు.. వెంటనే మనం పని ప్రారంభించాలి.."

★ ★ ★

"సారీ సాంబూ... కొన్ని క్లిష్ట సమ

## కొత్తగాలి...

**మనసు పలకపై**
**మగువ బలపం ప్రేమలేఖ రాసింది**
**అక్షరాలు చెరగలేదు**
**బలపమే అరిగిపోయింది**

- వై.కె.మూర్తి, విజయవాడ

యాల్లో మేము చూపించే చొరవకూ.. చురుకుదనానికే ప్రభుత్వం మాకు జీతాలిస్తోంది. నువ్వు బిజినెస్ పార్ట్‌నర్‌ను షూట్ చేస్తావని నేను అనుకోను.. షూట్ చేయాలనుకుంటే మాకేం అభ్యంతరం లేదు. మరి నీ నిర్ణయం ఏంటి? !"

పెనుగులాడబోయిన మీనాక్షి భుజాలను గట్టిగా బిగించి పట్టుకొని ఆమె విశాలమైన వీపు వెనక దాక్కొని తలమాత్రం బయట పెట్టి అన్నాడు వివేక్. అతడి వెనక గోకుల్‌నాథ్ ఉన్నాడు.

సాంబయ్య గురిచూడ్డానికి ప్రయత్నించి పిస్టల్‌ను అటు ఇటు కదిల్చాడు.

వివేక్ మీనాక్షిని ముందుకు నడిపించుకుంటూ వెళ్ళి సాంబయ్యను కార్నర్‌చేసి, అతడిపై ఉన్నపళంగా మీనాక్షిని తోశాడు. మీనాక్షి సాంబయ్యపై దబ్బున పడగానే అతడి చేతిలోని పిస్టల్ గాల్లోకి ఎగిరింది. అది నేలపై పడకముందే ముందుకు దూకి పట్టుకున్నాడు వివేక్.

★ ★ ★

"బయట వరండాలో ఎవరూ లేరు కదా? !"

"లేరు.. కైలాష్ కూడా ఏదో ఫోన్ వచ్చిందని ఆఫీస్ గదిలోకి వెళ్ళాడు.."

"సరే, నువ్వు దేవిని ఫినిష్‌చేసి వీధిలోకి పో. నేను వెనకే వచ్చి కలుసుకుంటాను"

కిరణ్ తల ఊపి తన ప్యాంటులో ఉన్న చిన్న ప్యాకెట్‌ను బయటికి తీశాడు. దాని

## కొత్తగాలి...

**అయిదేళ్లకొకసారే కదా!**
**అడుక్కుంటున్నాడని జాలిపడితే**
**అయిదేళ్లు మనం అడుక్కు తినాలి**

- వేలేటి శ్రీనివాసరావు,
విజయనగరం

చింపి లోపలున్న దాన్ని బయటకు తీశాడు. అందులో.. ఓ సిరంజి.. చిటికెన వేలి పరిమాణంలో ఓ బాటిల్ ఉంది. బాటిల్లోని పసుపురంగు ద్రవాన్ని సిరంజి లోకి ఎక్కించి.. ఆ ప్యాకెట్‌ను కిటికీలో నుండి బయటకు విసిరేశాడు. షర్ట్ ప్యాకెట్‌లో ఉన్న కర్చీఫ్‌లో సూదిని దాచుకొని, దేవి ఉన్న గది వద్దకు చేరుకుని.. అటు ఇటు చూసి మెల్లగా తలుపు తోశాడు.

తలుపు మెల్లగా తెరచుకుంది.

గదిలో.. బెడ్‌పై దేవి చలనం లేకుండా పడి ఉంది.

కిరణ్ దేవిని సమీపించి భుజం దగ్గరున్న జాకెట్‌ను పైకి తోశాడు... పసుపు రంగు ద్రవంతో ఉన్న సిరంజిని తీసి భుజంపై ఆనించాడు.

అంతే.. సర్రున ఆ సిరంజి ఆ గదిలో ఎక్కడో ఎగిరి పడింది. చప్పున వెనక్కు తిరిగాడు కిరణ్.

కైలాష్ రుద్రుడిలా నిలబడి ఉన్నాడు. వేగంగా పరుగెత్తాలని చూసిన అతడి కాలర్ పట్టుకొని ఆపాడు కైలాష్.

"నీ పేరు కిరణ్ కదూ? ఇప్పుడే క్రైమ్ బ్రాంచ్ వివేక్ నాకు ఫోన్‌చేసి చెప్పాడు"

అతడు విడిపించుకోబోయాడు.

"ఎక్కడికెళతావురా బద్మాష్? సాంబయ్య, మీనాక్షీ ఆంటీ ఈపాటికే కటకటాల్లోకి వెళ్లుంటారు. నిన్నూ, నీతో వచ్చిన దాన్నీ పట్టుకెళ్ళడానికి పోలీస్ జీప్ రెండు నిమిషాల్లో వచ్చేస్తుంది. అలా బయటకెళ్ళి వెయిట్ చేద్దాం పద"

కిరణ్ కైలాష్‌ను ఓ తోపుతోసి గది నుండి బయటపడ్డ అదే సమయంలో... క్లినిక్ ముందు పోలీస్‌జీప్ నిశ్శబ్దంగా ఆగింది

★ ★ ★

"తరువాత? " అన్నాడు వివేక్.

స్థలం: పోలీస్ లాకప్

సమయం: అర్ధరాత్రి 1.40 నిమిషాలు

వివేక్ కొట్టిన దెబ్బకు నోటినుండి రక్తం కక్కుకున్నాడు సాంబయ్య. కారుతున్న రక్తాన్ని తుడుచుకోవడానికి కూడా శక్తిలేక ఇలా అన్నాడు ".. ఇంట్లో ఇంటరిగా ఉన్న దేవిని కత్తిచూపించి.. బెదిరించి.. నేనూ మీనాక్షీ నగలు ఎక్కడున్నాయో చూపించమని అడుగుతున్నాం. ఆమె మొత్తం నగలూ బ్యాంకులో తనఖా పెట్టినట్టు పదే పదే చెబుతోంది. దాంతో నేనూ, మీనాక్షీ మా సహనాన్ని కోల్పోసాగాం.. సరిగ్గా ఆ సమయంలో.. ఎవరో తలుపు తట్టిన శబ్దం.. ఆ వెనకే దేవీ దేవీ అన్న పిలుపూ వినిపించాయి. వచ్చింది ఎవరని దేవిని అడిగాను. 'అది స్వస్తికా గొంతులా ఉంది' అని దేవి బదులిచ్చింది. 'ఆ యువతిని లోపలికి రమ్మనకు.. బయటినుండి మాట్లాడి అటునుంచి అటే పంపించెయ్.. మా గురించి ఏదన్నా ఆ యువతికి చెప్పావో.. ఆ మరుక్షణం నీ వీపులో కత్తి దిగుతుంది... తర్వాత ఆ యువతినీ చంపేస్తాం...' అనేసి దేవిని బెదిరించి బీరువా వెనక దాక్కున్నాం"

"తర్వాత ఏం జరిగింది? "

"దేవి వెళ్ళి తలుపు తీసిందే తడవు స్వస్తికా చొరవగా లోపలికి వచ్చేసింది... వసపిట్టలా ఏదేదో మాట్లాడుతూ బాత్‌రూమ్‌కు వెళుతున్నదల్లా... అద్దంలో బీరువా వెనక దాక్కున్న నన్ను చూసి గట్టిగా అర

వాలని ప్రయత్నించింది. నేను తొందరపడి కత్తితో ఆ అమ్మాయిని పొడిచేశాను. స్వస్తికా చనిపోయాక... ఒకక్షణం ఏం చెయ్యాలో పాలుపోలేదు మాకు. ఈలోపు దేవి ఇంటి వెనకవైపుకు పరుగెత్తి తలుపు తీసుకొని వీధిలోకి పారిపోయింది.."

"మీరు దేవిని వెంబడించలేదా? "

"నేను వెంబడించాను. కొంతదూరం వదలకుండా పరుగెత్తాను... ఈలోపు అనుకోని విధంగా.. వేగంగా వచ్చిన ఓ కారు దేవిని గుద్దేసింది... ఆ కారు ఆగకుండా వెళ్ళినా... మరో వ్యాన్... రోడ్డు పక్కన క్రిందపడున్న దేవి దగ్గర ఆగింది! వెంటనే నేను ఓ చెట్టు వెనక దాక్కున్నాను.. వాళ్లు దేవిని ఆ వ్యాన్‌లో వేసుకొని వెళ్ళిపోయారు.."

"వాళ్ళు పోలీస్‌స్టేషన్‌కు వెళతారని అనుకోలేదా? "

"లేదు.. వాళ్ళను చూస్తే మంచివాళ్ళలా అనిపించలేదు.. అంతేకాదు, వాళ్ళు కర్చీఫ్‌ను దేవి ముక్కుకు అదిమిపెట్టి, ఆమెను ఎత్తుకెళ్ళిపోయారు.."

"వెంటనే నువ్వు దేవి ఇంటికి వెళ్ళి మీనాక్షితో ఈ విషయాన్ని చెప్పావు. ఇద్దరూ కలిసి స్వస్తికా హత్యా వ్యవహారం బయటకు పొక్కకుండా ఉండటానికి, స్వస్తికాను ఒక పెట్టెలో పెట్టి 'హౌజ్ హోల్డ్ ఆర్టికల్స్' అని చెప్పి లారీ ఆఫీసులో బుక్ చేశారు... దేవి క్యారెక్టర్ చెడుగా చిత్రీకరించి, ఎవడితోనో లేచిపోయిందనే భావన కలిగించటానికి బీరువా క్రింద అరలో కండోమ్స్ ప్యాకెట్‌ను దాచారు. అది నిజమని నమ్మించటానికి కిరణ్‌ను, దీప్తిని బెంగుళూరుకు పంపించి, దేవి పేరుతో టెలిగ్రామ్ ఇవ్వమని చెప్పారు.. దేవి, మోహన్ పేర్లతో బెంగుళూర్లో హోటల్లో రూమ్ బుక్ చేయించారు.. ఒడ్డూ పొడుగులో దేవిలా ఉన్న స్వస్తికాను.. మేము కనిపించకుండా పోయిన దేవినే దృష్టిలో పెట్టుకుని చూసినందువల్ల ఆ శవం మాకు దేవి శవంలాగా అనిపించింది.. అంతేనా? " అన్నాడు వివేక్.

ఔనన్నట్టు తలవంచుకున్నాడు సాంబయ్య.

"ఇప్పుడు నేనడగబోయే చిన్న చిన్న ప్రశ్నలకు ఠక్కున జవాబివ్వండి.. మిలట్రీ నాయుణ్ణి ఎవరు చంపారు? "

"నేనూ, కిరణ్.."

"జయంతి ఉన్న వీధిలో ఓ రోజు రాత్రి చెత్తకుండీ వెనక దాక్కున్నదెవరు? "

"కిరణ్"

పద్మావతి మిల్స్ టెలిఫోన్ బూత్ నుండి నాకు ఫోన్ చేసిందెవరు? "

"దీప్తి"

"మమ్మల్ని నీడలా వెంబడిస్తూ... మా కదలికలను ఎప్పటికప్పుడు తెలుసుకొని, అందుకనుగుణంగా మీ నలుగురూ మూవ్ అవుతూ వచ్చారు.. అంతే కదూ? !"

సాంబయ్య ఔనన్నట్టు తల ఊపాడు.

లాకప్ తలుపు మూసి స్టేషన్‌ముందు గదిలోకి వచ్చారు వివేక్, గోకుల్‌నాథ్‌లిద్దరూ. కుర్చీల్లో కూర్చొనున్న మోహన్, కైలాష్‌లిద్దరూ వాళ్ళను చూసి లేచి నిలబడ్డారు.

వివేక్ మోహన్‌కు షేక్ హ్యాండిస్తూ, "మోహన్.. ఈ కేసులో మీ సహకారం చాలా ఉంది! థాంక్యూ వెరీమచ్..." మోహన్ వినయంగా నవ్వాడు.

తలవంచుకొని.. కన్నీటితో చిన్నబోయిన ముఖంతో నిల్చున్న కైలాష్ భుజంపై చెయ్యి వేశాడు వివేక్.

"దేవి కచ్చితంగా మామూలు స్థితికివస్తుంది. అప్పుడైనా మీరు ఆమెతో ప్రేమగా ఉంటారా కైలాష్? !"

"తప్పకుండా సార్!!" కైలాష్ మాటల్లో నిజాయితీ స్పష్టంగా ధ్వనించింది. ©

# కాలాతీతం





# ది త్రీ మస్కటీర్స్

## (1844)

కత్తి యుద్ధాలు, రాజమహల్ కుట్రలు, కుతంత్రాలున్న కథ. పాఠకులను ఆకర్షించాలంటే కథాకాలం కూడా ముఖ్యమే. ఫ్రెంచి చరిత్రలో లూయీ XIII (1610-43) చక్రవర్తి పరిపాలన రాజకీయ అస్థిరతకు మారు పేరుగా మిగిలింది. రాజకుటుంబంలోని సభ్యులమధ్య విభేదాలు, చీటికీ మాటికీ ఒకరిమీద ఒకరు కత్తులు దూసుకోవటం, చక్రవర్తికి వ్యతిరేకంగా వ్యూహాలు రచించటం, సామంతుల తిరుగుబాట్లు ఆనాటి చరిత్ర. ఇదే అదనుగా ప్రైవేటు సైన్యాలు దేశంలో స్వైర విహారం చేశాయి. ప్రతి ఏటా కొన్ని వందల మందిని ఈ ముష్కరులు దోచుకున్నారు, వధించారు. సమాజంలో నైతిక విలువలు నశించాయి. చట్టబద్ధమైన పాలన లేదు. ధీరోదాత్తులైన సాహసవీరులు తమ శౌర్యపరాక్రమాలతో దుష్టలను మట్టుపెట్టడానికి కూడా సరైనకాలం యిదే. అలాంటి ఒక యోధుడే నవలలోని కథా నాయకుడు డార్టానన్. వివిధ చరిత్ర గ్రంధాలనుండి సేకరించిన సమాచారంతో చక్రవర్తీ, ఆయన పట్టమహిషి క్వీన్ ఆఫ్ ఆస్ట్రియా, ప్రధానమంత్రి కార్డినల్ రిషెలూ, ఇంగ్లండుకు చెందిన డ్యూక్ ఆఫ్ బకింగ్‌హామ్‌లను పాత్రలుగా మలిచి డ్యూమా ఈ 'హిస్టారికల్ రొమాన్స్' సృష్టించాడు.

1625లో బక్కచిక్కిన గుర్రం మీద పద్దెనిమిదేళ్ళ డార్టానన్ పారిస్ నగర ప్రవేశంతో ప్రారంభమవుతుంది కథ. గాస్కనీ కులీన వంశానికి చెందిన ఈ యువకుని వద్ద పదిహేను బంగారు నాణాలూ,



గాయాలకు పూసుకునే లేపనం మాత్రమే వున్నాయి. లూయీ చక్రవర్తి అంగరక్షక దళంలో యోధుడి(మస్కటీర్)గా చేరాల న్నది అతడి ధ్యేయం.

డాన్ క్విక్సాట్‌కూ యితడికీ కొన్ని పోలికలు కనిపిస్తాయి. అతడు గాలిమరలను చూసి రాక్షసులనుకుని కత్తి దూస్తే, ఇతడు కనిపించిన ప్రతివాడూ తనను పరిహసిస్తున్నాడనుకుని కయ్యానికి కాలు దువ్వుతాడు. అంగరక్షక దళ కెప్టెన్ ఎం.డిట్రెవిల్. అతణ్ణి కలవాలనుకుంటే ఈ వీధి పోరాటాలు ఆపాలి.

చక్రవర్తిని లూయీ, ది జస్ట్ (ధర్మప్రభువు) అని కీర్తిస్తారు. కాని ఆనాటి మరో అధికార కేంద్రం ప్రధాని కార్డినల్ రిషెలూ. దేశంలో శాంతిభద్రతలు నామమాత్రంగానైనా వున్నాయంటే ఆయన చలవే. ఆయనకు సొంత అంగరక్షక దళం కూడావుంది. రాజుగారి మనుషులకూ, ఈయన దళానికీ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది.

తన యుద్ధనైపుణ్యాన్ని నిరూపించుకున్న డార్టానన్ డిట్రెవిల్ కొలువులో చేరాడు. అక్కడ మరో ముగ్గురు అంగరక్షకులు అతోస్, అరామిస్, పార్తోస్‌లతో పరిచయమేర్పడుతుంది. త్రీ మస్కటీర్స్ వీళ్లే. వీళ్ళు ఆప్తమిత్రులు. ఒకరికోసం ఒకరు ప్రాణాలివ్వటాని కూడా వెనుకాడరు. 'అందరికోసం ఒక్కడు - ఒక్కడికోసం అందరూ' అన్నది వాళ్ల ఆదర్శం. కుర్రవాడైనా కత్తియుద్ధంలో ప్రతిభ కనబరచినందుకు డార్టానన్‌ను అభినందిస్తారు. 'ఇకనుండీ మనం నలుగురం ప్రాణస్నేహితులం' అంటారు. అంతలోనే వాళ్ల స్నేహాన్ని పరీక్షించటానికన్నట్టు, ప్రధానమంత్రి కార్డినల్ అంగరక్షకులు దాడి చేస్తారు. భీకర యుద్ధం జరుగుతుంది. డార్టానన్ వీరోచితంగా పోరాడి శత్రువుల్ని మట్టి కరిపిస్తాడు. ముగ్గురు మిత్రులకు గాయాలవుతాయి. ఈ ఓటమితో కార్డినల్ తన వ్యూహం మార్చి రాణిని బ్లాక్‌మెయిల్ చెయ్యాలనుకుంటాడు. చక్రవర్తి అంటే ఆమెకు పెద్దగా ఇష్టం లేదు. ఇంగ్లండ్‌కు చెందిన డ్యూక్ ఆఫ్ బకింగ్‌హామ్‌తో ప్రేమలో పడింది. ఈ రహస్యాన్ని తనకు అనుకూలంగా మలచుకోవాలి.




అంతఃపుర విషయాలన్నీ తెలిసిన మరో ఆంతరంగికురాలు కాన్‌స్టన్స్ బనాసూ. ఆమెను అరెస్టు చేసి రాణిని భయపెట్టవచ్చు కాని డార్టానన్ తెలివిగా బనాసూను రక్షిస్తాడు. ఆపదలో తననాదుకున్న ఈ వీరుడికే తన మనసు అర్పిస్తుంది బనాసూ.

రాణీగారు బకింగ్‌హామ్‌తో ప్రేమలో పడినమాట నిజమేగాని, ఫ్రాన్సుకు అపఖ్యాతి తేవటం ఆమెకిష్టం లేదు. తన ప్రేమకు చిహ్నంగా ఏదైనా జ్ఞాపికనివ్వమంటాడు బకింగ్‌హామ్. ఒక రోజ్‌వుడ్ పేటిక, కొన్ని వజ్రాలు బహూకరిస్తుంది రాణి.

త్వరలోనే కార్డినల్‌కు ఈ విషయం తెలుస్తుంది. తన కుట్రలో భాగంగా మరో అంతఃపుర కాంత మిలేడీ డి వింటర్‌కు ఓ కార్యం అప్పగిస్తాడు. రాణిగారికి చక్రవర్తి కానుకగా ఇచ్చిన వజ్రాలు కొన్ని దొంగిలించాలి. ఆ విధంగా భార్యాభర్తల మధ్య

# అలెగ్జాండర్ డ్యూమా
## 1802 - 1870

ఈ రచయిత పూర్తిపేరు అలెగ్జాండర్ డ్యూమా డేవీ డిలాపి లెటరీ. సాంటో డోమింగో(లాటిన్ అమెరికా)లో వ్యవసాయ క్షేత్రం కొని సాగుచేసిన ఆయన తాతగారిపేరు 'డేవీ డిలాపి లెటరీ'. నీగ్రో బానిసగా అక్కడ పనిచేసిన నాన్నమ్మ పేరు 'డ్యూమా'. తండ్రి శ్వేత, నల్లజాతి మిశ్రమ సంతానమైన ములాటో. నెపోలియన్ కాలంలో పారిస్ చేరుకుని ఫ్రెంచి వనితను వివాహమాడాడు. అలెగ్జాండర్‌కు నీలికళ్లూ, తెల్లచర్మం తల్లి నుండీ, శరీర దారుఢ్యం తండ్రి నుండీ సంక్రమించాయి.

డ్యూమాకు చదువంతగా అబ్బలేదు. పదహారో ఏట స్కూల్లో మొద్దబ్బాయి అనే అన్నారు టీచర్లు. అతికష్టం మీద, తండ్రి మిత్రుని ద్వారా పారిస్‌లో వుద్యోగం సంపాదించాడు. అయితే అక్కడ, అతణ్ణి అమితంగా ఆకర్షించింది నాటక రంగం. జనాకర్షక నాటకాలు తయారు చెయ్యటానికి సాహిత్య పరిజ్ఞానం అవసరం లేదు. ప్రేక్షకులను సీట్లకు కట్టికపడేసే మలుపులు, మెలికలు, పంచ్ డైలాగులు, ఉద్వేగ భరితుల్ని చేసే వీరోపన్యాసాలు, కాస్త కొత్తగా కనిపించే మసాలా ప్లాట్లు వుంటే చాలు. 1832లో తొలిసారి విజయం పలకరించింది. సంపన్నులూ, ప్రముఖులూ 'మిస్ట్రెస్'లను పెట్టుకోవటం ఆనాటి రివాజు. డ్యూమా సంబంధం పెట్టుకున్న మొదటి స్త్రీ కాథరైన్ లేబే. ఆ తర్వాత నటీమణులెందర్నో ఆయన చేరదీశాడు.

డ్యూమా రచయితగా మారటానికి కారణం అతని మిత్రుడు మాకె అని చెబుతారు. 1700లో అచ్చయిన 'డార్టానన్ జ్ఞాపకాలు' అనే పుస్తకం ఆధారంగా ఒక చారిత్రక నవల రాయాలనుకున్నారిద్దరూ. మాకె తొలి ప్రతి తయారు చేస్తాడు. డ్యూమా దానికి మెరుగులు దిద్దుతాడు. 'త్రీ మస్కటీర్స్' (ముగ్గురు తుపాకీ

చిచ్చుపెట్టాలి.

స్పెయిన్, ఆస్ట్రియాల సహాయంతో బకింగ్‌హామ్ తన అధికారానికి ఎసరుపెడుతున్నాడని కార్డినల్‌కు తెలుసు. వజ్రాల విషయం బహిర్గతమైతే చక్రవర్తి తక్షణమే ఆస్ట్రియాతో సంబంధాలు తెంచుకుంటాడు. రాణిగారి సోదరుడు పరిపాలిస్తున్న స్పెయిన్ కూడా తమకు శత్రుదేశమవుతుంది.

చక్రవర్తి అనుమతితో రాణి అంతఃపురాన్ని, ఆమె పడకగదిని కూడా సోదా చేయిస్తాడు కార్డినల్. కానీ అందులో బకింగ్‌హామ్‌కు ఆమె రాసిన ఒక అధికారిక పత్రం తప్ప మరే రహస్యాలూ దొరకవు. ఇది రెండవ ఓటమి. ఎలాగైనా రాణిపట్ల చక్రవర్తి మనసు విరిచెయ్యాలి.

"ప్రభూ.. రాణిగారి గౌరవార్థం నృత్యం, విందు ఏర్పాటు చెయ్యాలనుకుంటున్నాను. మీరిచ్చిన నగలన్నీ ధరించి ఆమె ఆరోజు హాజరయితే సముచితంగా వుంటుంది" అంటూ విన్నవించుకుంటాడు.

చక్రవర్తి తనకిచ్చిన వజ్రాలలో కొన్ని లేవని రాణిగారికీ తెలుసు. విందులో భర్త వాటి గురించి అడిగితే? అందుకే వాటి కోసం డిట్రెవిల్ అనుమతితో నలుగురు వీరులూ రహస్యంగా లండన్‌కు బయలుదేరుతారు. వీలైనంత త్వరగా బకింగ్‌హామ్ నుండి వజ్రాలు తీసుకురావాలి. దారిలో ఎన్నో ఆటంకాలు సృష్టిస్తాడు కార్డినల్. పలుచోట్ల దుండగులతో భీకరపోరు జరుగుతుంది. అథోస్, పార్థోస్, అరామిస్ గాయపడతారు. డార్టానన్ ఒక్కడే ఇంగ్లండు చేరుకుని విండ్సర్ దుర్గంలో బసచేసిన డ్యూక్‌కు రాణిగారిచ్చిన లేఖ చూపిస్తాడు. అయితే అతని వద్దా రెండు వజ్రాలెవరో దొంగిలించారు. దీనివెనక కార్డినల్ హస్తముంది. అయిదురోజుల

యోధులు) నవల నేపథ్యం ఇది. ఆ తర్వా డ్యూమాకు రచనా సహకారం అందించిన వాళ్ళెందరో. ఒకేసారి రెండుమూడు నవలలు కూడా పత్రికల్లో సీరియలైజ్ కావటంతో ఆయ నకు 'నవలల ఫాక్టరీ'గా పేరొచ్చింది. ఏమై తేనేం, ఈ సమిష్టి కృషివల్ల కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో (1844-45), క్వీన్ మార్గాట్ (1845), 45 గార్డ్స్‌మెన్ (1847-48), క్వీన్స్ నెక్ లేస్ (1849-50), బ్లాక్ ట్యూలిప్ (1850) వగైరా నవలలెన్నో వెలువడ్డాయి.

ఏ ఒక్క పాఠకుడూ ఈ పుస్తకాలన్నీ చదవ గలగటం కష్టసాధ్యమే. డ్యూమా సమగ్ర రచ నలు 247 సంపుటాలుగా వెలువడ్డాయి. ఈ నవలలనేకం నాటకాలుగా, తరువాతి కాలంలో సినిమాలుగా, టీవీ సీరియళ్లుగా రూపాంతరం చెందాయి.

కీర్తితోపాటు సహజంగానే ధనలక్ష్మి కూడా వరించింది. కాని డ్యూమా చేతిలో డబ్బు నిల వదు. పారిస్ పొలిమేరల్లో మాంట్ క్రిస్టో పేరుతో ఓ రాజభవనం నిర్మించి అందులో రోజూ తన మిత్రులు, ప్రియురాళ్ళు, అభిమా నులు, వందిమాగధులతో జల్సాలు చేశాడు. కొన్నాళ్ళకే 1848 నాటి ఫ్రెంచి విప్లవ ప్రభా వంతో పారిస్ నాటక రంగం కుప్పకూలింది. ఆదాయం తగ్గింది. డ్యూమా దుబారా ఖర్చు లతో కష్టాలు రెట్టింపయ్యాయి. తాను తాగటా నికి వైన్ లేదుగాని అతిథులకు షాంపేన్ అందించాడు.

1851లో 'మాంట్ క్రిస్టో'ను అమ్మకానికి పెట్టి అప్పుల బాధ తప్పించుకోవటానికి బ్రస్సెల్స్ వెళ్లాడు. 1853లో తిరిగివచ్చి ఓ దినపత్రిక ప్రారంభించాడు. కాని అప్పటికే ఆయన కలంలో పదును తగ్గింది. పాఠకుల దృష్టిలో 'విరమించిన' రచయిత.

1860లో ఇటలీ ఏకీకరణోద్యమ నాయకుడు గారిబాల్డితో భుజం భుజం కలిపి నేపుల్స్ నగర విముక్తికి సహకరించాడు. ఆ తర్వాత మరి కొ న్నాళ్ళు పాంపేలోని ఆర్కియాలాజికల్ పరిశో ధనల్లో సహకరించాడు.

కాని అప్పటికే వయసు మీద పడటంతో ఆరోగ్యం క్షీణించింది. కొడుకు అలెగ్జాండర్ డ్యూమా II (ఫిల్స్) కూడా ప్రముఖ రచయి తగా ఎదిగాడు.

వ్యవధిలో సరిగ్గా అలాంటివే నగలలో తిరిగి పొదగాలని స్వర్ణకారుణ్ణి ఆదేశిస్తాడు డ్యూక్. ఖర్చు ఎంతయినా ఫరవాలేదు. రెట్టింపు ధర ఇవ్వటానికైనా సిద్ధపడ తాడు. రాత్రింబవళ్లు పనిచేసి ఆభరణాన్ని సిద్ధం చేస్తాడు స్వర్ణకారుడు. అప్పటికి రాణిగారి గండం అలా గడిచింది.

★ ★ ★

కాన్స్టన్స్ కోసం విరహంతో తపించిపో తున్నాడు డార్టానన్. డిట్రెవిల్ తారసపడి "నీ మిత్రులెక్కడ"? అని అడుగుతాడు.

ముగ్గురు మిత్రులు గాయాల నుండి ఇంకా కోలుకోలేదు.

"రేపు ఉదయం వాళ్లను కలుస్తాను" అంటాడు డార్టానన్.

"రేపటిదాకా ఆగటమెందుకు?"

కాన్స్టన్స్ తనకోసం నిరీక్షిస్తుందని చెప్తాడు డార్టానన్.

"ప్రియురాలి కంటే మిత్రులే ఎక్కువ విశ్వాసపాత్రులు" అంటూ తన అనుభవ జ్ఞానంతో హెచ్చరిస్తాడు డిట్రెవిల్. తన పన్నాగాలలో కార్డినల్ ఎప్పుడూ స్త్రీలనే వాడుకుంటుంటాడు.

"నీ శత్రువును తక్కువ అంచనా వెయ్యకు. కార్డినల్ రిషెలూ చాలా ప్రమా దకరమైన వ్యక్తి. గాయపడిన నీ మిత్రు లకు ఎప్పుడు ఏ ఆపద ముంచుకొస్తుందో తెలియదు. తక్షణమే బయల్దేరు" అంటూ మరోసారి ఆదేశిస్తాడు డిట్రెవిల్.

కాని తన అధికారి మాటలను ఖాతరు చెయ్యక కాన్స్టన్స్ కోసం ఎదురుచూస్తాడు డార్టానన్. తమ సమావేశ స్థలంలో కార్డి నల్ పంపిన గూఢచారులు కూడా వుంటా రని అతడికి తెలుసు.

గంటలు గడుస్తాయి. కాన్స్టన్స్ రాదు. ఆమెను అపహరించారని చెబుతాడు. వార్తాహరుడు. కాన్స్టన్స్ ప్రాణం కాపాడ మని రాణిని అర్థిస్తాడు డిట్రెవిల్. మిత్రు



పిలకోసం బయలుదేరతాడు డార్టానన్.

అనేక సాహసాల తర్వాత నలుగురూ పారిస్‌కు తిరిగి వస్తారు. కాని వెంటనే మే నెలలో యుద్ధానికి సిద్ధం కావాలని ఆదేశం వస్తుంది.

కాన్స్టన్స్ జాడ తెలియదు. డార్టానన్‌కు ఆమె గురించి ఆలోచించే తీరిక కూడా లేదు. ఈలోగా అతనికి మిలేడీతో పరిచయం కలుగుతుంది. లార్డ్ డి వింటర్ సోదరుని భార్య ఆమె. గొప్ప సౌందర్య రాశి. అంతటి లావణ్యం డార్టానన్ యింత వరకూ చూడలేదు. ఆమె కూడా డార్టానన్ ప్రేమకు అడ్డుచెప్పలేదు. వజ్రాల విషయంలో తన పాచిక పారలేదు. ఈసారి అతనికి తగిన బుద్ధి చెప్పాలి.

మిలేడీ చెలికత్తె కిట్టీ డార్టానన్‌తో ప్రేమలో పడుతుంది. తన యజమానురాలి నుండి ప్రమాదం పొంచి వుందని అతణ్ణి వారిస్తుంది. కార్డినల్‌కు అత్యంత సన్నిహితురాలు మిలేడీ. ఆ ప్రేమ కపటమని రుజువు చెయ్యటానికి ఆమె మరో వ్యక్తికి రాసిన లేఖలు చూపిస్తుంది. మోసగత్తెను మోసగించాలని డార్టానన్, ఆమెతో చీకటి గదిలో ఒక రాత్రి గడిపి, తానే ఆమె ప్రియుణ్ణని నమ్మిస్తాడు. కృతజ్ఞతగా ఆమె తన విలువైన వుంగరం బహూకరిస్తుంది.

తర్వాత డార్టానన్ ఆ వుంగరాన్ని మిత్రుడు అతోస్‌కు చూపినప్పుడు తమ వంశానికి చెందిన ఆ ఆభరణం ఎక్కడ దొరికిందని ప్రశ్నిస్తాడు. మిలేడీ నిజస్వరూపం బయటపడాలంటే మరికొన్ని ఎత్తులు వెయ్యక తప్పదు.

డార్టానన్ మోసగాడని, మిలేడీకి ఆకాశరామన్న వుత్తరం రాస్తాడు అతోస్. అటువంటి ద్రోహిని మల్లయుద్ధంలో సంహరించి, బహుమతిగా తనతో ఒక రాత్రి గడపమంటుంది మిలేడీ. ఆ తర్వాత ఒక నాడు ఆమె భుజం మీద ఫ్రెంచి రాజముద్ర అయిన నేరస్తులకు వేసే ఐరిస్ పుష్పం చూసి ఆశ్చర్యపోతాడు డార్టానన్. ఈ విషయం తెలిసి ఆమె తప్పక తన భార్యే అయివుంటుందంటాడు అతోస్. కొన్ని సంవత్సరాల క్రితం చర్చిలో దొంగతనం చేసినప్పుడు పెట్టిన వాతలవి.

"జాగ్రత్త, ఆమె త్రాచుపాము కన్నా ప్రమాదకరమైనది" అంటూ మిత్రుణ్ణి హెచ్చరిస్తాడు అతోస్.

కాని డార్టానన్‌లాంటి వీరుడికి మృత్యువుతో చెలగాటమే నిత్య వినోదం కదా!

రాజుగారి అంగరక్షకులందరూ తన ఆస్థానంలో హాజరుకావాలని ఆజ్ఞ జారీ చేస్తాడు కార్డినల్. ఏ శిక్ష విధిస్తాడోనని భయపడతారు మిత్రులు. కానీ డార్టానన్‌కు కార్డినల్‌లో ఓ ధీరోదాత్తుడైన శత్రువు కనిపిస్తాడు.

డిట్రెవిల్‌ను వదిలి తన అంగరక్షకుల్లో చేరమంటాడు కార్డినల్. ఈ యువకుడి సాహస కార్యాలన్నీ అతడికి తెలుసు. ప్రధానమంత్రి ప్రతిపాదనను సున్నితంగా తిరస్కరిస్తాడు డార్టానన్. కార్డినల్‌కు కోపం వస్తుంది. తన ఆజ్ఞను ధిక్కరించిన వాడు బతికుండ కూడదు.

మరోవైపు యుద్ధసన్నాహాలు జోరుగా కొనసాగుతున్నాయి. మిలేడీ కోసం కబురంపించాడు కార్డినల్. రాణి-బకింగ్‌హామ్‌ల ప్రేమ వ్యవహారం గురించి మరికొంత సమాచారం లభిస్తుంది. ఈసారి ఆమె ఆట కట్టించాలి. యుద్ధంలో ఇగ్లండు తటస్థంగా ఉండాలని ఆమె డ్యూక్‌ను ఒప్పించగలదా? ఇందుకతడు నిరాకరిస్తే, ఫ్రాన్స్ కోసం ఆమె అతణ్ణి హత్య చెయ్యాలి!

తనను మోసం చేసిన డార్టానన్‌పై పగతో రగిలిపోతున్నది మిలేడీ. కార్డినల్ చెప్పినట్టు చెయ్యటానికి సిద్ధం. ప్రతిగా తనకు డార్టానన్ ప్రాణాలు కావాలి.

కార్డినల్, మిలేడీల మధ్య జరిగిన ఈ

రహస్య సంభాషణ అతోస్ చెవిన పడు తుంది. ఎంత చెడ్డా ఆమె తన భార్య! ఇలాంటి నీచమైన పనులెందుకు చేస్తున్నా వని నిలదీస్తాడు. కాని ఆమె ఎవరి మాటా వినదు. ఒంటరిగా ఇంగ్లండుకు బయల్దేరుతుంది. ఆమెకు బద్ధ శత్రువులు ముగ్గురు. మొదట కాన్స్టన్స్, తరువాత అతోస్, చివరగా డార్టానన్. కాని తక్షణ కర్తవ్యం బకింగ్‌హామ్ హత్య.

రోషెల్ వద్ద జరిగిన యుద్ధంలో నలుగురు మిత్రులూ ప్రాణాలొడ్డి పోరాడతారు. దేశం కోసం ఏ త్యాగం చెయ్యటానికైనా వాళ్లు సిద్ధమే.

ఈ నలుగురు మిత్రులు పంపిన గూఢచారి, మిలేడీ కన్న ముందే ఇంగ్లండు చేరుకున్నాడు. డి వింటర్‌ను ఆశ్రయించింది మిలేడీ. ఆమె నేర చరిత్ర అతనికి సుపరిచితం. ఈ నరరూప రాక్షసిని కట్టడి చెయ్యమని తన అనుచరుడు జాన్ ఫెల్టన్‌ను ఆదేశించాడతడు.

ఇక మిలేడీ ఇంగ్లండు నుండి తిరిగి వెళ్లే ప్రసక్తే లేదు. పద్నాలుగు రోజుల్లో ఆమెకు శిక్ష ఖరారు చేయవచ్చు. కాని ఆ చతురురాలికి, పరిస్థితులను తనకు అనుకూలంగా మలచుకోవటానికి ఆ సమయం చాలు. తన అందచందాలతో, వాలు చూపులతో జాన్ ఫెల్టన్‌ను వశం చేసుకుంటుంది.

తన సమస్యలన్నింటికీ కారణం బకింగ్‌హామ్ అని ఫెల్టన్‌ను నమ్మిస్తుంది. ఆమెను చెరనుండి విడుదల చెయ్యటమే కాకుండా, తను స్వయంగా బకింగ్‌హామ్‌ను హత్య చేస్తాడు ఫెల్టన్.

చివరి క్షణంలో కూడా 'ఆన్' అంటూ రాణి పేరునే స్మరిస్తాడు ఆ ప్రేమికుడు. అందరి కళ్లు గప్పి ఫ్రాన్సుకు ప్రయాణమైంది మిలేడీ.

రాజప్రాసాదంలోని ఒక ఆశ్రమంలో కాన్స్టన్స్ క్షేమంగా వున్నదని నలుగురు మిత్రులకు తెలుసు. మిలేడీ కూడా ఆమె జాడ కనిపెట్టింది. ఏదో మిష మీద అక్కడికెళ్లి తనకూ వసతి కల్పించమని అర్థించింది. ఆమె అక్కడికి చేరుకున్న విషయం తెలిసి హుటాహుటిన బయలుదేరుతారు మిత్రులు. కాని అప్పటికే తన వుంగరంలోని వజ్రం పొడిచేసి మద్యంలో కలిపి కాన్స్టన్స్‌పై ప్రయోగించివుంటుంది మిలేడీ.

డార్టానన్ దుఃఖోపహతుడై ప్రేయసిని చేతుల్లోకి తీసుకుని రోదిస్తాడు. తన హంతకురాలిపేరు చెప్పి కళ్ళు మూసుకుంటుంది కాన్స్టన్స్. సరిగ్గా అప్పుడే లార్డ్ డి వింటర్ అక్కడికి చేరుకుంటాడు. అతడూ ప్రతీకారేచ్ఛతో రగిలిపోతున్నాడు. మిలేడీకి మరణ శిక్ష విధించే అధికారం తనకే వుందంటాడు అతోస్. ఆమె అతడి భార్య!

"నేను చేసిన ఒక్క నేరమైనా నిరూపించగలరా?" అని ప్రశ్నిస్తుంది మిలేడీ. అప్పుడే ముసుగు వేసుకుని ప్రవేశించిన ఒక వ్యక్తి ఆమె నేరాల చిట్టా చదివి వినిపిస్తాడు. తొలుత రాజముద్రతో వాతలు పెట్టిన అధికారి అతడు. చట్ట ప్రకారం, ఆమెకు మరణశిక్ష అమలు జరగాల్సిందే. అతోస్ ఆ పని పూర్తి చేస్తాడు.

★ ★ ★

మిలేడీ మరణానికి ప్రతీకారం తీర్చుకోవాలనుకుంటాడు కార్డినల్. కాని ఆమె నేరాల గురించి చెప్పి అతడి కోపాన్ని తగ్గిస్తాడు డార్టానన్.

"నువ్వు గొప్ప యోధుడివి. ధైర్యశాలివి. నీ రాజభక్తి ప్రశంసనీయం" అంటూ అభినందిస్తాడు కార్డినల్.

'త్రీ మస్కటీర్స్' నవల ఇంతటితో ముగుస్తుంది. కాని ఈ వీరుల కథ 'ట్వెంటీ ఇయర్స్ ఆఫ్టర్' అనే మరో నవలలో కొనసాగుతుంది.

–వసంత

# కన్నడ మణిపూస

# కె.వి.పుట్టప్ప

**ఇరవయ్యో శతాబ్ది కన్నడ సాహిత్యక్షేత్రంలో కుప్పళ్లి వెంకటప్పగౌడ పుట్టప్పది అగ్రస్థానం. బహుప్రక్రియల్లో ఆయన చేసిన రచనలు మణిపూసలుగా భాసించాయి. విశ్వమానవతావాదాన్ని ప్రబోధించిన మహనీయుడాయన. ఆయన రాసిన 'రామాయణ దర్శనం' కావ్యానికి 1967లో జ్ఞానపీఠ పురస్కారం లభించింది. అదే సంవత్సరం ప్రముఖ గుజరాతీ సాహితీవేత్త ఉమాశంకర్‌జోషికి కూడ ఈ పురస్కారం లభించడం విశేషం.**

విశ్వసాహిత్యంలో సమున్నత స్థానం వహించిన ఇతిహాసాల ప్రస్తావన వచ్చినప్పుడు వెంటనే స్ఫురించేది సంస్కృతంలోని వాల్మీకి రామాయణం. అనేక దేశాల్లో విస్తృత ప్రచారంలో వున్న మహేతిహాసమిది. భారతదేశంలోని వివిధ ప్రాంతాల్లో కవిశేఖరులు తమతమ భాషల్లో దీనికి విశిష్ట రూపం సంతరింపజేశారు. మలయాళంలో రామవర్మ, తమిళంలో కంబరు, తెలుగులో విశ్వనాథ, హిందీలో తులసీదాసు, బెంగాలీలో కృత్తివాస ఓఝూ, ఒరియాలో సిద్ధేశ్వరానంద- ప్రభృతులు తమదైన ముద్రలో రామాయణాన్ని అనుసృజించారు.

పుట్టప్ప చిక్కమంగళూరు జిల్లా హీరెకొడిగె గ్రామంలో 1904 డిసెంబరు 29న జన్మించాడు. ఆయన స్వస్థలం మాత్రం షిమోగా జిల్లా కుప్పళ్ళి గ్రామం. తుంగానది, సహ్యాద్రి పర్వతశ్రేణి, చక్కటి అడవులతో అలరారే ప్రాంతమది. వీరిది ఉత్తమ సంస్కారం గల సంపన్న కుటుంబం. తండ్రి వెంకటప్పగౌడ. తల్లి సీతమ్మ. పుట్టప్ప స్వగ్రామంలోని పాఠశాలలో విద్యాభ్యాసం ప్రారంభించాడు. చిన్నతనం నుంచీ పుస్తకాలు చదివే అలవాటున్న పుట్టప్ప ప్రతిభావంతుడిగా గుర్తింపు పొందాడు. అప్పట్లోనే రామాయణం, జైమినీ భారతం చదివాడు. తీర్థహళ్ళిలోని ఆంగ్లో వెర్నాక్యులర్ పాఠశాల, మైసూరులోని వెస్లియన్ మిషన్ పాఠశాల, మహారాజా కళాశాలలో చదువు సాగించి ఎం.ఎ. పట్టా స్వీకరించాడు. విద్యార్థి దశలోనే అరవిందుడు, రామకృష్ణపరమహంస, వివేకానందుడు, వర్డ్స్‌వర్త్, మిల్టన్, షేక్స్‌పియర్, టాల్‌స్టాయ్ రచనలు అధ్యయనం చేశాడు. కన్నడంతోపాటు ఇంగ్లీషులో పుట్టప్ప ఆనాడే ఘటికుడనిపించుకున్నాడు. రచనా వ్యాసంగం అయిదో తరగతిలోనే ఆరంభమయింది. 1929లో మైసూరు మహారాజా కళాశాలలో అధ్యాపకుడిగా ఉద్యోగ జీవితం ఆరంభించాడు. 1937లో హేమవతిని వివాహం చేసుకున్నాడు. బెంగళూరులోని సెంట్రల్ కళాశాలలో అసిస్టెంట్ ప్రొఫెసరుగా పనిచేసి, చివరకు మైసూరు విశ్వవిద్యాలయం ఉపకులపతిగా సేవలందించి 1960లో పదవీ విరమణ గావించాడు.

ఊరిపేరు, తండ్రిపేరు, తనపేరు సూచించే రీతిగా పుట్టప్ప 'కువెంపు' అనే కలం పేరుతో రచనలు చేశాడు. 1929లో ఇంగ్లిషులో 'బిగినర్స్ మ్యూజ్' అనే కవితా సంపుటి వెలువరించాడు.




దానిని ప్రశంసిస్తూ సుప్రసిద్ధ ఐరిష్ కవి జె. హెచ్. కజిన్స్ కన్నడంలోకి అనువదించమని సూచించాడు. అనువాదం చేస్తూ పుట్టప్ప పొందిన అద్భుతానుభూతితో కన్నడంలోనే రచనలు సాగించాలని నిర్ణయించుకున్నాడు. అంధవిశ్వాసాలను నిరసించాడు. సామరస్యం, సమన్వయం, పూర్ణదృష్టి కువెంపు రచనల్లో ప్రతిబింబి

స్థాయి. ప్రకృతి సౌందర్యం, దేశాభిమానం చిత్రించే కవితలెన్నో వెలయించాడు. 'భారతి మనదేవత/ఆమే జగత్తు, ఆమే విశ్వం/భారత దేశం మన మాతృమూర్తి' అని సన్నుతించాడు. భారతీయ చింతన నేపథ్యంలో ఆధునికతను ఆహ్వానించాడు. 'తరలిరండి, పేదరికాన్ని కూకటి వేళ్ళతో పెళ్ళగిద్దాం/ తరలిరండి అజ్ఞానపు భూతాన్ని తరిమికొడదాం/ తరలిరండి విజ్ఞానజ్యోతిని ఉవ్వెత్తున నిలుపుదాం' అని పిలుపునిచ్చాడు. ఆయన విశ్వమానవతను, సర్వోదయాన్ని కాంక్షించాడు. 'ఓ నా సోదరులారా! మనుజ మతంలో చేరండి/ విశ్వైక పథంలో కదలండి' అని ఉద్బోధించాడు. 'ఓ నన్న చేతన, ఆగు నీ అనికేతన' (ఓ నా చైతన్యమా.. నీ ధ్యేయం అనంతం) అనే కువెంపు సూక్తి బహుళ వ్యాప్తి పొందింది. ఆయన నవోదయ ఉద్యమ రూపశిల్పి.

ఏ సాహిత్య ప్రక్రియ చేపట్టినా దానిని శిఖర స్థాయికి తీసుకువెళ్ళడం ఆయన ప్రత్యేకత. 'కానూరు సుబ్బమ్మ హెగ్గడితి' నవలను మరో కన్నడ జ్ఞానపీఠ పురస్కార గ్రహీత గిరీష్ కార్నాడ్ చలనచిత్ర కళాఖండంగా రూపొందించాడు. 'మలెగళల్లి మధుమగళు' నవలలో కథాకథనం, ప్రకృతి చిత్రణ, ప్రేమోదంతం, కులభేదాల తీరు తెన్నులు అందరినీ ఆకట్టుకున్నాయి. కవితా రచనలో కువెంపు వైదుష్యం అసమానం. ఆధునిక కన్నడ కవితావైభవానికి ఆయన కావ్యాలు ప్రతీకలు. సార్వజనీనత, సర్వధర్మసారం, సార్వకాలికత వీటిలో వ్యక్తమవుతాయి. పాంచజన్య, శూద్ర తపస్వి, అగ్నిహంస, కింకిణి, కావ్య విహార, ఇక్షు గంగోత్రి, రామాయణ దర్శనం మొదలైన 19 కృతులు నిజంగా పెన్నిధులే. మలెనాడిన చిత్రగళు, సన్యాసి మత్తు ఇతరె కథెగళు, నన్న దేవర మత్తు ఇతరె కథెగళు అనే 3 కథా సంపుటాలు, ఇంకా మహారాత్రి, రక్తాక్షి, బలిదాన, యమన సోలు ఇత్యాది 10 నాటకాలు, 7 సాహిత్య విమర్శలు, అలంకార శాస్త్ర గ్రంథాలు, 6 బాల సాహిత్య రచనలు అందించాడు.

దశాబ్దం పాటు పుట్టప్ప చేసిన తపోదీక్ష ఫలితమే జ్ఞానపీఠ పురస్కారం అందుకున్న రామాయణ దర్శనం మహాకావ్యం. తన గురువు వెంకటణ్ణయ్యకు ఈ కృతిని అంకితమిచ్చాడు. శాశ్వత ఆధ్యాత్మిక విలువల్ని కవి ఇందులో నూతన శిల్పంతో ప్రదర్శించాడు. రాముడు ఆదర్శ పురుషుడు మాత్రమే కాదు. ఆదర్శ మానవుడు కూడా. సీతారాములు ప్రకృతి, పురుషులు. ఊర్మిళ విరహిణి కాదు, తపస్విని. ఈ కావ్యంలో కవి కల్పనలు, అన్వయాలు మహోన్నతంగా ఉన్నాయి. పాప విమోచన సంభవమని నిరూపించాడు. కైక, వాలి, శూర్పణఖ, రావణుడు, మంధర వంటి పాత్రలను కొత్త కోణంలో దర్శించాడు. సంస్కృతం, కన్నడ మహాకావ్య సంప్రదాయాలను పాటిస్తూ పుట్టప్ప 'మహాఛందస్సు'లో ఈ కృతిని రచించాడు. పాశ్చాత్య మహాకావ్య లక్షణాలు కూడా ఇందులో చోటు చేసుకున్నాయి. ఆధునిక దృష్టితో మానవీయతను, సమసమాజ తత్వాన్ని నిక్షిప్తం చేశాడు. కొన్ని సన్నివేశ కల్పనలు పుట్టప్ప శేముషికి నిదర్శనాలు. సీతతో పాటు రాముడు కూడా అగ్నిప్రవేశం చేస్తాడు. దశానన స్వప్నసిద్ధ ఘట్టం రామాయణ దర్శనంలో పుట్టప్ప చేర్చిన అత్యద్భుత కల్పన. ఇందులో తానూ, కుంభకర్ణుడు సీతమ్మతల్లి ఒడిలో బిడ్డలుగా మారినట్లు కలగంటాడు.


కె.వి.పుట్టప్ప

ఆయన కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం, మైసూరు, ధార్వాడ్, కర్ణాటక విశ్వవిద్యాలయాల నుంచి డాక్టరేట్లు, కేంద్ర ప్రభుత్వం నుంచి పద్మవిభూషణ్ అందుకున్నాడు. కర్ణాటక ప్రభుత్వం ఆయనను ఆస్థాన కవిగా నియమించింది. 'పంపప్రశస్తి' పురస్కారం పొందిన ప్రథమ సాహితీవేత్త ఆయనే. కేంద్ర ప్రభుత్వం జాతీయ కవిగా పరిగణించింది. ఆయన పేర షిమోగాలో 'కువెంపు విశ్వవిద్యాలయం' ఏర్పాటయింది. 'కన్నడం పేరు చెప్పగానే ఎద చెంగలిస్తుంది- కన్నడ ఎనెకుణి దాను వదెన్నదె- అని సగర్వంగా ప్రకటించిన కువెంపు కన్నడ భాషా సాహిత్యాలకు సేవలందించాడు. కన్నడాన్ని బోధనభాషగా చేయడానికి కృషి చేశాడు. 'కన్నడ అధ్యయన సంస్థ' స్థాపించి పరిశోధనలకు దోహదం చేశాడు. 1994 నవంబరు 11న మరణించిన కువెంపు పేరు మన సాహిత్యలోకంలో అజరామరం.

**–గోవిందరాజు రామకృష్ణారావు**

# మహా గాయనిని బాధపెట్టిన గీతం

గాంధీజీకి కొన్ని హిందీ భక్తి గీతాలను కర్ణాటక సంగీత విదుషీమణి యం. యస్. సుబ్బులక్ష్మిచే పాడించుకొని వినాలని అభిలాష కలిగింది. మొదట అనుకున్న ప్రకారం 1947లో ఆమె సంగీత కచ్చేరి ఢిల్లీలో జరుగలేదు. అందువల్ల చెన్నై ఆకాశవాణి కేంద్రంలో ఆమె చేత ధ్వని ముద్రితం చేయించి, గాంధీజీకి పంపాలని నిర్ణయించారు. ముందనుకున్న పాటలకు తోడు 'హరి తుమ హరో' అన్న పాటను కూడా ఆమె చేత పాడించాలని గాంధీజీ అభిప్రాయపడ్డారు.



చెన్నై ఆకాశవాణి కేంద్రంలో ధ్వని ముద్రణకు నిర్ణయించిన రోజు దగ్గరపడటం, 'హరి తుమ హరో' పాటతో తనకు పరిచయం లేకపోవడం వల్ల ఆపాటను ఇతర కళాకారులతో పాడించాలని సుబ్బులక్ష్మి చెప్పారు. 'ఆమె ఎలా పాడినా సరే. ఆమె కంఠం వింటే చాల'ని గాంధీజీ అన్నారు.

చెన్నై ఆకాశవాణి కేంద్రంలో 1947 అక్టోబరు 1న ధ్వని ముద్రణ జరిగింది. మరునాటి ఉదయమే ఆ ధ్వని ముద్రికలు ఢిల్లీకి పంపగా గాంధీజీ విన్నారు. ఆనంద పులకితులయ్యారు. యం. యస్. ఇది విని సంతృప్తి చెందారు.

ఇది జరిగి నాలుగు నెలలు పూర్తికాక మునుపే గాంధీజీ హత్యకు గురయ్యారు. ఆకాశవాణిలో ఈ వార్త అనంతరం యం. యస్. పాడిన పాటలను ప్రసారం చేశారు. ఆ వార్తను, పాటలను విన్న సుబ్బులక్ష్మి దుఃఖం తట్టుకోలేక మూర్ఛపోయారు. చాలాకాలం వరకూ 'హరి తుమ హరో' అనే పాటను ఆమె పాడేందుకు, వినేందుకు నిరాకరిస్తూ ఉండేవారు.

అప్పటి నిజం

# ఆమె ముందు నేనెంత?



భారతదేశ రాజధాని కొత్తఢిల్లీలో ఒక సేవా సంస్థ సహాయార్థం సంగీత కచ్చేరి ఏర్పాటు చేశారు. ప్రఖ్యాత కర్ణాటక సంగీత విదుషీమణి యం. యస్. సుబ్బులక్ష్మి గాయని. సభకు నాటి భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ కూడా వచ్చారు. పనుల ఒత్తిడి కారణంగా ఒక అర్థగంట మాత్రమే ఉంటానని ఆయన ముందుగానే నిర్వాహకులకు చెప్పారు.

సుబ్బులక్ష్మి గానం ప్రారంభమయింది. ఆ గానమాధుర్యంలో మునిగిపోయి నెహ్రూ కచ్చేరి పూర్తయ్యేదాకా కూర్చుండిపోయారు. ముగింపులో రెండు మాటలు మాట్లాడాల్సిందిగా నిర్వాహకులు కోరగానే అంగీకరించారు. నెహ్రూ మాట్లాడుతూ 'నేనొక సాధారణ ప్రధానిని మాత్రమే. కానీ సుబ్బులక్ష్మిగారు సంగీత సామ్రాజ్ఞి. ఆమె ముందు నేనెంతటివాడని?' అని ప్రశంసిస్తుంటే సభికులందరి చప్పట్లు మిన్నంటాయి.

# ఉద్యోగం

ట్యాంక్‌బండ్ 18 కథలు

సముద్రాల

'ఏమౌతుందట.. మనిషికి పొగరు కాక పోతే? !'

ధనుష్ మనసులోనే మరోసారి గింజుకున్నాడు. పెదాల మధ్య సిగరెట్ అతనిలోని క్రోధానికి ప్రతీకగా ఎర్రగా కాల్తోంది. సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తూ ట్యాంక్‌బండ్ బెంచీమీద ఎంత







సేపట్నించీ కూర్చున్నాడో ఏమో కాల్చిపడేసిన సిగరెట్ పీకలు అక్కడ గుట్టలా కన్పిస్తున్నాయి..

ఝాన్సీ!.. తనెంతో ఏరికోరి ఎంచి, ప్రేమించి పెళ్లాడిన అందాల భార్య తనను పూచికపుల్లలా తీసిపారేస్తోంది! తమ చిన్నారి శ్రవణ్ కోసమైనా మెట్టు దిగుతాననడం లేదు.. అదే తన కోపానికి కారణం..

తనకు సంపాదన లేదనే కదా ఆమెకు చిన్నచూపు? ఔను ఎలా ఉంటుంది సంపాదన? ఆర్థికసంక్షోభం పుణ్యమా అని ఆర్నెల్లు తిరక్కుండానే ఉద్యోగం ఊడింది తనకు. ఐదంకెల జీతం అదృశ్యమైంది. బిజినెస్ చేయాలంటే పెట్టుబడేది? లవ్‌మ్యారేజి కారణంగా అయిన వాళ్లు దూరమయ్యారు. ఇలాంటప్పుడే కదా? భార్యాభర్తలు ఒకరికొకరు ఆసరాగా నిల్చేది..

'దుబాయ్‌లో మన ఫ్రెండున్నాడు. పది రకాల వ్యాపారాలు చూసుకోలేక ఛస్తున్నాడు.. నీలాంటి నిజాయతీపరుడు దొరికితే నెత్తిన పెట్టుకుంటాడు. పైగా వ్యాపారంలో పదిపైసల వాటా ఇస్తాడు' అన్నాడు రమణ నిన్న బార్లో కలిసినప్పుడు. వాడలా చెప్పడం ఇది నాలుగోసారి. అకౌంట్స్‌లో దిట్ట అయిన తనకూ వెళ్లాలనే ఉంది.. కానీ దుబాయ్ వెళ్లాలంటే మాటలా? లక్షయినా కావాలి.. ఆ సొమ్ము విషయంలోనే తను ఝాన్సీ హెల్ప్ కోరేది. కానీ వింటేగా? పైగా అసహ్యంగా చూస్తుందేమిటి?

మొన్న సాయంత్రం రమణ, ఆనంద్, తనూ బార్లో కూర్చుని కబుర్లాడుతుండగా ఖరీదైనబట్టల్లో ఓ ఫారినర్ వచ్చాడు.. చూడ్డానికి గొప్ప భాగ్యవంతుడిలా ఉన్నాడు.. అనుకుంటా! కౌంటర్ దగ్గరకెళ్లి ఇంపోర్టెడ్ సరుకు రెండుబాటిళ్లు తీసుకుని జేబులోంచి ఫెళఫెళలాడుతున్న కరెన్సీ నోట్ల కట్టతీసి నాలుగునోట్లు విసురుగా కౌంటర్‌పై పడేసి గిరుక్కున వెనుతిరిగాడు. కౌంటర్‌లో అతను రెండునోట్లే తీసుకుని మిగిలినవి వెనక్కు ఇవ్వబోతున్నా తీసుకోకుండా 'కీపిట్ మైబాయ్' అంటూ చిరునవ్వుతో వెళ్లిపోయాడు.

'కొంచెం తెలివుంటే ఇలాంటి బంగారు బాతులతో లక్షా రెండు లక్షలు ఈజీగా సంపాదించవచ్చు' అన్నాడు రమణ అతను వెళ్లినవైపే చూస్తూ.

తలూపుతూ ఆనంద్ నవ్వాడు.

తనకే అర్థం కాక తెల్లమొగమేశాడు.

మళ్లీ రమణే మొదలెట్టాడు.

'మా కాలనీలో జలజనే ఆవిడ ఉంది. భర్త, పిల్లల్ని చూసుకుంటూనే నెలనెలా లక్షల్లో సంపాదిస్తుంది. వాళ్లిల్లు ఎలా ఉంటుందో తెలుసా? మినీ ప్యాలెస్ అనుకో! ఇల్లంతా ఖరీదైన ఫర్నీచర్.. ఎటు వెళ్లాలన్నా కారు'..

'ఎలా సాధ్యం? ' అడిగాడు తను.

'ఇదుగో ఇందాక చూశామే బంగారు బాతు! అలాంటివాళ్లు ఏ హోటల్లో దిగారో.. ఎక్కడున్నారో తమ నెట్‌వర్క్ ద్వారా తెలుసుకుంటారు.. ఆ ఎదవలు మన ఆడోళ్లంటే పడిచస్తారు.. ఇందాక చూశావ్‌గా వాడికి డబ్బంటే ఎంత నిర్లక్ష్యమో? కచ్చితంగా ఆ పాయింటునే పట్టుకుని జలజలాంటి వాళ్లు కొన్ని గంటల్లోనే యాభై-అరవై వేలు గుంజుతారు. ఏదో బిజినెస్ డీల్ మాట్లాడాలన్న సాకుతో వాడిదగ్గరకి కార్లో వెళ్తారు ఎవడికీ అనుమానం రాకుండా. లేదంటే వాడినే ఇంటికి పిలిపించుకుంటారు..'

'ఇలాంటి కేసులు నెలకు ఒకటో రెండో తగిలినా చాలు.. లక్షకు తక్కువ ఉండదు.. అరే రమణా నీకింకో విషయం తెలుసా? మీ జలజ తనలాంటి అమ్మాయి

లకి కేసులు బుక్‌చేసి కమీషన్ కూడా కొడుతుందట' అన్నాడు ఆనంద్.

'అందుకేరా మా వీధి ఎప్పుడూ కలర్‌ఫుల్‌గా ఉంటుంది.. అయితే చీప్‌గా ఎవరూ బిహేవ్ చేయరు.. అంతా ఎడ్యుకేటెడ్ హైఫై సొసైటీవాళ్లే!' అన్నాడు రమణ.

అప్పుడే బల్బువెలిగింది తనకు. అప్పట్నుంచీ ఝాన్సీని అడుగుతున్నాడు. అభ్యర్థిస్తున్నాడు.. వేడుకుంటున్నాడు.. ప్రాధేయపడుతున్నాడు.. కనీసం శ్రవణ్ కోసమైనా ఒక్కసారికి ఎలాగో భరించమంటున్నాడు. అదీ తను దుబాయ్ పోవడానికి అవసరమైన డబ్బు జమయ్యేవరకే! ఆ తర్వాత ఝాన్సీకి అవసరం ఏంటి? తనే రూపాయల్లో ముంచి తేలుస్తాడు ఆమెను! కానీ వినదే ఏంచేయాలి? ఎలా చెప్పాలి?

**తనకు సంపాదన లేదనే కదా ఆమెకు చిన్నచూపు? ఔను ఎలా ఉంటుంది సంపాదన? ఆర్థిక సంక్షోభం పుణ్యమా అని ఆర్నెల్లు తిరక్కుండానే ఉద్యోగం ఊడింది తనకు. విదంకెల జీతం అదృశ్యమైంది. బిజినెస్ చేయాలంటే పెట్టుబడేది? లవ్‌మ్యారేజి కారణంగా అయినవాళ్లు దూరమయ్యారు.**

పైగా తిట్టిపోస్తోంది.. ఏడుస్తోంది.. చనిపోతానంటోంది? ఏం చెప్పాలీ ఫూల్‌కు?

అందుకే తన కోసం ఆ మాత్రం చేయలేని మనిషి కోసం తనెందుకు అల్లాడాలి అనుకుని ఇక ముఖం చూపించను అంటూ ఉదయం తను ఇల్లువిడిచి ట్యాంక్‌బండ్‌కు వచ్చేశాడు.

ఉన్నట్లుండి ఏవో కేకలు.. అరుపులు.. ఏడుపులు వినబడడంతో ఈ లోకంలోకి వచ్చాడు ధనుష్. తలతిప్పి రోడ్డుమీదకు చూసేసరికి ఓ రిక్షావాడు ఎవడినో చితకబాదుతున్నాడు.. రిక్షాలో కూర్చున్న ఆమె 'కొట్టు కొడుకును.. బొక్కలు ఇరగదీయి' అంటోంది.

రిక్షావాడు తన భార్యను ఎక్కించుకుని సిన్మాకు తీసుకుపోతున్నాడు. ఇద్దరూ నవ్వుకుంటూ కేరింతలు కొడుతూ పోతుంటే ఎవడో రోడ్డు రోమియో ఆపి, 'ఏయ్ రిక్షా.. అమ్మాయితో సహా ఫలానా హోటల్‌కి కిరాయెంత? ' అని అడిగాడు. అంతే రిక్షావాడు భగ్గుమన్నాడు.

'నీకు నా పెళ్లాం కావాల్రా దొంగనాయాలా? పెళ్లాన్ని అమ్ముకునే బజార్నాకొడుకును అనుకున్నావ్‌రా పుండాకోర్' అంటూ కలియబడ్డాడు.

అక్కడి వారి మాటలవల్ల విషయం ధనుష్‌కి అర్థమైంది. అంతే! ఛళ్లున ఎవరో కొరడాతో కొట్టినట్టయింది. అప్పటిదాకా తను ఎంత నీచంగా ఆలోచించాడో తలుచుకుంటేనే కంపరం అన్పించింది. ఒక రిక్షామనిషికి ఉన్న ఇంగితం తనకు లేకపోయింది. ఝాన్సీని తను ఎంత క్షోభ పెట్టాడు? దుబాయే వెళ్లక్కర్లేదు ఇక్కడే ఏదో ఉద్యోగం చూసుకుంటానని తనకు చెప్పాలి.. అనుకున్న వెంటనే లేచి ఇంటి దారి పట్టాడు..

ఇంటికి చేరుకున్న అతన్ని తలుపు తాళం వెక్కిరించింది.

పక్కింటి సుభద్ర 'అన్నయ్యా వదిన నువ్వొస్తే ఇమ్మని చెప్పింది..' అంటూ తాళం చెవి ఇచ్చింది.

తాళం తీసి లోపలకికి అడుగుపెట్టిన ధనుష్‌కి ఆశ్చర్యం! టేబుల్‌మీద ఓ లావైన పచ్చనోట్లకట్ట, దానికింద చిన్న చీటీ-

'ఇవిగో నువ్వుకోరిన యాభైవేలు! నువ్వు చెప్పినట్లే సంపాదించా!! వెళ్లి ఊరేగు.. పెళ్లాం ఒళ్లమ్మి ఉద్యోగం కొనుక్కునే మొగుడు నాకొద్దు. నువ్విది చూసేసరికి నేనూ.. నా బిడ్డా ఈ లోకాన్నే విడిచి వెళ్లిపోతాం.. గుడ్‌బై' అన్న అక్షరాల్ని చదివి అతనలాగే కూలబడిపోయాడు.

—చంద్రప్రతాప్



# చతుర ప్రవేశిక



## ఏప్రిల్ - 09

ఏప్రిల్ 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. జయంతి విడాకులు ఇచ్చింది ఎవరికి?
2. స్వస్తికా ఏం పనిచేస్తోంది?
3. తాళాలగుత్తి ఎవరిదగ్గర ఉంది?
4. కైలాష్ భార్య పేరేంటి?
5. కృపాకర్ దంపతులు హనీమూన్‌కు ఎక్కడికి వెళ్లారు?
6. దీపికా పడుకొనె తండ్రిపేరు?
7. నేపుల్స్ విముక్తికి డ్యూమా ఎవరితో చేతులు కలిపాడు?
8. జడ్జి ముందు భారతీయసంస్కృతిపై లెక్చరిచ్చిన మహిళ?
9. శరత్‌చంద్ర ఏ నవలను బ్రిటిష్‌వారు నిషేధించారు?
10. కువెంపు ఏ రచనకు జ్ఞానపీఠం లభించింది?

---

పంపినవారి పేరు: ------------------------------ వయసు (  )

చిరునామా: ----------------------------------------

----------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

OK

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78